# సంస్కృత నాటక ప్రయోగరంగము

(ఆధునిక సంస్కృత నాటకరంగ శతాబ్ది మహోత్సవముల
సందర్భమున వ్రాయబడిన పరిశోధనా వ్యాసముల సంపుటి)

రచయిత

ఓగేటి అచ్యుతరామశాస్త్రి, యమ్. ఏ.

సంస్కృత థియేటరు ప్రచురణ

హైదరాబాదు.

ఖాట్టం శ్రీరామమూర్తి,
సాంఘిక సంక్షేమం, సాంకేతిక విద్యామంత్రి
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.

# ప్రస్తావన

ప్రపంచ తెలుఁగు మహా సభలను దిగ్విజయంగా జరుపుకొన్న ఈ తెలుఁగు సంస్కృతీ సంవత్సరంలోనే మన ఆంధ్ర ప్రదేశ్‌లో సంస్కృత నాటకోత్సవాలను కూడ నిర్వహించాలని సంస్కృత భాషా నాటక కళాభిమానులు కొందఱు తలపెట్టటం హర్షదాయకమైన విషయం. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని వ్రాయబడిన ఈ పుస్తకానికి ప్రస్తావన పలికే అవకాశం కలిగినందుకు ఆనందంగా ఉన్నది.

సంస్కృతానికి ప్రపంచ భాషలలో మహోన్నతమైన స్థానమే ఉన్నది. ఇది మనదేశ భాషలలో చాలా వాటికి తల్లిగా, కొన్నింటికి తల్లివంటిదిగా పరిగణింపబడుతున్నది; తెలుఁగుతో సహా ఇవన్నీ సంస్కృతంనుండి జీవసారాన్ని పీల్చుకొని విలసిల్లుతున్నవే. అసలు మన సంస్కృతియొక్క తల్లి వేఱు సంస్కృత భాషలోనేగదా పాదుకొని ఉన్నది।

తెలుఁగువారు సంస్కృత భాషకు చేసిన సేవ అపారమైనది. వేద శాస్త్ర పురాణములకు వ్యాఖ్యానాలు సంతరించిన విద్యారణ్యాది మహర్షుల సంతతి మనకున్నది. జగన్నాధ విద్యానాధులవంటి ఆలంకారికులు, మల్లినాధసూరివంటి వ్యాఖ్యాతృ చక్రవర్తులు, అన్నంభట్టువంటి తార్కికులు ఇక్కడ జన్మించారు. ఇక నాటక ప్రక్రియకువస్తే రత్నపాంచాలికను రచించిన సర్వజ్ఞ సింగభూపాలుఁడు, జాంబవతీ పరిణయాన్ని వ్రాసిన శ్రీకృష్ణదేవరాయలు, ఉషారాగోదయము, యాయాతి చరిత్ర అను నాటకాలను వెలయించిన ప్రతాపరుద్ర చక్రవర్తి,

ప్రతాపరుద్ర కల్యాణమనే నాటకోదాహరణాన్ని అందించిన విద్యానాథుఁడు మొదలగు ప్రాచీన నాటకకర్తలున్నారు. ఆధునిక నాటక రచయితలను గూర్చి ఈ పుస్తకంలో ఒక వ్యాసమే వ్రాయబడింది. ఈ గ్రంథంలో ఒకచోట భవభూతి ఆంధ్రుడేమోనని శ్రీవేదంవారు సందేహించినట్లు చెప్పబడింది (పుట 36). మరొకచోట వేణీసంహారనాటక కర్తయైన భట్టనారాయణుఁడు భారత రచనలో నన్నయకు తోడ్పడిన నారాయణభట్టు కావచ్చుననే ఊహలున్నట్లు వ్రాయబడింది (పుట44). ఒకవేళ ఈరెండూగనక నిజమైతే మన తెలుఁగులకు సంస్కృతంలో యింతకు మించిన స్థానమేంకావాలి !

సంస్కృతంలో భాస కాళిదాసాది మహా కవుల నాటకాలనేకం ఉన్నవి. భాసునిచేతిలో నాటక ప్రక్రియ పలుపోకడలు పోయిందనీ, రంగస్థల నియమాలనుబట్టి చూస్తే ఈతని రూపకాలు చాలా గొప్పవనీ పండితులభిప్రాయ పడుతున్నారు. కాళిదాసుకు రంగస్థల పరిచయం బాగా ఉన్నదని, ఆతడు స్వయంగా నాటకాలు వేయించి ఉంటాడని, కాబట్టే తన నాటకాలలో అంత అద్భుతమైన Stage craft ను పొందుపఱచాడని విజ్ఞులు భావిస్తున్నారు. దీనిని బట్టి కేవల నాటక కర్తలు వ్రాసిన నాటకాలకంటె ప్రయోక్తలైన నాటక కర్తలు వ్రాసిన నాటకాలే మేలురంగా ఉంటాయని తేలుతున్నది. షేక్స్పియరు నటుడు, ప్రయోక్తకావటంవల్లనే ఆతని నాటకాలు ఇంతగా రాణిస్తున్నవని చెప్పటంవింటూనే ఉన్నాముగదా!. ఈ సంస్కృత నాటకాలన్నీ పూర్వం ప్రయోగింపబడుతూనే ఉన్నవని వీటిల్లోని ప్రస్తావనలను బట్టి స్థూలంగా చెప్పుకోవచ్చు. ఇంతకుమించిన ఆధారాలేవీ ప్రాచీన సంస్కృత నాటక ప్రయోగాలను గూర్చి చెప్పుకోటానికి లేవు. ఇక ఆధునిక సంస్కృత నాటక ప్రయోగరంగ చరిత్రను గూర్చి ఈ పుస్తకంనుండి తెలుసుకోవచ్చు.

ఇందులో విజయనగర సంస్థానాధీశ్వరులైన శ్రీ విజయరామ విజయానంద గజపతులు 1874లో "జగన్నాథ విలాసినీ సభ" అనే సంస్కృత నాటక సంస్థను స్థాపించి ఆధునిక కాలంలో సంస్కృత నాటక ప్రయోగాలకు శ్రీకారం చుట్టింది మొదలుకొని 1975లో ప్రపంచ తెలుఁగు మహా సభలలో హైదరాబాద్ "సంస్కృత థియేటరు"వారు ప్రదర్శించిన సంస్కృత నాటకం వరకు ఆంధ్రప్రదేశ్‌లో ప్రవర్తిల్లిన ఈ వంద సంవత్సరాల సంస్కృత నాటక ప్రయోగాలను

గూర్చి వ్రాయబడింది. ఆంధ్ర ప్రదేశ్‌లోని ఇరవైయొక్క జిలాలకుగాను కోస్తా, రాయలసీమ, తెలంగాణ ప్రాంతములకు చెందిన సుమారు పదిహేనుజిల్లాల విషయం ప్రస్తావించబడింది పూర్వం మద్రాసులో తెలుగువారికిగల సంబంధాన్నిబట్టి అక్కడా, బొంబాయి, ఉజ్జయిని, కాశీ మొదలగుచోట్ల తెలుగువారే నిర్వహించిన నాటకాల విషయం కూడా పొందుపఱచబడింది.

—

ఈ వ్యాసాలను సూక్ష్మ దృష్టితో పరిశీలిస్తే ఈ నూఱేండ్లలోనూ ప్రతి దశాబ్దం పొడవునా సంస్కృత నాట్యరంగం చైతన్యవంతంగా పనిచేసినట్లు గోచరిస్తుంది. మరీ అంత బహుళంగాను, మరీ అంత విరళంగాను గాక మధ్యస్థంగా తైలధారవలె అవిచ్ఛిన్నంగా కొనసాగిందని చెప్పవచ్చు. ఈ నాటకాలను ప్రయోగించిన వారిలోనూ, ప్రయోగింపజేసిన వారిలోనూ, అనేక తరగతుల వ్యక్తులు కనిపిస్తారు. మహారాజులు, పండితులు, ఉన్నతోద్యోగులు, సామాన్యులు, విద్యార్థులు, విదేశీయులు-ఇట్లందరూ పాల్గొనటం విశేషమేనని చెప్పాలి.

ఈ నాటకాలను కేవలం భాషా దృష్టితోనూ కళాదృష్టితోనూగాక జాతీయ భావనావిలసితమైన సామాజిక దృక్పథంతో సమన్వయించి ప్రయోగించిన వ్యక్తులు కొందఱు ఈ పుస్తకంలో తారసపడతారు. వారిలో ప్రధానమైన వ్యక్తి శ్రీ గోమఠం సి.వి. శ్రీనివాసాచార్యులుగారు (పుటలు 25—34) "సత్యాగ్రహి విజయః" అనే సంస్కృత నాటకరచన (పుట 74), "దేశ రక్షణ నిధికి వేణీ సంహారం" నాటక ప్రయోగం (పుట 99, 100) మొదలైనవి కూడ ఇందుకు తార్కాణం. ప్రపంచ తెలుగు మహా సభలలో ప్రయోగింపబడిన ప్రతాపరుద్ర పట్టాభిషేకంపై వ్రాసిన వ్యాసంలో ఈ నాటక కర్తయైన విద్యానాథుఁడు ఇందులో ప్రతిపాదించిన ఆంధ్ర దేశాభిమానాన్ని, భారతదేశ భక్తిని, విశ్వమానవ శ్రేయస్సును వివరించి మహా సభల నిర్వహణలో ప్రభుత్వం యొక్క ధ్యేయంగూడా ఈ మూడు విషయాలను ప్రబోధించటమేనని చెప్పి చక్కని సమన్వయాన్ని చూపించారీ రచయిత.

ఇందులోని వ్యాసాలు రెండు విధాలుగా ఉన్నవి. అనేక గ్రంథాలను అవలోడనచేసి కనుగొన్న విషయాల ప్రాతిపదికపై వ్రాసినవికొన్ని, ఇంతవఱకు లిఖితంగాని వాటిని తొలిసారి గ్రంథస్థంచేసిన మౌలిక రచనలు కొన్ని. ఇవన్నీ

విషయవైవిధ్యంతో వేనికవి ప్రత్యేకతను కలిగియున్నవి. పుస్తకమును చదివే టప్పుడు ఈ విషయం పాఠకుల అనుభవంలోకి రాగలదు. ఈ రచయితకు చాలా కాలంగా సంస్కృత నాటక ప్రయోగాల అనుభవం ఉన్నట్లు ఈ పుస్తకం వల్ల తెలుస్తున్నది. వీరు స్వయంగా నటులు, నాటక ప్రయోక్తలు, ఒక సంస్కృత నాటక సంస్థకు కర్ణధారులు (సంస్కృత థియేటరు). ఈ అనుభవంతో మంచి భాషలో ఈ పుస్తకాన్ని వ్రాశారు. ఆంధ్రప్రదేశ్‌లో ఆధునిక సంస్కృతనాటకప్రయోగరంగాన్నిగూర్చి యింతకాలానికి యిట్టి పుస్తకం వెలువడటంముదావహం. పుస్తకం సహృదయులైన పాఠకుల చేతుల్లోఉన్నది సెలవు.

హైదరాబాదు
18-7-1975

(సం) భాట్టం శ్రీరామమూర్తి

గుండేరావ్ హర్కారే,
రిటైర్డు సెషను జడ్జి, గద్వాల
వాచస్పతి (నవద్వీప), శిరోమణి (మెద్రాస్),
విద్యాభూషణ (బెల్గాం), విద్యాభాస్కర (ఋషికేశ్),
విశిష్టసభ్యులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ,
సంస్కృత భాషా పాండిత్యమునకు
రాష్ట్రపతి అవార్డు గ్రహీత.

# అభిప్రాయము

శ్రీ ఓగేటి అచ్యుతరామ శాస్త్రిగారు రచించిన "సంస్కృత నాటక ప్రయోగరంగము"ను కడు నుత్సాహముతో క్షుణ్ణముగా పరిశీలనతో చదివితిని. తెలుఁగుదేశమున సంస్కృత భాషానాటక ప్రయోగరంగముపై వెలువడిన తొలి గ్రంధమిది యని వెంటనే భావించితిని. ఇది కేవలము సమాచారము నిచ్చు పుస్తకమే గాక అడుగడుగున భావపూర్ణములగు విషయములతో నిండి ఆలోచనలను రేకెత్తించగలిగి కర్తవ్యోన్ముఖుని చేయగల గ్రంధమని తలంచుచున్నాను. ఇందలి శైలి విషయ ప్రాధాన్యమునకు తగిన భాషా గౌరవముతో నొప్పుచు ప్రసాదగుణ భూయిష్ఠమైయున్నది. ఇందలి ప్రకరణ విభాగము కాలసరణిని బట్టి గాక ప్రతిపాద్య విషయ హేతుసరణిని బట్టి చేయబడినది. శ్రీ శాస్త్రిగారు చేసిన కృషి అపూర్వమైనది. "సంస్కృత భాషా నమృతా కింత్వమృత రూపిణీ" యను సిద్ధాంత మీ గ్రంధములో బహు చక్కగా, సయుక్తికముగా నిరూపింపబడినది. భాష సజీవమై మనోరంజకముగా నుండుటకు నాటకమే తగియున్నదని చెప్పవచ్చును. ఇందు అవిచ్ఛిన్నముగా నూఱు సంవత్సరములలో సంస్కృతనాటకము లచ్చటచ్చట జరిగినట్లు చారిత్రక ప్రమాణములు చూపబడినవి. ఇది శ్లాఘనీయమైన విషయము. సంస్కృత భాష తన పద విన్యాసము,

సుగుణములు భావగాంభీర్యము వలన విద్వాంసుల నాకర్షించుచున్నది. ఈ స్వారస్య మితర భాషలకు లేదని వీరు ప్రత్యక్ష ప్రమాణములతో నిరూపించి నారు.

శ్రీ శాస్త్రిగారు సంస్కృత భాషా నాటక ప్రయోగ పునరుద్ధారకులని చెప్పినచో చాలదు-గీర్వాణ భాషోద్ధారకులని చెప్పినచో కూడ అతిశయోక్తికాదని నేను విశ్వసించుచున్నాను. ఈ గ్రంథమున చెప్పిన దానిని బట్టియు, గద్వాల సంస్థానమున నేను పొందిన అనుభవమును బట్టియు విజయనగరము, గద్వాల, పిఠాపురము సంస్థానములు నిజముగా సంస్కృత భాషా విషయమున విశ్వవిద్యాలయములు కూడ చేయలేని పనులు చేసిన వనుట నిష్కర్ష. ప్రభుత్వము వారీ గ్రంథములో వ్రాయబడిన విషయములు చక్కగా పరిశీలించి, విశ్వవిద్యాలయ ములలో సంస్కృత నాటక ప్రయోగ పద్ధతి శిక్షణకు పీఠములు నెలకొల్పగల రని విశ్వసించుచున్నాను. లేక ప్రభుత్వమే ఈ విషయమై కళాశాల నొకటి స్థాపించి సంస్కృత భాషాభివృద్ధికి దోహదము చేయగలదని కోరుచున్నాను. ప్రస్తుతము సంస్కృత భాషాభివృద్ధికి పలువురు పలుప్రయత్నములు చేయు చున్నారు. దీనికి ప్రభుత్వము కూడ బహుసహాయము చేయుచున్నది. నాటక ప్రయోగ ప్రక్రియ ద్వారా భాషాభివృద్ధికి జరుగు ప్రయత్నములలో కొంత వెను బాటు కన్పించుచున్నది. దానిని పూరించి సంస్కృత భాషకు సర్వాంగ సౌంద ర్యమును సంతరించుటకు ఇట్టి శిక్షణ కళాశాలను స్థాపించుటెంతేని ముఖ్యము.

శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్ల హిందీభాషలలో మంచి పాండిత్యము గల వారు. వీరు స్వయముగా నటులు. నాటక ప్రయోక్తలు. కాని, నాటక రచ యిత లైనటు తోచదు. వీరు స్వయముగా మంచి సంస్కృత నాటకములు వ్రాయ గలరనియు, వాటిని స్వయముగా ప్రయోగించి సంస్కృత నాట్య ప్రయోగ ప్రక్రియా రంగమున భావితరములకు ఆచార్యత్వము వహించగలరనియు ఆశించుచున్నాను.

హైదరాబాదు (సం) గుండేరావుహరకారే
28-7-1975

# కృతజ్ఞతలు

ఈ పుస్తకమును వ్రాయుట కెంతకష్టమయ్యెనో ప్రచురించుట కంత సులభమయ్యెను. వ్రాసినదే తడవు దీనిని తీసుకొనిపోయి ఉదారహృదయులును, సంస్కృత భాషాభిమానులునూనైన శ్రీ జి. పుల్లారెడ్డి గారి సమ్ముఖమున నుంచి (సుప్రసిద్ధ నేతిమిఠాయి వ్యాపార యజమానులు) నాయీ సంస్కృత నాటక ప్రయోగ పునరుద్ధరణోద్యమ కార్యక్రమమును గూర్చియు, ఈ గ్రంథ రచనాదికమును గూర్చియు మనవి చేసితిని. వెంటనే వారీ పుస్తకమును పరిశీలించి ముద్రణకగు వ్యయము నంతటిని తామే భరింతుమని చెప్పి నా ప్రయత్నములను ప్రోత్సహించి నన్నాశీర్వదించిరి. తత్ఫలితముగనే యీ పుస్తకమును మీచేతులయందుంచ గల్గుచున్నాను.

ఎటుచూచినను క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చుచున్న యీ రోజులలో స్వార్థరహితులై ధర్మప్రచారాభిలాషతో యిట్టి మహత్కార్యములకు చేయూత నిచ్చుచున్న వీరి వంటి సత్పురుషు లుండుట వల్లనే దేశమున ధర్మకార్యములు నిర్విఘ్నముగ పరిసమాప్తి నందుచున్నవి. నిరాడంబరులు, మృదుభాషణులు, సౌజన్యమూర్తులు, అమృతహృదయులు, ఉత్తమ దేశభక్తులూనైన శ్రీ రెడ్డిగారికి సంస్కృత భాషా నాటక కళాభిమానుల పక్షమున హృదయపూర్వక కృతజ్ఞతలు ప్రకటించుచూ వారి కుటుంబమునకును, సుహృద్బంధుబృందమునకును సర్వశక్తి మంతుడగు పరమేశ్వరుఁడు ఇతోధికముగ సర్వమంగళములను సమకూర్చుగాక యని ప్రార్థించుచున్నాను.

ఈ పుస్తక రచనకు ఎందఱో మహనీయుల గ్రంథము లుపకరించినవి. వారి పేర్లను, గ్రంథములను, పుటలను ఎక్కడికక్కడ ఉల్లేఖించితిని. మఱల పేర్కొనజాల నందుకు మన్నింపవలసినదిగా కోరుచూ వారికిని, ఎందఱో మహానుభావులను వ్యక్తిగతముగ సందర్శించియు, ఉత్తరములు వ్రాసియు విష యములను సేకరించితిని వీరికిని, దీనిని సంస్కృత థియేటరు పక్షమున ప్రచు రించుట కంగీకరించిన మిత్రులకును, నిర్దుష్టముగా చక్కగా ముద్రించి యిచ్చిన దక్షిణ భారత్ ప్రెస్సువారికిని హృదయ పూర్వక ధన్యవాదము లర్పించు చున్నాను.

బాల్యమునుండియు సంస్కృతభాషాధ్యయనమునందు నాకభిరుచిని కల్పించి నా యభివృద్ధికి ఘంటా పథమును నిర్మించిన నా పితృదేవులు కీ॥శే॥ శ్రీ ఓగేటి సాంబమూర్తిగారికిని, నాకు సంస్కృత విద్యా గురువులగుటయేగాక నాచేత తొలిసారి సంస్కృత నాటకమును ప్రయోగింపజేసిన పూజ్యులు శ్రీ చల్లా సత్య నారాయణశాస్త్రి గారికిని, ఈ రంగమున ఆదినుండియు నాకు మార్గ దర్శకులుగా నున్న మా అన్న శ్రీ ఓగేటి పరీక్షిత్ శర్మగారికిని భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లు చున్నాను. ఈ పుస్తక రచనలో అనేక విధముల సహాయపడిన మిత్రులు శ్రీ నోరి హనుమచ్ఛాస్త్రిగారికిని, శాంతమూర్తిగారికిని తదితరులకును ధన్యవాద ములు తెలుపుకొనుచున్నాను.

తమ అమూల్యమైన సమయమును వెచ్చించి ప్రస్తావన వ్రాసిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంఘిక సంక్షేమం, సాంకేతిక విద్యా శాఖా మాత్యులు గా॥ శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారికిని, అభిప్రాయమును చెప్పిన పూజ్యులు శ్రీ గుందేరావుహర్కారేగారికిని మనఃపూర్వక నమోవాకము లర్పించుచున్నాను.

ఓగేటి అచ్యుతరామశాస్త్రి

# శ్రీ విజయరామ గజపతీంద్రుని

# సంస్కృతభాషా నాటక కళాపోషణ

ఆంధ్రప్రదేశ్‌లోని పూర్వపు స్వదేశీ సంస్థానములలో విశాఖపట్టణం జిల్లాలోని విజయనగర సంస్థానము సంస్కృతభాషా పోషణకు సంస్కృత నాటక కళాపోషణకు పెట్టినది పేరుగా విలసిల్లినది. ఆధునిక కాలమున ఈ సంస్థానమును పరిపాలించిన ప్రభువులలో సుప్రసిద్ధుఁడు శ్రీ విజయరామ గజపతీంద్రులు. వీరు 1825లో జన్మించి 1879లో మరణించిరి. 1851లో సంస్థానాధిపత్యమును చేపట్టి దాని కాధునిక పద్ధతులలో సర్వతోముఖమైన అభివృద్ధిని సంతరించి పెట్టిన ఘనత వీరికే దక్కుచున్నది. వీరి ప్రాపున సంస్కృతము తెలుఁగు మొదలగు భాషా సాహిత్యములు, సంగీతము, నాట్యము, నాటకములు మొదలగు సర్వ కళలూ సర్వోత్కర్షలతో వర్ధిల్లినవి. శ్రీయుతులు మండ కామేశ్వరశాస్త్రి, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, ముడుంబై వరాహ నరసింహస్వామి, శ్రీపాద చెలమయ్య, భాగవతుల హరిశాస్త్రి, మైసూరు భీమాచార్యులు, లింగము లక్ష్మాజీరావువంటి మహా విద్వాంసు లెందరో వీరి యాస్థానమున వెలుగొందిరి. శ్రీ విజయరాముని పరిపాలనమున ఈ విజయనగర మెట్టి సిరిసంపదలతో తులతూగినదో శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు వర్ణించి చెప్పిన పద్య మొకటి శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుఁడుగారి సుపుత్రులు శ్రీ భావనారాయణగారు రచించిన "విజయనగరంలో సంగీత నృత్య విద్వాంసులు" అను వ్యాసమునుండి లభించుచున్నది. (చూ. నాట్యకళ. ఆగష్టు 1973) దాని నిక్కడ ఉటంకించుచున్నాను.

> తఱచుగనల్లి తామరతంపరగఁ జివు
> రించెడు విద్దెలమించు నెద్ది
> సమద గజేంద్రాశ్వ సంపద నలరారి
> విజయరామ విభూతి పెంచె నెద్ది

సంతత రత్న కాంచన సమృద్ధిన వారి
నెఱి నలకారేఖనించె నెద్ది
యానంద పరవశంబై జగన్నాథ వీ
క్షణమున నభివృద్ధి గాంచె నెద్ది
కోట పేటలకునుఁ బూవుతోటలకును
నీటు బోటుల కతి చిత్ర నాటకముల
కాట పాటల కుద్యోగి కూటములకు
నాటపట్టెద్ది యవ్విజయనగర మిద్ది

## సంస్కృత పాఠశాలా స్థాపన

శ్రీ విజయరామ గజపతులు 1851లో సంస్థానాధీశ్వరులైన పిమ్మట ఆ మరునటి సంవత్సరమే 1852లో విజయనగరమున సంస్కృత పాఠశాల నొకదానిని స్థాపించి కాశీనుండి మహా పండితులను రావించి అందు అధ్యాపకులుగా నియమించిరి. వారి చేతిమీదుగా ఆ పాఠశాలనుండి ఎందరెందరు ప్రతిభావంతులుద్భవించిరో చెప్ప నలవిగాదు. అదిభట్ల నారాయణదాసు, తాతా సుబ్బరాయుడుశాస్త్రి, వఝ్ఝల చిన సీతారామశాస్త్రి, వేదాల తిరువేంగళాచార్యులు, జమ్మలమడక మాధవరాయశర్మ, ధర్మాల సుబ్బరాయశాస్త్రి, ముళ్ళపూడి మల్లికార్జునశాస్త్రి, వాజపేయాజుల వెంకటేశ్వరశాస్త్రి మొదలగు నేడు మన మెఱిగిన దిగ్గంతులందరూ అందధ్యాపకులుగానో, విద్యార్థులుగానో సంబంధము కలిగి యున్నవారే. ఆ పాఠశాల తరువాత కళాశాలగా మాఱి యీ నాటికీ ఆంధ్ర ప్రదేశ్‌లోని కళాశాల లన్నింటికీ తల మానికముగా వెలుగొందుచునే యున్నది. ఆనాడు ఆ పాఠశాలలో ఏ యే శాస్త్రములు బోధింపబడుచుండెడివో అప్పటి సంస్థా నాంధ్ర విద్వత్కవి శ్రీ మండ కామేశ్వరశాస్త్రి రచించిన "రామ కథా సార సంగ్రహము" అను మూడాశ్వాసముల ప్రబంధములోని అవతారికయందలి పద్యముగా కళాప్రపూర్ణ శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ "విజయనగర సంస్థానము—ఆంధ్ర వాఙ్మయ పోషణ" అను గ్రంథమునందు 86 వ పుటలో ఉల్లేఖించిన ఈ క్రింది పద్యము వలన తెలియుచున్నది.

వ్యాకరణంబు కావ్యములు తర్కంబును
మహితమే పూర్వ మీమాంస సూత్ర
భాష్యంబు గణిత ప్రపంచంబు ధర్మ శా
స్త్రము నలంకార శాస్త్రమును నాట
కములును ప్రాతిశాఖ్యయు శిక్షలును శ్రౌత
పటు విద్యారణభాష్య మింక
పద జట క్రమ ఘన పటు తరాఖ్యాన నం
ఘటిత రీతి క్రియావలన మెఱయ
వేదములు నివి మొదలగు విద్యలెల్ల
పండితులచేత విద్యార్థి పటలమునకు
ప్రబల చెప్పంగ విభునాజ్ఞ పాఠశాల
నవ్యముగ నుంచె శ్రీ జగన్నాథ విభుఁడు.

పద్యము చివఱ పేర్కొనబడిన శ్రీ జగన్నాథ విభుఁడు విజయరామ గజపతి కాలముననూ, వారి కుమారులు ఆనంద గజపతి కాలముననూ, సంస్థానమునందు మంత్రిసత్తముడై సంస్థానాభివృద్ధికి ఎంతో కృషి చేసిన శ్రీ పెనుమత్స జగన్నాథ రాజుగారు. వీరు విజయరాముని ఆజ్ఞ మేఱకు ఈ పాఠశాలా స్థాపనమునందునూ నిర్వహణమునందునూ కీలకమైన పాత్ర వహించినట్లు ఈ పద్యమువలన తెలియు చున్నది.

## జగన్నాథ విలాసినీసభ సంస్కృత నాటక సమాజము

శ్రీ విజయరామ గజపతులకు సంస్కృత భాషాభిమానముతోపాటు సంస్కృత నాటక కళాభినివేశముకూడ మెండు. సంస్కృత పాఠశాలను స్థాపించిన పిమ్మట సుమారు ఇరవైరెండు సంవత్సరములకు, 1874లో విజయ నగరమున "జగన్నాథ విలాసినీ సభ" అను సంస్కృత నాటక సమాజము నొకటి స్థాపించి పండితులచేత అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము, ఉత్తరరామ చరితము, మొదలగు సంస్కృత నాటకముల నాడించెడివారు. ఈ సమాజము నందలి నటులందరూ సంస్కృతమునందు గొప్ప పండితులు. సంగీత ప్రావీణ్యముగలవారు, సుస్వరరూపులు. గంటి బుచ్చిశాస్త్రి అనువారు ఈ సమాజమునకు దేశికులుగా నుండిరి. వీరు సంస్కృతాంధ్రములందు మహా

పండితులు, శాస్త్రీయ సంగీతము భరతముకూడ నేర్చిన దిట్ట. స్ఫురద్రూపి, కమ్మని గాత్ర సంపద గలవారు. 1880 వఱకు ఈ మూడు నాటకములందునూ దుష్యంత, పురూరవ శ్రీరామ పాత్రములను వీరే వహించుచుండెడివారు. ఈ సమాజమున వీరికిగల ప్రాధాన్యమునుబట్టి దీనికి బుచ్చిశాస్త్రి కంపెనీ అను పేరు బడినది. శ్రీ గురజాడ అప్పారావుగారు తమ డైరీలలో ఈ సమాజమును గూర్చి బుచ్చిశాస్త్రి కంపెనీ, విజయనగరం జట్టు, మహారాజావారి నాటక సమాజము అను పేళ్ళతో వ్యవహరించిరి. ఇది కేవలము సంస్కృత నాటకములను మాత్రమే ప్రయోగించుచుండుట వలన దీనికి "సంస్కృత నాటక అకాడమీ" అను పేరుకూడ ప్రచారములోనికి వచ్చినది. విజయరామ గజపతి 1879లో దివంగతులైన పిమ్మట మహారాజైన వారి కుమారులు శ్రీ ఆనంద గజపతి ఈ సమాజమును మఱింత అభివృద్ధికి తీసికొని వచ్చిరి.

## స్థాపనాకాలము - అభిప్రాయ భేదములు

ఈ సమాజముయొక్క స్థాపనా కాలమును గూర్చియు, స్థాపించిన వారిని గూర్చియు పండితుల నడుమ కొంత అభిప్రాయభేదము కాన్పించుచున్నది. విజయరామ గజపతులే 1874లో స్థాపించిరని కొందఱు. కాదు తదుపరి వారి కుమారులు ఆనంద గజపతులు స్థాపించిరని కొందఱు, భావించుచున్నారు.

## 1. విజయరామ గజపతులే 1874లో స్థాపించిరని యీక్రిందివారు చెప్పిరి

### శ్రీ వసంతరావు బ్రహ్మాజీరావుగారు.

వీరినిగూర్చిన వివరముల కొఱకు ఇటీవల విజయనగరం మహారాజా కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసి రిటైరైన శ్రీ వసంతరావు వెంకటరావుగారిని కలుసుకొన్నప్పుడు అడుగగా ఇట్లు చెప్పిరి. శ్రీ బ్రహ్మాజీరావుగారు శ్రీ వసంత రావు వెంకటరావుగారికి స్వయానా అన్నగారు. విజయనగరములో పేరు పొందిన న్యాయవాదులు. 1899లో జన్మించి 1969లో మరణించిరి. సంస్కృత భాషా కళాభిమానము గలవారు. శ్రీ గురజాడ అప్పారావు గారికి వారిపై అమిత వాత్సల్య ముండెడిది. వితరణశీలి అని. ఈ బ్రహ్మాజీ రావుగారు, ఈ సమాజమును ఆనందగజపతి స్థాపించిరనుట సత్యము కాదనియు, శ్రీ విజయరామ గజపతి కాలములోనే (1874లోనే) ఇది స్థాపింపబడెననియు

తమకు తెలిపినట్లు డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు తమ తెలుఁగు నాటక వికాసములో వ్రాసిరి. (పుట 567)

## డా॥ పి. యస్. అర్. అప్పారావుగారు

వీరు తొలుత వ్రాసి ప్రకటించిన తెలుఁగు నాటక వికాసమునందు ఈ విషయమును గూర్చి చర్చించిరి. కాని "మహారాజా శ్రీ విజయరామ గజపతి వారి ఆదరణలో జగన్నాథ విలాసినీసభ అను నాటక సమాజము 1874లో స్థాపింపబడినట్లు తెలియుచున్నది?" అని చెప్పి వాక్యము చివర ప్రశ్నార్థక చిహ్నముంచిరి. (పుట 508) దీని వలన అప్పటికి వారికిగల సందేహాస్పద పరిస్థితి వ్యక్తమగుచున్నది. దరిమిలా వారే 1968లో ప్రకటింపబడిన నాట్య కళ, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ దశాబ్ద ప్రగతి 1957—1968 విశేష సంచికలో వ్రాసిన "శ్రీ గోమఠం సి. వి. శ్రీనివాసాచార్యులు" అను వ్యాసమునం దిట్లు స్పష్టముగ వ్రాసిరి,

"క్రీ. శ. 1874 ప్రాంతముల విజయనగరములో శ్రీ విజయరామ గజపతి మహారాజావారి పోషణములో నెలకొన్న జగన్నాథ విలాసినీ నాటక సమాజము సంస్కృత నాటకములకు ప్రసిద్ధి కెక్కినది. 1879లో శ్రీ విజయరామ గజపతి మహారాజావారు స్వర్గస్థులైనారు. అటుపిమ్మట మహారాజైన శ్రీ మదానంద గజపతి మహారాజావారి ఆదరణములో ఈ సమాజము మఱింత అభివృద్ధి చెందినది." (పుట 68)

## శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారు

వీరు "ఉషః కిరణాలు" అను గ్రంథమునందు 259 వ పుటలో యిట్లు వ్రాసిరి:

"1874లో విజయనగరములో ఆనంద గజపతి తండ్రి విజయరామ గజపతివారి కాలములోనే జగన్నాథ విలాసినీ సభ యను సమాజమున్నది. 1879లో ఆనంద గజపతిగారు దీనిని తమ ఆధ్వర్యములోనికి తీసుకొని సంస్కృత నాటకము లాడించెడివారట..............."

వీరొక వైపున ఈ సమాజము 1874లోనే శ్రీ విజయరామ గజపతి కాలముననే ఉన్నట్లు వక్కాణించుచూ మఱొక వైపున సంస్కృత నాటకములు

మాత్రము 1879 నుండి ఆనంద గజపతుల కాలము నుండియే ప్రయోగింపబడు చుండినట్లు అర్థమువచ్చు రీతిగా వ్రాసిరి. ఇది సరిగాదు. స్థాపింపబడిన నాటి నుండియు ప్రధానముగా ఇది సంస్కృత నాటక సంస్థగానే వర్ధిల్లినది. ఇక్కడొక చిన్న తరతమ భేదముల విశ్లేషణము అవసరము. ఇది 1874లో స్థాపింపబడిన తరువాత 1879 వఱకు—ఆఱు సంవత్సరముల కాలము మాత్రమే—విజయరామ గజపతి అధీనములో నుండెను. ఇదంతయు ప్రారంభదశగా పరిగణింపవలెను. ఈ దశలో సంస్కృత నాటక ప్రయోగములు సహజముగా మందకొడిగా సాగి యుండుట కవకాశ మున్నది. అనగా చెప్పుకో దగినంత సంఖ్యలో నాటక ప్రయోగములు జరిగి ఉండక పోవచ్చును. ఆనంద గజపతుల యధీనములోనికి వచ్చిన తరువాత సంస్కృత నాటక ప్రయోగములు మహోద్యమముగా కొనసాగినవి. ఈ రెండవదశ కొట్ట వచ్చినట్లు కనబడుచున్నది. కావున సత్యనారాయణరావుగారు భ్రమపడి యిట్లు వ్రాసి యుండవచ్చునని సవినయముగా మనవి చేయుచున్నాను.

## 2. ఆనంద గజపతులే దీనిని స్థాపించిరని యీ క్రిందివారు చెప్పిరి.

### శ్రీ పసుమర్తి యజ్ఞ నారాయణశాస్త్రిగారు

ఆధునిక తెలుఁగు నాటక విమర్శకులలో శ్రీ పురాణం సూరిశాస్త్రిగారిది ప్రథమస్థానమనియు శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారిది ద్వితీయస్థానమనియు పెద్దల తలంపు. యజ్ఞనారాయణశాస్త్రిగారు 1930 లో "ఆంధ్ర నట ప్రకాశిక" అను గ్రంథమును వెలువరించిరి. అందు ఈ సమాజమును గూర్చి వారు తేల్చిచెప్పిన సారాంశమిది:—

"ఈ సంస్థను ఆనందగజపతులే స్థాపించిరి. కోటలో మాత్రమే ప్రయోగములు జరిగెడివి. స్వయముగ మహారాజావారే ప్రదర్శనములకు నాయకత్వము వహించెడివారు" (పుట 567).

అభినవ వాగనుశాసన, మహామహోపాధ్యాయ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి వర్యులు. వీరు 1915 లోనే తమ ''ఆంధ్ర దశరూపకము" అను గ్రంథమును రచించిరి. 1967 లో ప్రచురింపబడిన ముద్రణప్రతియందు 6 వ పుటలో యిట్లు వ్రాక్రుచ్చిరి.

"పందొమ్మిదవ శతాబ్ది యుత్తరభాగమున విజయనగర సంస్థానాధీశ్వరులైన శ్రీ మదానంద గజపతి మహారాజులవారు నాట్యరంగము నిర్మింపఁజేసి పండితులచే శాకుంతలాది సంస్కృత నాటకము లభినయింపఁజేసి యాంధ్ర దేశమున నాటక ప్రదర్శనమునకు శ్రీకారము చుట్టిరి."

డా॥ దివాకర్ల వేంకటావధానిగారు :-

వీరు 1936లో "ఆంధ్రనాటక పితామహుడు" అనుగ్రంథమును వ్రాసిరి. 1964 నాటి ముద్రణప్రతియందు 12వ పుటలో ఇట్లు సెలవిచ్చిరి :-

"19వ శతాబ్ది యుత్తరభాగమున విజయనగర పురాధీశ్వరులగు శ్రీ మదానంద గజపతి మహారాజులుంగారు సంస్కృత నాటకముల సారము చూరలుగొన్నవారగుటచే తత్ప్రయోగ దిదృక్షువులై నాటకసంఘము నొక దానిని స్థాపించి శాకుంతలాద్యుత్తమ నాటకముల కొన్నిటి నభినయింపఁజేసిరి. తెలుఁగు దేశమున నాటక ప్రదర్శనము లారంభించుటకు అదియే ప్రథమమని స్థూలముగా చెప్పవచ్చును. కాని యీ ఉద్యమము చాలాకాలము అవిచ్ఛిన్నముగా సాగినదికాదు. మహారాజుగారి మరణముతో నాయనచే స్థాపింపఁబడిన నాటకసంఘము గూడ తూష్ణీంభావము వహింపవలసివచ్చెను.''

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు :-

ఇటీవల వ్రాసి ముద్రించిన ''ఆంధ్రనాటకరంగ చరిత్ర" యందు 446వ పుటలో యిట్లు పేర్కొనిరి :-

"1890 సం॥ సకల కళాపోషకులైన శ్రీ ఆనందగజపతిగారి నాయకత్వాన సంస్కృత భాషానాటకాలూ వాటి ప్రయోగాలూ పునరుద్ధరణ చేయాలనే సంకల్పంతో ఒక నాటకసంస్థ ఏర్పడింది."

వీరు దీని స్థాపనాకాలమును 1890 గా పేర్కొనిరి. ఇది సరిగాదేమోనని తోచుచున్నది. ఈ విషయమును పరిశీలింతము.

ప్రథమాంధ్ర నాటక కర్తలలో నొకరైన శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు 1883 డిసెంబరునెలలో ముద్రింపబడిన తమ ఉత్తరరామ చరితము అనువాద నాటకమునందు పీఠికలో శ్రీ కందుకూరి వీరేశలింగముగారు నాటకసమాజమునుగూర్చియు, వారి నాటక ప్రయోగములనుగూర్చియు ప్రస్తావించి ప్రాసం

గికముగ విజయనగరమునందు అప్పటికే పనిచేయుచున్న నాటకసమాజమును గూర్చి తడవిరి. వారు వ్రాసిన మహావాక్యమునుండి తదవయవ వాక్యమును మాత్రమే యిట నుటంకించుచున్నాను.

"..........at Vizag and Vizayanagaram similar societies have been formed with practical success.........."

దీనినిబట్టి 1883 కి పూర్వమే విజయనగరమున నాటకసంస్థయొకటి వృద్ధి విజయవంతముగ ప్రయోగములు చేయుచున్నదని స్పష్టపడుచున్నది. అప్పటికి "జగన్నాధవిలాసినీసభ" తప్ప మఱొక సమాజము విజయనగరమున లేనందువలన దీనినిగూర్చియే వారు చెప్పిరనుట నిస్సందేహమని భావింప వచ్చును. శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు 1851 లో జన్మించి 1897 లో మరణించిరి. ఆనందగజపతులు కూడ 1850 లో జన్మించి 1897 లో మర ణించిరి. కావున వీరిరువురు మిక్కిలి సమకాలికులు. వావిలాలవారు నాటకకర్త. ఆనందగజపతులు నాటక ప్రయోక్త. విజయనగరములోని నాట్యరంగమును గూర్చి వావిలాలవారు చక్కగా నెఱిగినవారనుటకు సందియములేదు. కావున ఈ సమాజము యొక్క స్థాపనాకాలము ఎట్టి పరిస్థితులలోనూ, 1883 కి పూర్వమేగాని తరువాత కాజాలదు. దీనినిబట్టి మిక్కిలినేనివారు చేసిన దీని స్థాపనాకాల నిర్ణయము సరిగాదు.

ఇట్లు ఇరుపక్షములవారి యభిప్రాయములను కూలంకషముగ చర్చించిన మీదట ఒక విషయము స్పష్టపడుచున్నది. మొదటిపక్షమువారు దీని స్థాపనా కాలము 1874 అనియు, స్థాపకులు శ్రీ విజయరామగజపతి యనియు, సమా జము పేరు "జగన్నాధ విలాసినీసభ" యనియు మిక్కిలి విస్పష్టముగ ప్రక టించిరి. రెండవ పక్షమువారు స్థాపనాకాలమును ఇదమిత్థముగ పేర్కొనరైరి. సమాజముపేరుకూడ ఫలానా అని వీరు చెప్పలేదు. ఆనందగజపతులు నాట్య రంగమును నిర్మింపజేసిరనిమాత్రమే వ్రాకుచ్చిరి. కాగా కొందఱు 19వ శతాబ్దము ఉత్తరార్ధమున అని చెప్పి 1850 నుండి 1900 సం॥ వఱకు ఎక్కడ నుండి ఎక్కడికైననూ తీసికొనుటకు వీలుగా సెలవిచ్చిరి. అసలానందగజ పతులు జన్మించినదే 1850 లో. మరణించినది 1897 లో. మఱి వీరినాట్యరంగ మును ఎప్పుడు నిర్మించినట్లు? ఎంత లేదన్ననూ 20 నుండి 25 సంవత్సర

ముల వయస్సైననూ ఉండవలెనుగదా ఇట్టి ఘనకార్యములను చేయుటకు ?. అప్పుడు, 1850 లో జన్మించిన ఆనందగజపతులు 1874 నాటికి సుమారు 25 సం॥ వయస్సు గలిగియుందురు అనుకొన్నచో ఇది మన ప్రకరణ సందర్భమునకు సరిపడుచున్నది. అనగా 1874 లో గాని ఆ తరువాతగాని ఆనందులు ఈ నాట్యరంగమును నిర్మింపజేసియుండిరని చెప్పకొనుటకు వీలు కలుగుచున్నది. ఇట్లు పూర్వాపరముల సమన్వయము కుదుర్చుకొన్నచో ఆనందగజపతులే ఈ సమాజమును స్థాపించిరని చెప్పిన వారందరూ మరీ యింత స్థూలముగా చెప్పటను ఒక వరముగా భావించి ఈ తండ్రీ కొడుకు లిరువురూ కలిసి 1874 లో దీనిని స్థాపించిరని చెప్పట సమంజసము, చరిత్ర సమ్మతము, సత్యము కాగలదని తోచుచున్నది.

## విజయరామ విజయానంద గజపతులిరువురూ కలిసిస్థాపించిరి

ఆనందగజపతి బాల్యమునుండియు సంస్కృతాంధ్రముల నభ్యసించి యుక్తవయస్సు వచ్చునాటికి గొప్ప పాండిత్యమును గడించిరి. సంగీత ప్రావీణ్యముకూడ వీరికలవడినది. బాల్యమునుండియు తండ్రితోపాటు భారతదేశము నందనేక ప్రాంతములను పర్యటించి మంచి లోకానుభవమును సంపాదించుకొనిరి. తండ్రితోపాటు తమ సంస్థానమునందుగాని యితరచోట్లగాని జరుగు సాహిత్య సంగీతాది గోష్ఠులయందు పాల్గొనుచుండెడివారు. ఇంతేగాదు బాల్యము నుండియు తన ఈడువారి సందడిని ఆకర్షించి స్వయముగా కొన్ని సంగీత సాహిత్యగోష్ఠులను జరుపుచుండెడివారు. ఆ గోష్ఠులలో పాల్గొని లాభము పొందుటకు అప్పుడప్పుడు పలువురు పండితులును, విజయరామ గజపతీంద్రులును విచ్చేయుచుండెడివారట. ఇట్టి సందర్భములందొకసారి యీ తండ్రీ కొడుకుల నడుమ జరిగిన ముచ్చటగొల్పు సంఘటననొకదానిని శిరోమణి శ్రీ చెలమచెర్ల రంగాచార్యులవారు ''ఆనందగజపతి మహారాజు'' అను తమ వ్యాసమున పేర్కొనిరి. దానిని యథాతథముగ నిచ్చట పేర్కొనుచున్నాను..

''మహారాజుగారు సైతము అప్పుడప్పుడు తమ తనయుని ఈ గోష్ఠులకు విచ్చేయుచుండిరి. అట్లు వచ్చినప్పుడు మహారాజుగారు పాదుకలను వాకిటవిడిచి వట్టికాళ్ళతో లోనికి నడిచివచ్చుచుండిరి. ఒకసారి యీ రీతిగా తండ్రిగారు పాదుకలు విడిచి భవనములోనికి వచ్చుచున్నందుకు మనస్సు నొవ్వగా ఆనంద

గజపతి "యెదురేగి నమస్కరించి పాదుకలతోనే దయచేయుఁడు. తమ సొంత యింటిలోనే యిట్టి యుపచారములా? అని మనవిచేసిరట—అప్పుడు మహారాజు గారన్నారట—నాయనా! నిరతము నీవు విద్యాగోష్ఠులు జరుపుచున్న భవనమిది సరస్వతీ మందిరముగాదా! భగవదాలయములోనికి పాదుకలతో పోవుట యపచారము" అని. 'మహాపురుషులు', పుట 95, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రచురణ.

ఇట్లు బాల్యమునుండియే స్వతంత్రముగ గోష్ఠులు జరుపుచు బుధగణములను పరితోషింపఁజేయుచున్న ఆనందగజపతులు 25 సంవత్సరముల యౌవన దశయందు ఎంతటి స్వయంప్రతిపత్తిగల భావ వికాసమునందియుండిరో ఊహింపవచ్చును. అట్టి దశలో సంస్కృత నాటక సంస్థ నొకదానిని స్థాపించిన బాగుండునని వారు తమ యభిలాషను తండ్రితో వ్యక్తముచేయగా అది తండ్రికి నచ్చి దీనిని స్థాపించిరేమో! లేక ఆనందులే తండ్రి యనుమతితో పండితులతో సంప్రతించి స్వయముగా స్థాపించియుండిరో! లేదా తండ్రియే తనకుగల సంస్కృతభాషా నాటక కళాపిపాసను పురస్కరించుకొని స్వయముగా స్థాపింపగా ఆనందులు తండ్రిచాటు బిడ్డగా తగుమాత్రముగ నీ సంస్థయొక్క కార్యకలాపములందు పాల్గొనుచూ తండ్రి తదనంతరము దానిని మఱింత అభివృద్ధిలోకి తీసికొనివచ్చి యుండిరో! మొత్తముమీద పితా పుత్రు లిరువురూకలిసి స్థాపించిరనిచెప్పి ఈ శ్రేయస్సును ఇరువురకూ దక్కించుటయే సమంజసముగా తోచుచున్నది. ఈ సంస్థానాధీశ్వరులలో ఆనందగజపతి చుక్కలలో చంద్రుని వంటివాఁడు. వారికి పండిత పక్షపాతమధికము. పండితులకు సైతము వారి యెడ అభిమానము మెండు. కావుననే సంస్కృత నాట్యరంగమును నిర్మింపఁజేసిన ఘనతను కొందఱు పండితులాయనకే దక్కించుచున్నారు. ఇదియు చరిత్రసమ్మతమేగదా! ఇట్లు ఈ జగన్నాథ విలాసినీసభ సంస్కృత నాటక సమాజము విజయరామ, విజయానందగజపతు లిరువురిచేత 1874లో స్థాపింపబడినదని చెప్పుట ఉచితముగా నుండునని తోచుచున్నది.

## నిరంతరము సంస్కృతనాటక ప్రయోగములు

ప్రాస్తావికముగా వచ్చిన మఱొకవిషయము. పై మహానుభావులలో కొందఱు వెలిబుచ్చిన యభిప్రాయములనుబట్టి తెలుఁగుదేశమున ఆధునిక నాటక

రంగము ప్రారంభమైనతరువాత ఈ జగన్నాధ విలాసినీసభయే తొలినాటక సంస్థయని తెలుచున్నది. కేవలము సంస్కృతనాటక ప్రయోగముల కొఱకు పుట్టిన యీ సమాజము తెలుగునాటక వికాసదృష్టితో చూచినప్పుడు తొలిసంస్థ కాజాలదన్నచో పట్టింపులేదు. అప్పుడు మరొక విషయము స్పష్టపడుచున్నది. మనదేశమున ఎల్లప్పుడూ హెచ్చుతగ్గులుగా నైననూ ఎడతెగక సంస్కృత నాటకములు ప్రయోగింపబడుచునే ఉన్నవనియూ అవి కేవలము శ్రవ్యనాటకములుగా మాత్రమే మిగిలిపోక దృశ్యనాటకములుగా రాణించుచునేయున్న వనియు, అందుకొఱకు కొన్ని నాటకసంస్థలుకూడా పనిచేయుచునే యున్న వనియూ, చెప్పుకొనవచ్చును.

శ్రీ విజయరామ విజయానంద గజపతులతో ప్రారంభమైన ఈ సంస్కృతభాషాపోషణ తరువాతిప్రభువులగు విజయరామరాజ అలక నారాయణ గజపతులచేతను, కడపటి సంస్థానాధీశ్వరులైన శ్రీ పి. వి జి రాజు గారి చేతను యథాతథముగా కొనసాగింపబడినది. శ్రీ పి. వి జి. రాజుగారు ఆమధ్య ప్రభుత్వము తలపెట్టిన సంస్కృత విశ్వవిద్యాలయమును విజయనగరములో పెట్టినచో 850 ఎకరముల స్థలమును, కొన్ని భవనములను ఇవ్వగలమని ప్రకటించుట లోకవిదితము.

దేశమున పాశ్చాత్య భాషా సంస్కృతీ వ్యామోహము పెచ్చు పెరిగి మనవారాత్మ విస్మృతిలోబడి కొట్టుకొనుచున్న రోజులలో సంస్కృతమే మన సంస్కృతికి మూలకందమని భావించి సంస్కృత పాఠశాలను, సంస్కృత నాటక సమాజమును స్థాపించి తద్భాషాపోషణకు, కళాపోషణకు పూనుకొని ఉడుతాభక్తిగా భారతీయ సంస్కృతికి జేజేలు పలికించిన శ్రీ విజయరామ విజయానందగజపతులకు, వారి సంతతి వారికి మనమెంతయు ఋణపడియున్నాము. శ్రీ విజయరాముని దర్శనమునకై తొలిసారి విజయనగరమునకు వచ్చినప్పుడు వారిపై భగవత్కవి శ్రీ ముదుంబు వరాహనరసింహస్వామివారు ఆశువుగా చెప్పిన పద్యముతో ఈ భాగమును ముగించి తరువాయి భాగమును అపైన అందుకొందుముగాక.

ఈజగమందు నిందునటు నెల్లరకుం గనువిందొనర్చు మై
యోజగనంగరాజగుట కుల్లము సందియమొందదెందునున్
రాజను మాట మా విజయరామనరేంద్రునకే పొసంగు, పై
రాజులు శోకవహ్నిమది రాజుటరాజులనంగఁజెల్లెడిన్.

# ఆనందగజపతి మహారాజావారి సంస్కృతనాటక ప్రయోగోద్యమము

శ్రీమదానంద గజపతులు (1850-1897) విజయనగర సంస్థానాధీశ్వరులలో నాయకమణి వంటివారు. వీరి పాలనాకాలము ఈ సంస్థాన చరిత్రలో స్వర్ణయుగమును సంతరించుకొన్నది. సాహిత్యము, సంగీతము, నాట్యము, నాటకములు మొదలగు సకలకళలూ వీరి యాధ్వర్యమున మూడు పువ్వులూ ఆరుకాయలుగా విలసిల్లినవి. ఆదిభట్ల నారాయణదాసు, గురజాడ అప్పారావు, గోమఠం శ్రీనివాసాచార్యులు, పీసె వెంకటరమణదాసు, బహుజనపల్లి సీతారామాచార్యులు మొదలగు పండితులు, కవులు, గాయకులు, నటులు, కళాకారులు వీరి యాస్థాన విద్వాంసులుగానో, ఆశ్రితులుగానో పేరుపొందిన భద్రమూర్తులే. వీరి సాహిత్య సంగీతాది కళాపోషణకు ముగ్ధులైన కవులు వీరిని విక్రమార్కునితోనూ, భోజరాజుతోనూ కృష్ణదేవరాయలతోనూ పోల్చి పొగడుచుందురు.

## సంస్కృతభాషా పాండిత్యము

ఆనందగజపతులు సంస్కృతమునందు గొప్ప పండితులు. బాల్యమున శ్రీ ముడుంబి వరాహనరసింహస్వామికడ క్షుణ్ణముగా సంస్కృతము నభ్యసించి గొప్ప పాండిత్యమును గడించిరి. వీరి సంస్కృతభాషాసేవ బహుముఖమైనది. "సంస్కృత గ్రంథమాల" పేరుతో ప్రాచీన గ్రంథముల నెన్నింటినో ప్రచురింపజేసిరి. తారానాథ తర్కవాచస్పతి రచించిన నిఘంటువు వీరి ధన సహాయముతోనే ముద్రణభాగ్యము పొందినది. మాక్సుముల్లర్ పండితుడు ప్రకటించిన ఋగ్వేద భాష్యముయొక్క ప్రథమ ముద్రణ ప్రతులన్నియు చెల్లిపోయి ద్వితీయ ముద్రణకై ధనములేక విరమించుకొన్న సమయమున దానికి కావలసిన ధనమంతయూ తానే పంపిన పుణ్యమూర్తి. ఆనాడు సంస్కృత పాఠశాలలో వ్యాకరణ సాహిత్యోపాధ్యాయులైన శ్రీ పేరి కాశీనాథశాస్త్రి చేత "యామినీ పూర్ణతిలక," "పాంచాలికారక్షణము" అను రెండు సంస్కృత నాటకములను వ్రాయించి సంస్కృతనాటక రచనను ప్రోత్సహించిన నాటక సాహిత్యాభిమాని. ఇట్లింకెన్నియో చెప్పవచ్చును.

## సంగీతశాస్త్ర పరిజ్ఞానము

రాజావారు సంగీతశాస్త్రమునందు మంచి ప్రావీణ్యముగలవారు. వీరిది కమ్మనికంఠము, వెంకటరమణదాసుగారివద్ద వీణనుకూడ నేర్చుకొనిరి. వీరు కొన్ని సంగీతరచనలుకూడ చేసినట్లు ప్రతీతిగలదు గాని అవి యింకనూ లభింప లేదు. కర్రి పద్మనాభస్వామి అను వైణికులు రాజావారికడ శిష్యులై విద్య నభ్య సించి దరిమిలా తదాస్థానమున వైణికులుగా నియుక్తులైరి. రాజావారు లయ జ్ఞానములో మంచి దిట్ట. సంస్థానములోని విద్వాంసులు షట్కాల పల్లవులువాయించి విశేష విన్యాసములు ప్రదర్శించుచుండగా ఎవ్వరునూ తాళము వేయలేకపోగా తాము మిక్కిలి సామర్థ్యముతో తాళమువేసెడివారట. వీరికి భైరవి ఆనంద భైరవులు ఇష్టమైన రాగములు. ఆనందభైరవికి ఆనందులకు సంబంధించిన యైతిహ్య మొకటికలదు. బిడారం రాచప్ప అను మైసూరు సంస్థాన సంగీత విద్వాంసుడు ఆనందగజపతి కొలువులో కచ్చేరీచేయుచూ విజయనగర సంస్థా నములోనే కొలువుచేయుచున్న ఒక సాధారణ గుమాస్తా ఆనందగజపతులపై వ్రాసిన "అభినవభోజ! భోగబిడౌజ మానస! రాజ శ్రీ ఆనందగజపతిరాజ! మహారాజతేజా!" అనువిధముగ పాట చివర రాజాంకితమైన జావళి అను శృంగార గీతమును ఆనంద భైరవిలో ఎత్తుకొని పాడుచుండెనట. తన కిష్టమైన ఆనంద భైరవిలో స్వనామాంకితమైన పాటను విని ఆనందముతోతడిసి ముద్ద యిన రాజావారు తనకడ కొలువు చేయుచున్న సాధారణ గుమాస్తా అంత గొప్ప పాట వ్రాసినందుకు సంతసించి ఆ గాయకునితోపాటు ఆ గుమాస్తాను కూడా సమానముగా ఘనముగా సన్మానించెనట.

ఆనందగజపతులు దివంగతులైనప్పుడు వారి కాప్తమిత్రులైన శ్రీ గురజాడ రామమూర్తిగారు ''అశ్రుతర్పణములు'' అనుపేర కొన్ని పద్యములను వ్రాసిరి. ఆ పద్యములన్నింటినీ శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ ''విజయ నగర సంస్థానము—ఆంధ్ర వాఙ్మయపోషణ" అను గ్రంథమున అనుబంధిం చిరి. అందులోని ఈ క్రింది పద్యమునందు రాజావారికి భైరవిరాగముపైగల ప్రీతిని గూర్చియు వారి సంగీత ప్రావీణ్యమును గూర్చియు ఇట్లు వర్ణింపబడినది.

> వీణియఁజేతబట్టి కడు విస్మయముప్పతిలంగ భైరవిన్
> తానము మేళవించి యమృతంబును జిల్కెడు మిమ్ము జూ
> గాణలు హూణులొక్కగతిగా నుతిఁజేసిరిగాదె యెంతలో
> ఫీనుల పుణ్యమీకరణి వీడెను గానమునస్తమిల్లెగా (పుట 158)

## సౌందర్య సంపద

ఆనందగజపతులు మహా సౌందర్యవంతులు. వారి చక్కదనము పాశ్చాత్యుల మన్ననలను గూడఁబడసినది. "Prince charming" అని పాశ్చాత్యులు వారిని పొగడు చుండెడివారు.

ఇట్లు సంస్కృతభాషా పాండిత్యము, సంగీతశాస్త్ర ప్రావీణ్యము సహజ సౌందర్య సంపదలతో నొప్పారి మూర్తీభవించిన కళాస్వరూపులై సంస్కృత నాట్యరంగమునకు వీరుచేసిన సేవ యింతింతనరానిది. తాము సంస్థానాధిపతులైన పిమ్మట తమ తండ్రి స్థాపించిపోయిన సంస్థల నన్నింటిని యెంతో అభివృద్ధికి తెచ్చిరి. సంస్కృత పాఠశాల వీరి హయాములోనే కళాశాలగా మారినది. "జగన్నాథవిలాసినీసభ" వీరి చేతులలో నూతనోత్తేజమును పుంజుకొని మహోద్యమముగా రూపొందినది. ఈ నాటక సమాజమును తన యభిరుచికి అనుగుణముగ రూపొందించుకొని సంస్కృత నాటక ప్రయోగముల వ్యాప్తికి వీరొనర్చిన కృషి నాన్యతోసదృశమైనది.

## విజయనగరములో సంస్కృత రంగస్థలము

ప్రారంభదినములలో ఈ సమాజమువారి నాటక ప్రయోగములన్నియు ఒక్క విజయనగరమునందే జరుగుచుండెడివి. అక్కడకూడా తొలుత కోటలో మాత్రమే జరుగుచుండెడివని శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి ఆంధ్రనట ప్రకాశికలోనూ (పుట 319), శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి ఆంధ్ర నాటకరంగ చరిత్రలోనూ (పుట 446) చెప్పబడినది. తరువాత కాలమున రంగస్థలము కోటలోపలినుండి వెలుపలికి మారినట్లునూ, విజయనగరమును దాటి పిఠాపురము, మద్రాసు నగరములలో కూడ వీరు ప్రదర్శనలిచ్చినట్లునూ డా॥ పి.యస్ ఆర్. అప్పారావుగారి తెలుఁగు నాటక వికాసములోని ఈ క్రింది వాక్యములవలన తెలియుచున్నది (పుట 567).

"కోటప్రక్క మూడు కోవెలలకెదురుగానున్న ఖాళీస్థలములో ఒక పెంకుటిల్లు ఉండెడిది. ఈ సమాజమువారికి అదియే నేపథ్యగృహముగాను, రంగస్థలముగాను ఉపయుక్తమయ్యేదిదట. ఇంక ప్రేక్షకులకొఱకు తాటియాకుల హాలును నిర్మించెదువారు. ఈ ప్రదేశమునకు శివదృష్టి దోషముండుటచేత ఆ

తాటియాకుల హాలు తఱచు కాలిపోవుచుండెడిదని చెప్పుదురు. ఈ సమాజము వారు విజయనగరములోనే గాక పిఠాపురము మద్రాసు మొదలగుచోట్లకూడ తమ నాటకములను ప్రదర్శించియున్నారు."

## పిఠాపురములో సంస్కృతనాటక ప్రయోగములు

పిఠాపురమునందు ఈ సమాజమువారి కార్యకలాపములను గూర్చి ఇదమిత్థముగ తెలిసివచ్చుటలేదు. ఈ సంస్థానాధీశ్వరులలో రాజారావు సూర్యారావు గారు సుప్రసిద్ధులు. వీరు సంస్కృతాంధ్రములందు మంచి యభిమానము, పాండిత్యముగలవారు. సూర్యరాయాంధ్ర నిఘంటువు వీరిపేరనే వెలసినది. సర్వజ్ఞసింగ భూపాలుఁడు సంస్కృతమున రచించిన రత్నపాంచాలికా అను నామాంతరముగల కువలయావళీ నాటికను తెలుఁగున అనువదింపఁజేసి మూలముతోసహా ముద్రింపజేసి దానికి మేధాసంపన్నమైన తొలిపలుకును స్వయముగా వ్రాసిన సాహితీప్రియులు శ్రీ సూర్యారావుగారు. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు వంటి ప్రతిభాశాలియైన నాటకకర్తను తమ యాస్థానమునందుంచుకొనియు బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడు వంటి షేక్స్పియర్ నాటకములను పాఠముచెప్పుటయందారితేరిన మహామహుని కాకినాడలో తాము స్థాపించిన కళాశాలకు అధ్యక్షునిగా నియమించియు సంస్థాన గౌరవమును పెంచుకొన్న సజ్జనుఁడు శ్రీ సూర్యారావుగారు. వీరును కోలంక, వీరవరము ఎస్టేట్ల జమీందారిణి శ్రీమతి రావు చెల్లాయమ్మరావుగారునూ కలిసి 1900 వ సంవత్సరమున పిఠాపురములో హిందూథియేట్రికల్ నాటకసమాజమును స్థాపించియు, కోటలో "సత్యనారాయణ కంపెనీ" పేరుతో ఒక నాటకశాలను నిర్మించియు నాటక ప్రయోగాభివృద్ధికి కృషిచేసిరి. ఇట్లు పిఠాపురము 1900 సం॥ నాటికే గొప్ప నాటక కళాకేంద్రముగా వర్ధిల్లినది. ఈ వివరములన్నియు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి ఆంధ్ర నాటకరంగ చరిత్రయందునూ (పుట 435), డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారి తెలుఁగునాటక వికాసమునందునూ (పుట 529), శ్రీ శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రిగారి అనుభవాలూ—జ్ఞాపకాలూనూ—అను గ్రంథమునందునూ (పుట 412) లభించుచున్నవి.

ఈ విషయములన్నియూ భూమికగా పెట్టుకొని యాలోచించినప్పుడు పిఠాపురం మహారాజావారికినీ, విజయనగరం మహారాజావారికినీ సంస్థానాధీశ్వ

రుల స్థాయిలో ఉండవలసిన, ఉండియుండిన పరిచయ స్నేహసంబంధములను బట్టియూ, ఈ ప్రభువు లిరువురకునూగల నాటక ప్రయోగ కళాప్రియత్వమును బట్టియూ సూర్యారావుగారి ఆహ్వానముపై ఆనందగజపతులవారి నాటకసమాజము పిఠాపురం వచ్చి నాటకములువేసి ఉండవచ్చును. లేక ఆనందగజపతులే చొరవతీసుకొని సూర్యారావుగారిని నాటకములను వేయింపవలసినదిగా కోరి వారియంగీకారముపై పిఠాపురమువచ్చి నాటకములు వేసియుండవచ్చును. ఆనందగజపతులు ది. 23-5-1897లో మరణించిరి. పిఠాపురములో1900 సం॥ నాటికే నాటకశాల ఉన్నది. ఈ నాటకశాల నిర్మాణమునకు పూర్వము సుమారు మూడు నాలుగు సంవత్సరముల నాటక వాతావరణము అక్కడ ఉండి ఉండ వలయును. అట్లనుకొన్నచో అది సుమారు 1897 నాటికి సరిపడుచున్నది. ఇట్లు పూర్వాపరములను సమన్వయించి చూచినచో వీటికిగల సమయసామీప్యమును బట్టి ఈ సమాజము వారి నాటకములు పిఠాపురములో 1896, 97 ప్రాంతముల జరిగియుండవచ్చునని అనుమాన ప్రమాణముచేత నిర్ణయింపవచ్చునని తోచు చున్నది.

## చెన్నపురి సంస్కృత నాట్యరంగము

మద్రాసునగరమున ఈ సమాజమువారెన్నియో మాఱులు నాటకములను ప్రయోగించినట్లు తెలియుచున్నది. ఇక్కడొక విషయమును వివరింపవలసియున్నది. 1879 ప్రాంతమున శ్రీ గోమఠం సి. వి. శ్రీనివాసాచార్యులు అను వారు మద్రాసులో "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ సొసైటి"అను సంస్థను స్థాపించి సంస్కృత నాటకములను ప్రయోగించుచూ గొప్ప కోలాహలమును సృష్టించిరి. 1880 నవంబరు నెలలో అప్పటి మద్రాస్ గవర్నర్ మఱియు ఆనందగజపతుల సమక్షమున అభిజ్ఞాన శాకుంతలమును ప్రదర్శించి అందు తాము దుష్యంత భూమికను వహించిరి. వారి పాత్రపోషణకు ముగ్ధులైన గవర్నరు వారికి "ఇండియన్‌గారిక్" అను బిరుదును ప్రసాదించిరి. ఆనందగజపతులు ఆచార్యుల వారిని విజయనగరమున కాహ్వానించి తమ యాస్థానమున నటశేఖరులుగా నియమించిరి. అది మొదలుకొని జగన్నాధ విలాసినీసభకు ఆచార్యుల వారే దేశికత్వము వహించి విజయనగరం జట్టును మద్రాసుకు తీసికొనిపోయి నాటకములాడి వచ్చుచుండెడివారు. ఈ విధముగా ఆచార్యులవారు

విజయనగరము వచ్చిన తరువాతనే ఈ సమాజము మద్రాసులో నాటకములను ప్రయోగించినది. అంతకు పూర్వము తానుగా ఈ నాటక సమాజము మద్రానకు వెళ్ళలేదు.

జగన్నాథ విలాసినీసభవారు మద్రాసులో శాకుంతలమును ప్రయోగించిన తేదీ యొకటి గురజాడ అప్పారావుగారి డైరీలనుండి లభించుచున్నది.

"మహారాజావారి నాటకసమాజమువారు శకుంతలను ప్రదర్శించిరి. 8-9-1889 వ తేదీన. రాజావారు ప్రదర్శనమునకు విచ్చేసిరి." గురజాడ రచనలు-3 మహాకవి డైరీలు-పుట 5

1897 లో రాజావారు మరణించుటకు పూర్వము మద్రాసులో ఈ సమాజమువారు ఉత్తర రామచరితమును ప్రయోగించినట్లునూ, అందు ఆచార్యులవారు రాముడుగా నటించినట్లునూ తెలియుచున్నది. ఇదే ఈ నాటక సమాజమువారి చివరి నాటకముగా తోచుచున్నది. దీనికి డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారి యీ క్రింది వాక్యములే ప్రమాణము.

"1897 లో ఉత్తరరామ చరిత నాటకములో శ్రీరామ భూమికను ధరించిన పిమ్మట ఆచార్యులవారు మరల వేషధారణ చేయలేదట," నాట్యకళ విశేష సంచిక-దశాబ్ద ప్రగతి 1957-1968)

## దర్శకుఁడుగా ఆనంద గజపతి

ఆనంద గజపతి తాము కేవలము పోషకులుగా మాత్రమే ఉండిపోక ఈ సమాజ నిర్వహణమునందు మిక్కిలి శ్రద్ధను, చురుకుదనమునూ ప్రదర్శించినట్లు కొందఱి వ్రాతలవలన తెలియుచున్నది. మిక్కిలినేనివారి యీ క్రింది వాక్యములను చూడుడు :

"రాజావారే స్వయముగా ఆ సమాజాన్ని నిర్వహించేవారు. చతుర్విధాభినయాలను వారే నేర్పేవారు. నాటకానికి కావలసిన ఆయా పాత్రధారులందఱినీ ఆయనే ఎన్నికచేసేవారు. నాటక ఇతివృత్తాన్ననుసరించి తెఱలు వ్రాయించి కోటలో ప్రదర్శింపఁ జేసేవారు." ఆంధ్ర నాటకరంగ చరిత్ర (పుట 446)

ఆంధ్రనటప్రకాశికాకారులు శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారుకూడ మహారాజావారేస్వయముగాప్రదర్శనలను నిర్వహించేవారని వ్రాసిరి(పుట 567).

## దుష్యంతుఁడుగా ఆనంద గజపతి ?

శ్రీమదానంద గజపతి క్షితితలేంద్రుని సంస్కృత నాటక కళారాధన ఇంతటితో ఆగినదికాదు. వారు స్వయముగా శాకుంతలమునందు దుష్యంత భూమికను ధరించినట్లు శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారు పేర్కొనిరి.

"శాకుంతలమున దుష్యంత పాత్ర మహారాజావారే ధరించెడివారట." ఉషః కిరణాలు : (పుట 259)

ఈ ప్రతీతి నిజమేనని విశ్వసింపవచ్చును. రాజావారి, సంస్కృత పాండిత్యము, సంగీత ప్రావీణ్యము, నాటక కళాభిమానము, సౌందర్యపు తేవలను గూర్చి వెనుక ముచ్చటించుకొని యుంటిమి. తండ్రి తదనంతరము ఈ సమాజము రాజావారి అధ్వర్యమున సుమారు 18 ఏండ్లు పనిచేసినది. ఇది రాజావారి యాధ్వర్యమునకు వచ్చునాటికి వారికి పట్టుమని 30 ఏండ్లుకూడ లేవు. వారు మరణించునాటికి 46 సం॥ మాత్రమే. అది యింకనూ ఉత్సాహము చావని ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున నున్నదశ. అన్ని హంగులూ కలిగియున్న ఇట్టి స్థితిలో ఇంతటి సుదీర్ఘకాలమున ఏ ఒకటిరెండు మాఱులో పాత్రధారణ చేయుటకు అవకాశము తగిలియుండకపోవునా? రాజావారు మంచి ఉత్సాహముతో తేలిపోవుచున్నప్పుడు, బుచ్చిశాస్త్రివంటి వయోజ్ఞాన వృద్ధులెవరో "పోనీ వేషమువేయకూడదూ?" అని మిక్కిలిచనువుతోవారినిప్రోత్సహించియుండవచ్చును. వారు సరదాగా ఒకటి రెండు సారులు వేసియుండవచ్చును. లేక దుష్యంత భూమికను నిర్వహింపవలసియున్న బుచ్చిశాస్త్రిగారో శ్రీనివాసాచార్యులవారో ఏదేని కారణమున వేయలేకపోవుట తటస్థించియుండగా అప్పుడు రాజావారు స్వయముగా రంగముపైకురికి యుండవచ్చును. అయితే యిది యెప్పుడు ఎక్కడ జరిగియుండవచ్చునో కనుగొనవలసియున్నది.

## నటవర్గము

ఈ సమాజమునందలి నటులలో విజయరామ గజపతి కాలమునం దెవరుండిరో ఆనందగజపతికాలమునందెవరుండిరో విడదీసి చెప్పుటకు వీలుగా

కున్నది. మొత్తముమీద ఈ క్రిందివారుండెడివారు. శ్రీగంటి బుచ్చిశాస్త్రి, చొప్పల్లి నరసింహము, పప్పు వెంకన్న, కట్టా పాపయ్యశాస్త్రి, కౌతా పేరయ్య శాస్త్రి, ఆదిభట్ల జగ్గావధానులు, పప్పు అప్పయ్యశాస్త్రి, వేంకటశాస్త్రి, కొండయ్య తరువాతికాలమున గోమఠం శ్రీనివాసాచార్యులు మొదలగువారు. శ్రీ గంటి బుచ్చి శాస్త్రినిగూర్చి, గోమఠం శ్రీనివాసాచార్యులనుగూర్చి వెనుక చెప్పుకొనియుంటిమి. తక్కినవారినిగూర్చిన వివరములను తెలిసికొందము.

## చొప్పల్లి నరసింహంగారి నాయికా భూమికలు

వీరు శకుంతల, ఊర్వశి, సీత మొదలగు నాయికా పాత్రలను ధరించెడి వారు. వీరు శకుంతల పాత్రకు పెట్టినదిపేరు. ఒకసారి మద్రాసులో వీరి శకుంతలా పాత్ర రాజావారినే భ్రమింపఁజేసినదట. వీరు సుప్రసిద్ధ హరికథకులు శ్రీచొప్పల్లి సూర్యనారాయణ భాగవతార్‌గారి జనకులు. సూర్యనారాయణ భాగవతార్‌గారు 1957 లో ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ ఏర్పడినప్పుడు తొలికౌన్సిల్‌లో సభ్యత్వగౌరవమును పొందిన కళాకారులు.

ఆధునిక నాటకరంగమున పురుషుఁడు స్త్రీ వేషమును కట్టుట వీరితోనే ప్రారంభమైనది. అప్పటికిగల సాంఘిక కట్టుబాట్లతోపాటు నటీనటులకు సంస్కృతము వచ్చియుండవలెనను నియమమేదో వీరికుండుటవలన, అట్టివారు లభింపక వీరు పురుషులచేతనే స్త్రీవేషములు కట్టించినట్లు తోచుచున్నది. లేదా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు నాటకోపన్యాసములలో సెలవిచ్చినట్లు స్త్రీలు స్త్రీ పాత్రలను వేసి మెప్పించుటలో విశేషమేదియు లేదనియూ, పురుషులే స్త్రీ వేషముకట్టి మెప్పించుటయే నిజమైన కళయనియు వీరు భావించిరేమో తెలియదు. అనసూయ ప్రియంవదలుగా ఎవరు నటించిరో అను కుతూహలము రేకెత్తక మానదు. వీటినికూడ పురుషులేవేసి ఉండవలెను. నాటకమునందలి స్త్రీ పాత్ర లన్నింటినీ పురుషులేవేసి యుండినచో ఆ పురుషులెంత సుందరులూ, మహా నటులూ స్థానం నరసింహారావును మించినవారూనైననూ ఆ నాటకము రక్తి గట్టునాయను సందేహము రాక మానదు. అట్టి వసలేని నాటకములను రాజావారు ఆడించి యుండిరాయనియు విచికిత్స బయలుదేరును. ఈ విచికిత్సనిట్లే విడిచి పెట్టుదుము గాక,

## కణ్వుడుగా పప్పు వెంకన్న

ఈతఁడు గొప్ప గాయకనటుఁడు. కణ్వపాత్రకు పేరుమోసిన వ్యక్తి. సంగీతము పాడుటలో అందెవేసిన చెయ్యి. కుందపోతగా పాడెడివారట. విరామ సమయములందు వీరి గానము ప్రేక్షక శ్రోతలకు పారవశ్యము కలిగించెడిదట. వీరి గానమాధుర్యమును గూర్చి శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు చెప్పిన వాక్యములను, పద్యములను, వీరికిని ఆనంద గజపతులకును సంబంధించిన ఐతిహ్యమును శ్రీ ద్వారం భావనారాయణగారు "విజయనగరంలో సంగీత నృత్య విద్వాంసులు" అను వ్యాసములో ఉల్లేఖించిరి. వాటిని యిక్కడ ఉపయోగించు కొనుచున్నాను. (చూ. నాట్యకళ జులై 1973)

"పప్పు వెంకన్న వేయి కోయిలలు మ్రోగునట్లు ఒక మైలు వినబడునట్టి దివ్యశారీరముతో సభ కామోదమొనర్చువాఁడు. అతఁడు వీణెకూడ కడురుచ్యముగా వాయించును"

గీ॥ పప్పు వెంకన్న పాట నిబ్బడిగ వెన్న
ముద్ద లేసిన యట్టులే జొర్లు కరణి
జున్ను దిన్నట్లు పువ్వుల సోన మాడ్కి
నీటిపై చిల్ల పెంకులు దాటు పోల్కి.

సీ॥ ఒకమారు పారువ మొదిగి వచ్చిన యట్లు
వాన కోయిల పెట్ట వరికి నట్టు
లొకపరి మేల్పటా నొడిసి త్రిప్పిన యట్లు
నెత్తావిపొదరింట నిలిచినట్టు
లొకపరి నునుముద్దు లూరిన యట్టులు
చేడెతో పూలను చేరినట్టు
లొకమాఱు వెన్నెల లొలికిగాచిన యట్లు
కొలనందు జలకేళి సలిపినట్లు.

గీ॥ చిన్ని నాయన్న నీ పాట వెన్నముద్ద,
లేసినట్టులు జువ్వల నెగచినట్లు
సన్న చెంబేలి జాజులు జల్లినట్లు
చిన్నిపూదేనెఁ బైపయి చిందినట్లు.

వెంకన్న గారికిని ఆనంద గజపతికిని సంబంధించిన ఐతిహ్యముయొక్క సారాంశమిది. ఒక సారి మద్రాసులోని ఆంధ్ర మహాసభలో సంగీత కచ్చేరి యొకటి ఏర్పాటు చేయబడినది. కచేరి చేయవలసిన గాయకుఁడు ఎంతసేపటికినీ రాడాయె. అప్పుడు సభలో కూర్చున్న వెంకన్న తాను కచేరి చేయగలనని ముందుకు వచ్చెను. సభా నిర్వాహకులు సంతసించి వెంకన్నను పాడమనిరి. అతడు కచేరీ ప్రారంభించెను. మధ్యలో శ్రీ ఆనందగజపతులు మైసూరు మహారాజు శ్రీ శ్యామభూపతితో కలిసి ఆలస్యముగావచ్చి పాడవలసిన గాయకునికి బదులు తమ ఆస్థాన గాయకుఁడు వెంకన్న పాడుచున్నందుకు ఆశ్చర్యపడిరి. ముగ్ధమోహనమైన వెంకన్న పాటను వినుచూ ఆమహారాజు లిరువురూ పులకరించిపోవుచుండిరి. కచేరి పూర్తియైన పిమ్మట వెంకన్న ఆనందులకడకు వచ్చి, వారియాజ్ఞలేనిదే కచేరి చేసినందుకు క్షమింపమని వేడిరట. అప్పుడానందులు ఆనందాశ్రువులు రాల్చుచూ వెంకన్నను కౌగలించుకొని తానుగావారి కచేరిని ఏర్పాటు చేయనందుకు తామే వెంకన్నకు క్షమాపణలు చెప్పిరట. ఇదంతయు తిలకించుచున్న శ్యామభూపతి అచ్చెఱువంది అంతటి గాయకుని కలిగియున్నందుకు ఆనందగజపతిని యభినందించి వెంకన్నకు సన్మానము చేసిరట.

## విదూషకుఁడుగా కట్టా పాపయ్యశాస్త్రి

వీరు విజయనగర సంస్థానమునందు పౌరాణికులుగా నుండెడివారు. సంస్కృతాంధ్రములందు మహాపండితులు. అల్లసాని పెద్దన రచించిన "పూత మెఱుంగులున్ పసరు పూప బెడంగులు" అను పద్యమాలికను మంద్రగంభీర స్వరమున గుక్కత్రిప్పుకొనకుండ పాడుచుండగా సభా భవనము మార్మ్రోగుతూ శ్రోతలుఱ్ఱూతలూగిపోయెడివారట. శిరోమణి శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు తమ చిన్ననాటి ముచ్చట నొక దానిని శ్రీ కట్టా పాపయ్యశాస్త్రిగారికి శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికి సంబంధించిన దానినిట్లు తెలిపిరి. శ్రీ సన్నిధానమువారు 1918 సం॥ ప్రాంతమున బ్ర॥ వే॥ వేలూరి శివరామశాస్త్రి గారి స్వగ్రామమైన చిరివాడ గ్రామమునందు చదువుకొనుచుండిరి. అప్పుడు ఎవరిదో వివాహ సందర్భమును పురస్కరించుకొని శ్రీ కట్టా పాపయ్యశాస్త్రి గారు చిరివాడ గ్రామమునకు వచ్చిరి. పెండ్లి భోజన సందర్భమున వారు మను చరిత్రలోనివి, వసుచరిత్రలోనివి కొన్ని పద్యములను కనీవినీ యెఱుగని వింత పద్ధతిలో పాడిరి. ఆ గాన మాధుర్యముచే ఆకర్షితులైన శ్రీ వేలూరి శివరామ

శాస్త్రిగారు ఆ పద్యములను మఱల మఱల చదివి వినిపించుకొని ఆ వడుపును తాము పట్టుకొని ఆ రీతిగా పాడుటకు ఎంతో ప్రయత్నించిరట. కాని సాధ్యము గాక విడిచి పెట్టిరట. ఇదంతయు చెప్పి శ్రీ సన్నిధానమువారు ఇప్పటికిని ఆ గానఫణితి తమ చెవులలో ప్రతిధ్వనించుచున్నదని సెలవిచ్చిరి.

శ్రీ కౌతా పేరయ్యశాస్త్రిగారు కణ్వపాత్రను, విదూషక పాత్రను వేయుచుండెడివారు. ఆదిభట్ల నారాయణదాసు గారి అన్నగారైన శ్రీ ఆదిభట్ల జగ్గావధానులు గారు రాక్షస పాత్రలకు ప్రసిద్ధి. వీరి వేషమునుచూచి స్త్రీలునూ శిశువులునూ దడుచుకొను చుండెడి వారట. తక్కిన వారందరూ ఆయా పాత్రలను వేయుచుండెడివారు.

ఈ నటవర్గమంతా జన్మతఃగాని అభ్యాసమువల్లగాని చతుర్విధాభినయ కళను అవగతముచేసికొని సంస్కృతభాషా నాట్యకళామ తల్లికి కర్పూర నీరాజనములు పట్టిన ధన్యజీవులు.

## సంగీత వాద్యములు (ఆర్కెస్ట్రా)

ఈ సమాజము వారుపయోగించిన సంగీత వాద్యము లేవియో తెలియుట లేదు. డా॥ పి.యస్ ఆర్ అప్పారావు గారు 1898 తరువాతనే తెలుఁగు దేశమునకు హార్మోనియము, తబలా వచ్చినవని నిర్ధారణగా చెప్పిరి. (చూ. తె. నా. వి. పుట 540) కావున 1897 నాటికే ఆగిపోయిన ఈ సమాజము వారు హార్మోనియం తబలాలను ఉపయోగించిరనుటకు వీలులేదు. ఈ రెండునూ రాకపూర్వము తెలుఁగువారు వయొలిన్ మృదంగములనుపయోగించెడి వారనియు అవికూడ రంగస్థలమునకెదురుగా గాక సైడు వింగ్స్‌లో నుండెడివనియుకూడ వారు వ్రాసిరి. కావున అదే పద్ధతిలో ఈ సమాజమువారు వయొలిన్ మృదంగములనుపయోగించి యుండవచ్చును. లేదా మఱికొంత శాస్త్రీయ దృక్పథముతో వీణా మృదంగములనుపయోగించి యుండవచ్చుననియు భావింపవచ్చును.

విద్యానాథ మహాకవి ప్రతాపరుద్ర యశోభూషణమునందు నాటక లక్షణములన్నియు చెప్పి వాటిని పట్టించుచూ ప్రతాపరుద్ర కల్యాణమను పేరుతో నాటకోదాహరణమును కూడ వ్రాసెను. అందులో నాందియందు సూత్రధారుని చేత సంగీత వాద్యములను గూర్చి యిట్లు చెప్పించెను.

"ఓహో రంగాలంకరణ మంతయూ పూర్తియైనదే. అదిగో చెవుల కింపుగా మృదంగములు మ్రోగుచున్నవి. సంగీత విద్యా రహస్యములన్నింటినీ తెలియఁ జేయుచూ అదే వీణానాదములు వినుపించుచున్నవి॥ అని.

విద్యానాధుని కాలము నాటికి ఓరుగల్లు నాట్యరంగమున వీణా మృదంగములుపయోగింపబడు చుండుట వలన వాటినే సంగీత వాద్యములుగా నాటక లక్షణమునందు చెప్పినట్లు భావింపవచ్చును. అసలు మన సంప్ర దాయము ననుసరించి వీణామృదంగములే ప్రధాన వాద్యోపకరణములు. సంస్కృతాంధ్రకావ్యములందుగాని సంస్కృత నాటకములందు గాని వీణా మృదంగముల ప్రసక్తియే మనకు ఎక్కువగా గోచరించుచుండును. ఇదిట్లుండ.

ఆనందగజపతుల సంస్థానముననంగీతమొక ప్రత్యేకశాఖగా విలసిల్లినది. అందు ప్రధాన వాద్యోపకరణములుగా వీణె, రుద్రవీణె, వయొలిన్,మృదంగములే కానవచ్చుచున్నవి. వీణె వెంకటరమణదాసు, ముదుంబు వరాహ నరసింహ స్వామి, కర్రి పద్మనాభస్వామి, వాసా పెద రామయ్య, కలిగొట్ల కామరాజుగారి సోదరి శ్రీమతి సావిత్రమ్మ మొదలగు వీణావరదండ మండిత కరులునూ, శ్రీ కవిరాయుని లక్ష్మీనారాయణవంటి రుద్రవీణాధురంధరులూ, కలిగొట్ల కామరాజువంటి వాయులీన విద్వాంసులు ఇంకెందరో మృదంగ విద్వాంసులు వీరి యాస్థానమున నుండిరి.

విద్యానాధుని నాటక లక్షణములను, మన శాస్త్రీయ సంప్రదాయమును, ఆనాడు అమలులోనున్న వ్యవహారసరళిని, సంస్థానమున ఆయా సంగీత వాద్య ములు లభించు సౌకర్యమును, అనుసరించి పండితుల సలహా సంప్రతింపులతో వీరు వీణా వాయులీన మృదంగములను-ప్రధాన వాద్యములుగా ఆర్కెస్ట్రాను ఉపయోగించి యుందురని ఊహ సేయవచ్చును. లేక 1882లో మద్రాసు నగర మున "ది మెడ్రాస్ ఓరియంటల్ క్లబ్'' అను సంస్థ ఏర్పడినట్లును ఆ సంస్థవారు 1885లో పాశ్చాత్య వాద్య సంగీతము హార్మోనియంను ప్రవేశపెట్టి రనియు శ్రీ అప్పారావుగారు తె. నా. వి లో వ్రాసిరి. ఆ క్లబ్బు శ్రీ గోమఠం శ్రీనివాసాచారిగారిదే గనుక ఐనచో ఆనందగజపతుల ఆహ్వానంపై విజయనగరం వచ్చినవారు తరువాతి కాలమున హార్మోనియం ప్రవేశపెట్టి ఉండవచ్చు.

ఆనంద గజపతి మహారాజావారి సంస్కృతభాషా నాటక కళాపిపాస ఎంతటి ఉత్తాలమైనదో చెప్పితీరవలసిన విషయమింకొకటి యున్నది.

గురజాడవారు తమ కన్యాశుల్కమును ఆనందగజపతులకే అంకిత మిచ్చిరి. 1892లో ఈ నాటకము తొలిసారి విజయనగరమున జగన్నాధ విలాసినీసభ ఆధ్వర్యమున ప్రయోగింపబడినది. ఆ నాటకముయొక్క ప్రోలోగ్‌ని రాజావారు శ్రీ ముడుంబువరాహ నరసింహస్వామి వారిచేత సంస్కృతములో వ్రాయించి మేడేపల్లి వెంకటరమణాచార్యులవారిచేత నాటక ప్రారంభమున రంగస్థలముపై చదివింపజేసిరి. సంస్కృత నాటక సమాజముయొక్క ఆధ్వర్యమున తెలుఁగు నాటకము నాడించుటవలన కలుగు దోషమును పరిహరించి ఆసమాజముయొక్క సంస్కృతత్వమును సురక్షితము చేయుటకు కాబోలు అట్లుచేసిరనిపించుచున్నది. సంస్కృతభాషా కళామతల్లి ఆరాధనలో యింతకు మించిన పరాకాష్ట యేమున్నది? తండ్రికి తగిన తనయుడై శ్రీ విజయరామగజపతి నడచిన బాటలో నడచి సంస్కృతభాషా కళామతల్లికి యీతడుచేసిన సేవనుగూర్చి ఎంతచెప్పినను మిగిలియే యుండును. ఆనందగజపతిచేత ఘనసన్మానము నందిన వారునూ అద్యతనాంధ్ర కవి ప్రపంచనిర్మాతలునూ అయిన శ్రీ తిరుపతి వేంకట కవులు ఆనందులపై చెప్పిన పద్యముతో ఈ భాగమును ముగించుచున్నాను.

సీ॥ విక్రమార్కునితోడ వేంచేయకుండునే
  భోజభూపాలుండు పుట్టడేని
భోజ భూపాలుతోఁ బోకుండునే రాజ
  భూపాలవర్యుండు పుట్టడేని
రాజరాజనరేంద్రుతోఁ జనకుండునే
  కృష్ణరాయలు జన్మమెత్తడేని
కృష్ణరాయలతోడనే పోకయుండునే
  భవదీయ వంశంబు ప్రబలదేని

భావుకంబైన భవదీయవంశగరిమ
ధరణినిండాక సత్కవితా వధూటి
నిలిచియున్నది నిలుచును, నిలువగలదు,
శ్రీమదానందగజపతి క్షితితలేంద్ర!

---

# సంస్కృత నాటక ప్రయోగ పితామహుడు

# శ్రీ గోమఠం సి. వి. శ్రీనివాసాచార్యులు

ఆనందగజపతీంద్రుని ఆశ్రితులలో నొకరై విజయనగర సంస్థానమున సంస్కృతనటశేఖరుడై 19 వ శతాబ్ది చివరిపాదమున మద్రాసునగరములో అభిజ్ఞానశాకుంతలాది సంస్కృత నాటకప్రయోగములద్వారా పెద్ద కోలాహలమును సృష్టించి ప్రాచ్య పాశ్చాత్య పండితులచేత నాటక ప్రయోగ పితామహుడు, ఇండియన్ గారిక్ అను బిరుదములను పొంది చెన్నపురి రాజధానిలో నామమాత్రముగనున్న నాట్యకళకు, అందుననూ, సంస్కృతనాట్యకళకు, అస్తిత్వమును కలిగించి తద్భాషా గౌరవమును పెంపొందించుటకు కృషిచేసిన మహానుభావుడు శ్రీ గోమఠం కాయార్ వేలామూర్ శ్రీనివాసాచార్యులవారు.

వీరు 1842 లో చెంగల్పట్టు జిల్లాలో జన్మించి దరిమిలా మద్రాసు నగరమున ఉపాధ్యాయవృత్తిలో స్థిరపడి, 1923 లో ఎనభై సంవత్సరముల పరిపూర్ణ సఫల జీవితమును చాలించిరి. వీరిది గొప్ప పండితవంశము. వీరి పూర్వీకులందరూ వంశపారంపర్యముగ సంస్కృతమును, సంగీతమును అభ్యసించిరి ఆచార్యుల వారదేవరునలో నిలబడి సంస్కృత సంగీత విద్యలందు మంచి పాండిత్యమును సంపాదించిరి. దీనికితోడు వీరికి అభినయ కళకూడా క్రొత్తగా వచ్చిపడినది. కమ్మని గాత్రసంపద, స్ఫురద్రూపిత్వము, నిండైన విగ్రహము వీరి సొత్తు. ఈ గుణములన్నియు కలిసి బంగారమునకు తావి యబ్బుటయను సామెతను వీరియెడల అక్షరములా సార్థకముచేసినవి.

1875 ప్రాంతమున మద్రాసునగరములో నాట్యరంగమునకు సంబంధించి రెండు ముఖ్య సంఘటనలు జరిగినవి. వాటితో ఏదో ఉపాధ్యాయవృత్తిలో కుదురుకొని కాలక్షేపము చేయుచున్న ఆచార్యులవారి జీవితమున క్రొత్త మలుపు వచ్చినది.

ఆ రోజులలో మద్రాసునగరమున నివశించుచున్న తెల్లదొరల వినోదార్థము సీమనుండి ఆంగ్లనాటక సమాజములు కొన్నివచ్చి షేక్స్పియర్ మొదలగు వారి నాటకములను ప్రదర్శించుచుండెడివి. ఆ నాటకములచేత ప్రభావితులైన కొందఱు స్వదేశీ యువకులు ఇంగ్లీషు నాటక కంపెనీలను ఏర్పరచి నాటకము లాడుచుండెడివారు. అట్టి కంపెనీలలో "ది మెడ్రాస్ డ్రమాటిక్ సొసైటీ" ప్రముఖమైనది. ఇది 1875 లో స్థాపింపబడినది.

ఇదిట్లుండ 1876 లో పటేల్ M.A. (Oxon) అను నాయన నేతృత్వమున "పార్శీ విక్టోరియా థియాట్రికల్ కంపెనీ" అను పేరుతో బొంబాయి నుండి ఒక నాటకసంఘము మద్రాసునకు వచ్చి ఆధునికములైన రంగ పరికరములతో పెద్దపెట్టున "గులేబకావళి" వంటి హిందూస్థానీ నాటకములను ప్రదర్శించి సమ్మోహనకరమగు వాతావరణమును సృష్టించి కొందఱు యువకులకు నూతనోత్తేజమును కలిగించినది.

ఈ రెండింటిలోనూ మొదటిదగు విదేశీభాషా నాటకసంఘము ఆచార్యుల వారిలో ప్రతిక్రియాత్మక భావసంచలనమును, (Negative reaction), రెండవదగు స్వదేశీభాషా నాటకసంఘము భావాత్మక భావసంచలనమును (Positive reaction) కలిగించి అప్పటివఱకు స్తబ్ధముగనున్న ఆచార్యుల వారిలో చుఱుకుదనమును పుట్టించి కర్తవ్యోన్ముఖుని చేసినవి. దీనిఫలితముగ వారు ప్రాచ్యభాషానాటకముల నాడించి ప్రజలలో స్వభాషాభిమానమునూ, జాతీయాభిమానమును పురికొలుపుటకు 1879 లో "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ సొసైటీ" అను పేరుతో నొక నాటకసంస్థను స్థాపించిరి.

"ది మెడ్రాస్ డ్రమాటిక్ సొసైటీ" అను ఆంగ్లనాటక సమాజమునకు ఆచార్యులవారి "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ సొసైటీ" అను ప్రాచ్య భాషా నాటకసమాజమునకు స్థాపనోద్దేశ్యములోగల భేదమును శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి యీ వాక్యములవలన గ్రహింపవచ్చును.

"ఇది మద్రాసులో కేవలం ఆంగ్లనాటకాలను మాత్రమే ప్రదర్శించేది. దీనికి ప్రతిగా స్థాపింపబడిందే "ది ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ," (ఆంధ్రనాటకరంగ చరిత్ర పుట. 557)

డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారిట్లు వ్రాసిరి :-

"పార్శీ విక్టోరియా థియాట్రికల్ కంపెనీవారు ప్రదర్శించిన "గులేబకావళి" మున్నగునవి హిందూస్తానీ నాటకాలు. వాటిని తెలుఁగున వ్రాసి ప్రదర్శించాలని ఆచార్యులవారి తలంపు. వెంటనే వీరు తమ సన్నిహితులనందఱినీ కూడగట్టుకొని "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ" అను నాటక సమాజమును స్థాపించారు" (నాట్యకళ విశేషసంచిక 1957–1968 పుట 66)

ఆచార్యులవారు తొలుత ఈ సమాజము తరపున తెలుఁగునాటకముల నాడింపదలచినట్లు పై వాక్యములవలన తెలియుచున్నది. ఇది యథార్థమే. కాని దరిమిలా అధిక సంఖ్యాకులైన మిత్రుల కోరికపై తమ యభిప్రాయమును మార్చుకొని సంస్కృతనాటక ప్రయోగములకే పూనుకొనిరి ఈ విషయము ఆచార్యులవారే వ్రాసిన "కమలాప హరణము" అను స్వకపోల కల్పితమగు ప్రకరణము అను నాటకముయొక్క ముఖపత్రమునందుల్లేఖింపబడినది.

"ఆ సామాజికులలో ననేకులకు సంస్కృతనాటకములే ముఖ్యముగ ప్రదర్శింప వలయునను నభిప్రాయము పూర్ణముగ నుండినందుననూ, అక్కాలంబున ద్రావిడాంధ్ర భాషానాటకములకన్న నీసంస్కృత నాటకముల యందే గొప్పగొప్ప యాంగ్లేయోద్యోగులునూ, హిందూప్రముఖులునూ, పండితులునూ, మహారాజులునూ, తుదకు సామాన్యులునూ అధికాదరము వహించి ప్రోత్సాహపఱచుచుండినందుననూ"వారు సంస్కృతనాటక ప్రయోగములనుప్రారంభించిరి.

అయితే వీరు సంస్కృతనాటకములతో పాటు ఎడనెడ వాటి అనువాదములను కూడ ప్రదర్శించు చుండెడివారని శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు "ఆంధ్రనాటక రంగచరిత్రలో" వ్రాసిరి.

అసలు ఈ సమాజముయొక్క పేరునందు "ఓరియంటల్" అను పదమును వాడుటలోనే ఆచార్యులవారికిగల స్థూలదృష్టి, దూరదృష్టికూడ గోచరించుచున్నవి. ఈ పదము సంస్కృతము తెలుఁగు మొదలగు ప్రాచ్యభాషలకన్నింటికీ అనువర్తించును. ప్రధానముగ సంస్కృత నాటకములను, గౌణముగ తెలుఁగునాటకములను ఆడుట వీరియుద్దేశ్యమని చెప్పుకొనవచ్చును. కాని కొన్ని సందర్భములందు వీరిసంఘము పక్షమున ఆంగ్లహరిశ్చంద్రనుకూడ ఆడిరి.

ఆచార్యులవారు దీనికి స్థాపకులేగాక అధ్యక్షులుకూడ, ఈ సమాజస్థాపనలో వీరికి గల ధ్యేయమునుగూర్చి "కమలాపహరణము" నాటక పీఠికలో కంఠోక్తిగా యిట్లు చెప్పబడినది.

"దృశ్య ప్రబంధములై యుండియు శ్రవ్య ప్రబంధములుగానే పండితోత్తములు సైతమనేక శతాబ్దములుగా వినియోగించుచున్న సంస్కృత నాటకములను దృశ్య ప్రబంధములుగాఁ జేయనుద్యమించి నలువది సంవత్సరములకు ముందు "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ" యనునాటక సమాజమొకటి స్థాపించి అని.

ఈ కమలాపహరణము నాటకము 1919లో ప్రకటింపబడినది. దాని పీఠికలో "నలువది సంవత్సరములకుముందు" ఈ సమాజమును స్థాపించినట్లు చెప్పుటనుబట్టి దీని స్థాపనాకాలము 1879 ప్రాంతముగా నిర్ణయించటమైనది.

ఆచార్యులవారి సమాజము తరపున అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము, ఉత్తరరామ చరితములను వేయుచుండెడివారు. దుష్యంత పురూరవ శ్రీరామపాత్రములను వారే వహించుచుండెడివారు. వీరి సంస్కృతనాటక ప్రయోగములు మద్రాసు నగరమునందు గొప్పసంచలనమును కలిగించినవి. ఈ నాటకములను తెల్లదొరలు సైతము తిలకించి ముగ్ధులైరి.

## గవర్నర్ సమక్షమున అభిజ్ఞాన శాకుంతలము.

1880 నవంబరునెల ప్రాంతమున మద్రాసురాష్ట్ర గవర్నర్‌గా "హిస్ గ్రేస్ దిడ్యూక్ ఆఫ్ బక్కింగ్‌హాం అన్డు చాండాస్" అనువారుండిరి. ఒకసారి వారే స్వయముగా ఆచార్యులవారి నాటకములను చూడవలెనని అభిలాషను వ్యక్తముచేసిరి. అప్పుడాచార్యులవారు 1880 నవంబరు మాసమున అభిజ్ఞాన శాకుంతలమును ప్రదర్శించిరి. ఆనాడాచార్యులవారే స్వయముగా దుష్యంత భూమికను ధరించిరి. ఆ ప్రదర్శనమునకు గవర్నరునూ, అపుడు కౌన్సిల్ మెంబరుగానున్న ఆనరబుల్ కార్మైకాల్ దొరవారునూ, విజయనగరం మహారాజా శ్రీమదానంద గజపతులునూ హాజరైరి. ఆనాడాచార్యులవారి దుష్యంత పాత్రపోషణకు ముగ్ధులైన గవర్నరు, వారికి "దిఇండియన్‌గారిక్" అను బిరుదును ప్రసాదించిరి. ఆనంద గజపతులానంద పరవశులై వారిని విజయనగరమున కాహ్వానించి తమ యాస్థానమున నటశేఖరులుగా నియమించిరి.

## "ది ఇండియన్ గారిక్"

మనవారిలో గొప్పవారైన కొందఱిని ఆంగ్లేయులిట్లు పిలిచిరి. కాళిదాసుని "ది ఇండియన్ షేక్స్పియర్" శివాజీని 'నెపోలియన్ ఆఫ్ ఇండియా' గోమఠం వారిని "ది ఇండియన్ గారిక్" ఇత్యాది ఇట్లు పిలుచుటలో వారవలంబించిన విధానము కాళిదాసు షేక్స్పియర్లయొక్క ముందువెనుకల కాలసరణిని బట్టి గాక వారి వారి దేశభాషా సాహిత్యములలో వారికిగల సర్వోన్నత స్థానమునకు సంబంధించిన హేతుసరణినిబట్టియే. అనగా భారతీయ సాహిత్యమున కాళిదాసు మహోన్నతుఁడు. అట్లే ఆంగ్లసాహిత్యమున షేక్స్పియరు. ఇదిట్లే తీసికొన వలెను. మరోవిధముగా తీసికొని వారు మనను కించపఱిచిరనియో, కాళిదాసు ముందు షేక్స్పియరు పనికిరాడనియో ఇట్లే ఇంకేదో తలపోసి వ్యథచెందుట వ్యర్థము. వారుపాలకులుగా మనము పాలితులుగా నున్నప్పుడు అట్లుగునిసిన గునిసి యుండవచ్చును ఇప్పుడు గునియుట కేవలము అనవసరము. ఇట్లే శివాజీ నెపోలియన్ల విషయము కూడ. ఆచార్యుల వారికీ గారిక్నకూ ఈ పోలిక కాలసరణిని హేతుసరణిని రెండింటినీ బట్టియు సరిపడుచున్నది. గారిక్ ముందు వాడు. ఆచార్యులవారు తరువాతి వారు. ఇదికాల సరణికి సరిపడుచున్నది. శక్తి సామర్థ్యము లందిరువురూ సమానులే, ఇది హేతు సరణికి సరిపడుచున్నది. ఈ దృష్టితో గారిక్ ఎవరో తెలుసుకొని ఆచార్యులవారికినీ అతనికినీ గల పోలిక లేమిటో ఎఱుగుదుము గాక.

డేవిడ్ గారిక్ (1717-1729) ఆంగ్లనటులలో సుప్రతిష్ఠితుఁడైన మహా నటుఁడు. నాటక కంపెనీ మేనేజరు. నాటక రచయిత. సుమారిరువదియైదు సంవత్సరముల వయస్సులో 1741 లో ఒక్కుమ్మడి రంగముపైకురికి మొదటి యారునెలలలోనే వైవిధ్యముగల పద్దెనిమిది పాత్రలను ధరించి అద్భుత ముగా పోషించి పెద్ద సంచలనము కలిగించెను. ఈ ఆఱునెలలలో మూడు సార్లు అతని నాటకములను చూచి పోప్ ఇట్లు ప్రకటించెను. "That young man never had his Equal as an actor and he will never have a rival."(Encyclopedia of Britanica Valume 10, Page-32) ఏకబిట్టున 24 షేక్స్పియర్ నాటకములను ప్రదర్శించి వాటికి తిరిగి ఎన లేని ప్రచారమును తెచ్చిపెట్టిన ఘనుఁడు. ముఖ్యముగా విషాద భూమికలను

వహించుట యందు అతని కతదే సాటి యని పేరుగాంచినవాఁడు. బెన్‌జాన్సన్ నాటకములను మఱియు తన సొంత నాటకములను కూడ ప్రదర్శించుచుండెడి వాఁడు. డాక్టర్ జాన్సన్ చేతిక్రింద మెలగిన వ్యక్తి. సుప్రసిద్ధ ఆంగ్ల నాటక కర్తయు కంపెనీ మేనేజరూ ఐన షెరిడన్‌తో భాగస్వామిగా Drury lane theatre "ని నడిపించిన వ్యక్తి. ఆనాటి ఇంగ్లీషు నటనా విధానము నందునూ, నాటక ప్రయోగ విధానమునందునూ అనేక మార్పులను తెచ్చిన ఘనత గారిక్‌కి దక్కుచున్నది. రంగస్థల దీపములను ప్రేక్షకులకు కానరాకుండఁ జేయుట, ప్రేక్షకులను రంగస్థలము మీదికి రాకుండ జేయుట వంటి మార్పుల నెన్నో గారిక్ ప్రవేశపెట్టెను. ఇట్లు సుమారు మూడు దశాబ్దముల కాలము ఆంగ్ల నాటక రంగస్థలముపై ఒక్క వెలుఁగు వెలిగి 1769 ప్రాంతమున అతడు తన నటజీవితమునకు స్వస్తి చెప్పెను.

గారిక్‌లోనూ, ఆచార్యుల వారిలోనూ సమానముగా నున్న లక్షణము లివి: (1) ఇరువురూ నాటక కర్తలు, (2) కంపెనీ మేనేజర్లు, (3) మహా నటులు, (4) నాటక ప్రయోగ నైపుణ్య మెరిగినవారు, (5) ఒకరు షేక్స్పియర్ నాటకములకు మఱొకరు కాళిదాసు నాటకములకు మంచి రాణింపు తెచ్చిన వారు, (6) ఒక్కుమ్మడి రంగముపై కురికి ఒక్క వెలుగు వెలిగినవారు, (7) గారిక్ షెరిడన్లు స్నేహితులు- గోమఠం గురజాడలు స్నేహితులు- ఇత్యాది.

## ఆనంద గజపతుల ఆహ్వానము.

ఆచార్యులవారు ఆనందగజపతుల యాహ్వానముపై విజయనగరమునకు వెళ్ళి అచ్చట సంస్థానమునందు సంస్కృత నటశేఖరులుగా కుదురుకొనిరి. రాజా వారు జగన్నాథ విలాసినీ సభానిర్వహణ బాధ్యతను ఆచార్యుల వారి కప్ప గించిరి- దీనితో అప్పటి వఱకు ఆ సభకు దేశికులుగా నున్న శ్రీ గంటి బుచ్చి శాస్త్రి గారు వయోవృద్ధులౌటవలన తెఱచాటుకు పోయిరని చెప్పవచ్చును. ఆచార్యులవారి నేతృత్వమున వారి శిక్షణలో జగన్నాథ విలాసినీ సభాచరిత్రలో క్రొత్త అధ్యాయము ప్రారంభమైనది. ఆచార్యులవారి నాటక శిక్షణా పద్ధతులు అప్పటికి విజయనగర సంస్థానమునందు ప్రాచీన లిపిపాఠకుఁడుగా పని చేయు చున్న శ్రీ గురజాడ అప్పారావు గారిని బాగుగా ఆకర్షించినవి. మద్రాసులోని

కల్యాణ రామయ్యరు బృందమువారు ప్రదర్శించిన సంస్కృత శాకుంతల నాటకమును, ఆచార్యులవారి నేతృత్వమున జగన్నాథ విలాసినీ సభవారు ప్రదర్శించిన శాకుంతలమును చూచిన తరువాత అప్పారావుగారు తమ డైరీలో ఇట్లు వ్రాసుకొనిరి.

"విజయనగరం జట్టు వారి నాటకములలో అభినయం ఇంతకంటె బాగున్నది. బుచ్చిశాస్త్రి కంపెనీవారు కల్యాణ రామయ్యరు జట్టుకంటె అన్ని విధాలా ఎన్నోరెట్లు మెరుగు. అయితే వారికి శ్రీనివాసాచారి తరిఫీదు ఉందని చెప్పక తప్పదు. గురజాడ రచనలు, 3 వ సంపుటము, (పుటలు, 69-70.)

ఇది ఆచార్యులవారి శిక్షణాపద్ధతులకు మెచ్చుకొని అప్పారావుగారిచ్చిన ప్రశంసాపత్రమని చెప్పవచ్చును.

ఆచార్యులవారిపై ఆనంద గజపతులకుగల ప్రేమాభిమానములను చాటు నీయాంగ్ల వాక్యములను పొందుపరచు చున్నాను. ఇవి శ్రీ నిడదవోలు వెంకటరావుగారి "విజయనగర సంస్థానము-ఆంధ్ర వాఙ్మయపోషణ" అను గ్రంథము నుండి స్వీకరించబడినవి.

"The Maharaja of Vizaya Nagaram, the prince charming of India himself, a no mean amature of fine art, attached Mr. Acharya to himself as one of the brightest arnament of his splendid court; right to the very last and showed upon him honours and distinctions.

Page 22 Introduction to Kamala Paharanam

By
**C. R. Sreenivasacharya**
B. A. D/1/1922
Principal, Sanskrit College
Mylapore, Madras.

## ఆంగ్ల హరిశ్చంద్రలో సంస్కృతపదములు.

ఆచార్యులవారు సంస్కృతాంధ్రము లందేగాక ఆంగ్ల భాషయందు కూడ మహాపండితులు. తెలుఁగున కమలాపహరణము, పెంకెపంతులఫార్సు, స్త్రీ ధాతుర్యము, స్త్రీ సాహసము, త్రిపూరుషము అను గ్రంథములను వ్రాసిరి. ఆంగ్ల

మున గ్రిజెల్డా అను వచనగ్రంథమును, హరిశ్చంద్ర నాటకమును వ్రాసిరి. ఆనందగజపతుల కోరికపై యీ ఆంగ్ల హరిశ్చంద్రనాటకమును వ్రాసినట్లు చెప్పబడుచున్నది ఇది 1893 ప్రాంతమున విజయనగరములో జగన్నాథ విలాసినీసభ ఆధ్వర్యముననూ, 1896 ప్రాంతమున మద్రాసులోని విక్టోరియా హాలులో "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ" ఆధ్వర్యముననూ ప్రదర్శించిరి. మద్రాసు ప్రదర్శనకు అప్పటి మద్రాసు గవర్నరు లార్డ్‌వెన్లాక్ అనువారు వచ్చి తిలకించి సంతసించి ఆచార్యులవారికి ప్రశంసా పూర్వకముగ లేఖ వ్రాసిరట.

ఈ నాటకమున కొన్నిచోట్ల తగిన ఆంగ్లపదములు లేవని చెప్పి ఆచార్యులవారు సంస్కృత పదములనే వాడిరి. వారువయోగించిన పదములను కొన్నింటిని డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు 'గోమఠం సి.వి. శ్రీనివాసాచార్యులు' అను వ్యాసమున్ల ఉల్లేఖించిరి. వాటినే గ్రహించి యిట ఉటంకించుచున్నాను.

ఋషి, యజ్ఞము, భగవన్, సత్యలోక, తపస్ మొదలగునవి. (అథన్సూచికలో ఈ పదములకు ఆంగ్లమున అర్థముల నిచ్చినారట).

ఇదిట్లుండ ఆచార్యులవారు మరోప్రయోగము కూడ చేసిరి. పాశ్చాత్య సంగీతముకంటె భారతీయ సంగీతమే శ్రేష్ఠమైనదని చెప్పి ఆంగ్ల హరిశ్చంద్ర నాటకములోని కొన్ని గేయములకు కర్ణాటక సంగీత బాణీనిపెట్టి తాము హరిశ్చంద్రుడుగావేసి పాడెడివారట, ఈ ప్రయోగము విజయవంతమై ఆంగ్లేయుల మన్ననలను కూడ పొందినట్లు వారు హరిశ్చంద్ర నాటకములో పేర్కొనిరట.

ఆచార్యులవారు చేసిన ఈ క్రొత్త క్రొత్త ప్రయోగములు చూడగా ఒక విషయము స్పష్టపడుచున్నది. వీరు అద్వితీయ ప్రజ్ఞా ప్రాభవములుగలవారు. అంతేగాదు అఖండమైన జాతీయభావనా విలసితులు. సంస్కృతభాషా నాటక ప్రయోగములద్వారా సంస్కృతభాషను, అందలి నాటకీయతను రుచిచూపించుట, ఆంగ్ల హరిశ్చంద్ర నాటక ప్రయోగముద్వారా "సింహమును దానిగుహలోనే చంపవలెనన్న వివేకానందుని ధోరణిని పుణికిపుచ్చుకొని హరిశ్చంద్రుని వంటి ధీరోదాత్త నాయకుని ఆంగ్లభాషద్వారా ఆంగ్లేయులకు పరిచయముచేసి భారతీయ

సంస్కృతియనగా ఏమో నిరూపించి చెప్పుట, ఇట్లు సంస్కృతభాషను, భారతీయ సంస్కృతిని, భారతీయకళను, పీలైనంత చొరవతీసికొని ముందుకు తీసికొనిపోయి సామాజిక జీవితమును చైతన్య విలసితముచేయుట ఆచార్యులవారి ధ్యేయముగా కనబడుచున్నది.

## సంస్కృతనాటక ప్రయోగ పితామహుఁడు

ఆచార్యులవారు వ్రాసిన "కమలావహరణము" నాటకముయొక్క ముఖపత్రమునందు వారి నాటకప్రయోగములను గూర్చియు, వారు స్థాపించిన నాటకసంఘమును గూర్చియు అనేకవివరములు గలవని వెనుక వలుమార్లు ముచ్చటించుకొనియుంటిమి. అందొక వాక్యమిట్లున్నది. "ఈ చెన్నపురి రాజధానిలో నాటకప్రయోగ పితామహుడను ఖ్యాతి బొందినవాడును నగు గోమఠము సి. వి. శ్రీనివాసాచార్యుడు" అని. ఇప్పటికి వీరిని గూర్చి తెలుసుకొన్నదానినిబట్టి వీరు అప్పుడప్పుడు తెలుగునాటకములను, ఆంగ్ల హరిశ్చంద్ర నాటకమును ప్రయోగించి యున్నప్పటికీ ప్రధానముగా సంస్కృత నాటకములకే వీరు ప్రసిద్ధియని తేలుచున్నది. వీరికి లభించిన "ఇండియన్‌గారిక్" బిరుదముకూడ అభిజ్ఞానశాకుంతల ప్రయోగమునకేగదా ? కావున పై వాక్యములోని "నాటక ప్రయోగ పితామహుఁడు" అనుదానికి సంస్కృతనాటక ప్రయోగ పితామహుడనియే యర్థము చెప్పుకొనుట సమంజసమని భావించి ఇట్లు వాడబడినదని మనవి చేయుచున్నాను.

1922 వ సంవత్సరమున మద్రాసులోని మైలాపూర్ సంస్కృత కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిచేసిన శ్రీ సి. ఆర్ శ్రీనివాసాచార్య కమలావహరణమునకు ఆంగ్లమునందు పీఠికను వ్రాసిరి. అందులో ఆచార్యులవారినిగూర్చి వారు వెలిబుచ్చిన అభిప్రాయము యొక్క సారాంశమును తెలుఁగులో వ్యక్తము చేయుచున్నాను.

"అతఁడు మన చెన్నపురి రాష్ట్రమునందు దాదాపు శూన్యస్థితిలోనున్న భారతీయనాటకరంగమునకు రూపకల్పన చేయుటయేగాక దానికొక జీవము పోసినాడు. మన ప్రాచీనులు వ్రాసిన మహానాటకము లతనిచేతిలో పరశువేది తగిలి బంగారమైనట్లు నవజీవమును సంతరించుకొన్నవి. సంస్కృతాంధ్రాంగ్ల

భాషలయందఖండమైన పండితుఁడేగాక నాట్యరంగమునకు సంబంధించిన శాస్త్రీయము కళాత్మకమునైన సాంకేతిక పరిజ్ఞానముగల అతి కొద్దిమందిలో ప్రముఖుఁడు. దాదాపు ఎనభయ్యేవ పడిలో సంస్కృతభాషకు, సంస్కృత నాటకములకు గొప్ప బలమును తేజమును సమకూర్చి గౌరవస్థానమును సంపాదించి పెట్టిన వ్యక్తి. నాటకమునందలి పద్యములను పాడుటలోగూడ విసుగు పుట్టించు పాత పద్ధతికి స్వస్తిచెప్పి సమ్మోహితముచేయు క్రొత్తబాణీ సంగీతమును ప్రవేశ పెట్టిన మహానుభావుఁడు".

పై వాక్యముల వలన ఆచార్యులవారు నాటక ప్రయోగ పితామహుడను బిరుదమునకు అక్షలారా తగిన వారని ధృవపడుచున్నది. నాటక ప్రయోగమునకు ఎన్నియో హంగులున్నగాని సాధ్యపడదు. అవన్నియు ఆచార్యులవారిలో నున్నవి. ముఖ్యముగా వారిలో నున్న పట్టుదల. ఆంగ్ల నాటక సమాజముల వారు తెల్లదొరల వినోదార్థమను పేరుతో ఇక్కడికి వచ్చి మన వారిని మఱింత భావ దాన్యములో ముంచుచున్న సమయమున అదొక సవాలుగా స్వీకరించి, పంటి బిగువుతో సర్వశక్తులనూ సమీకరించుకొని, ప్రచండముగాసాగి ముందుకు బోయిన కార్యశూరుఁడు ఆచార్యుల వారు.

సంస్కృతము మృతభాష మృతభాషయని విదేశీయులతో కలిసి స్వదేశీయులే దానిని పొడిచి పొడిచి చంపుతున్న రోజులలో కాదు; అది అమృతభాష అని ఎలుగెత్తి చాటి త్రికరణశుద్ధిగా తత్సేవకై జీవితమునంకితము చేసిన ఇట్టి మహానుభావుల ఋణమున పోవుటయే మనకు శరణ్యము.

# శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి సంస్కృత నాటక ప్రయోగప్రీతి

కళాప్రపూర్ణ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు తెలుఁగు నాటక రచనా ప్రయోగ వికాసములకు చేసిన కృషితోబాటు ఆధునిక సంస్కృత నాటకరంగ నిర్మాణమునకు చేసిన దోహదముకూడ మిక్కిలి గణనీయమైనది. వీరు సంస్కృతాంధ్రములందు మహాపండితులు. తెలుఁగున మహానాటక కర్తలు సంస్కృతమునుండి అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము, ఉత్తరరామ చరితము, నాగానందము, రత్నావళి మొదలగు నాటకములను ఆంధ్రీకరించిరి. తెలుఁగున బొబ్బిలియుద్ధము, ఉషానాటకము, ప్రతాపరుద్రీయము అనునవి స్వతంత్ర నాటకములు. వీరు 1853 లో మద్రాసులో జన్మించి 1929 లో నెల్లూరులో మరణించిరి. కొంతకాలము రాజమహేంద్రవరమున విద్యాభ్యాసము చేసిరి. తరువాత చోడవరములో ఉపాధ్యాయులుగా నుండిరి. చివరికి 1885 ప్రాంతమున మద్రాసు చేరుకొని అక్కడ క్రిష్టియన్ కాలేజీలో ప్రధాన సంస్కృతోపాధ్యాయులుగా కుదురుకొనిరి. వీరు సంస్కృత నాటకోద్యమ నిర్వాహకులైన శ్రీమదానంద గజపతులకును (1850-1897), శ్రీ గోమఠం సి. వి. శ్రీనివాసాచార్యులవారికిని (1842-1928) సమకాలికులు. శ్రీవేదంవారు 1886 ప్రాంతమున మద్రాసులో ఉద్యోగము చేయుచున్న కాలమున అక్కడ శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యులవారును, ఆనంద గజపతులును వేసిన సంస్కృత నాటకములను తప్పకచూచియే యుందురనుటకు అవకాశము గలదు. అట్టి ప్రేరేపణచేతనే గాఁబోలు 1886 లో క్రిష్టియన్ కాలేజీ విద్యార్థుల చేత మద్రాసు పౌర సౌధమున ఉత్తరరామ చరితమును సంస్కృతములో ప్రయోగింపజేసిరి. ఇదియే శాస్త్రులవారి నాటక కళారాధనకు ప్రారంభము,

## ఉత్తరరామ చరిత నాటక ప్రయోగము

కళా ప్రపూర్ణునకు సంస్కృత నాటకములలోకెల్ల మిక్కిలి యిష్టమైనది ఉత్తరరామ చరితము. ఇది అన్నివిధములా అభిజ్ఞాన శాకుంతలమును మించినదని వారి తలంపు. "కావ్యములందు నాటకము రమ్యమైనది; నాటకములందు శాకుంతలము; అందులో చతుర్థాంకము; అందుననూ శ్లోక చతుష్టయము" అని పేరుగాంచిన శాకుంతలముకంటె నిదిమిన్నయని వారు ఘంటాపథముగా చాటుచున్నారనగా ఈ నాటకమునందెంతటి యనుభూతిని వారు చూరలుగొనిరో చెప్పఃనిలేదు. భవభూతిపై వీరికి చెప్పలేనంత అభిమానము. ఆతడాంధ్రుడైనచో బాగుండునను తలంపుగలదు కాబోలు వీరికి "భవభూతి మహారాష్ట్రుడో ఆంధ్రుడో అందుననూ వెలనాటియో తెలగాణ్యుడో అని సందేహము కలుగుచున్నది." అని తమ అనూదిత ఉత్తరరామ చరిత ద్వితీయ ముద్రణ పీఠికలో వ్రాసిరి.

భాస కాళిదాస భవభూతులు – ఇదీ సంస్కృత నాటక కర్తల వరుస. భాసుఁడు సరస్వతీదేవియొక్క హాసమనియు, కాళిదాసు విలాసమనియు, భవభూతి అనుభూతి యనియు సహృదయుల భావన. భాసుని స్వప్న వాసవదత్తము మహానాటకము. దీనినిమించి వ్రాయవలెనని తలచి అభిజ్ఞాన శాకుంతలమును వ్రాసి కృతకృత్యుడైనవాడు కాళిదాసు. ఈ రెండింటితోనూ సమానముగ నిలబడవలయునను పూనికతో ఉత్తరరామ చరితమును వ్రాసిన మహాకవి భవభూతి. ఈ మూడు నాటకములందునూ కొన్నిసమానగుణ ధర్మములు అంతర్వాహినిగా నున్నవి. కాని రంగస్థలమున ప్రయోగించుటకు. వాసవదత్తా శాకుంతలములు అనుకూలములైనవనియు ఉత్తరరామ చరిత కాదనియు వాడుకబడినది. ఈ వాదము శాస్త్రిగారికి నచ్చలేదు. ఇది రంగస్థలమున ప్రయోగించుటకు మిక్కిలి అనుకూలమైనదని వారితలంపు. దీనిని నిరూపించుటకు వారీనాటకమును 1886లో మద్రాసులో ప్రయోగింపజేసిరి. ఈ విషయమును వారు తమఉత్తరరామ చరితానువాద నాటకముయొక్క ద్వితీయ ముద్రణ పీఠికయందు (1921లో ముద్రింపబడినది) తెలియజేసిరి. దానిని యథాతథముగా పొందుపఱచుచున్నాను.

"ఈ లోకోత్తర నాటకము శ్రవ్య ప్రబంధముగా రంజించును గాని దృశ్యముగా రంజింపదని పాశ్చాత్య సంస్కృత పండితులునూ నూతన మత

ప్రియులగు నన్మదీయులే కతిపయులునూ పలికిరి. కాని యిది దృశ్యముగా నత్యంత రంజకమగునని ఆబాల్యము నా తలంపుగా నుండెను. మదరాసు క్రిష్టియన్ కాలేజీలో ప్రధాన సంస్కృతోపాధ్యాయుడ నైనంతట బి. ఏ పరీక్షకు ఉ. రా. చ. పఠనీయముకాగా నా శిష్యులకుం బైమతభేదమును నా మతమును తెలిపి, తదీయ స్థాపనార్థము వారిచేత ఈ నాటకమును మదరాసు పౌర సౌధములో ఆడించి ఇది రంగమందు అత్యంత రంజకంబనియు అతి శాకుంతలమనియు క్రిక్కిఱిసిన వేగురు రసిక విద్వజ్ఞులకు ప్రత్యక్షము గావించినాడను. ఆ ప్రయోగము జరిగి ఇప్పటికి 34 సంవత్సరములైననూ ఆ శంబూక దివ్య పురుషుని రామస్తుత్యాది పద్యంబులు ఇప్పటికినీ నా వీనులలో అనురణనము గావించుచునే యున్నవి. సీతాది సకలపాత్రములునూ, వారి వారి చర్యలునూ కన్నుల యెదుర ఇప్పటికినీ మెలగుచున్నవి. అనంతరము ఎన్ని నాటకములు చూచిననూ ఈ విధముగానందమును బందిగొన్నట్టిదిలేదు."

## పాత్రధారుల పేర్లు

ఆనాడీ నాటకమునందు పాల్గొన్న నటుల పేళ్ళను కొన్నింటిని శ్రీవారి శిష్యులైన శ్రీమాన్ నేలటూరి రామదాసయ్యంగారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన సంస్కృత ఉత్తరరామ చరిత పీఠికయందిచ్చి యున్నారు. (పుట 14) వివరములివి :-

అనంతనారాయణ-కుంభఘోణమున తరువాత వకీలైనవాఁడు-శంబూకుఁడు.

నారాయణన్-తరువాత జిల్లా కలెక్టరైనవాఁడు—సౌధాతకి.

టి. యస్. నారాయణశాస్త్రి-తరువాత ప్రసిద్ధ హైకోర్టు వకీలు-రాముడును, జనకుఁడును—అవి యివి కొన్ని పాత్ర గ్రాహుల పేర్లు అని.

ఈ నాటకమున సీత, కౌసల్య, అరుంధతి, తమస, వాసంతి, మొదలగు స్త్రీ పాత్రములనేకములు గలవు. మరి వీటినన్నింటినీ ఎవరు నటించిరో తెలియుటలేదు. స్త్రీలే నటించిరో, పురుషులే నటించిరో అను కుతూహలము రేకెత్తక మానదు. "సీతాది సకలపాత్రములును వారి వారి చర్యలును, కన్నుల యెదుర ఇప్పటికినీ మెలగుచున్నవి." అను శాస్త్రిగారి వాక్యమువలన లోకోత్తర నాయిక

యగు సీతాపాత్రమును నటించిన వారిపేరైననూ తెలిసికొనవలెనను తహ తహ పుట్టక మానదు. ఇంత అద్భుతముగా నటించిన, అనుక్తులును, అజ్ఞాతులునూనైన యీ స్త్రీ పాత్రధారులందఱికీ నివాళులర్పించుట తప్ప చేయగలిగినది లేదు.

శ్రీ టి. యస్. నారాయణశాస్త్రి-అనువారొక్కరే రాముఁడుగానూ, జనకుఁడుగా కూడ నటించినట్లు చెప్పబడినది. ఒక నాటకమున నాయక భూమికను వహించిన వ్యక్తి అదే నాటకమున మరొక చిన్నపాత్రను ధరించుట కొంత వింతగానే కాన్పించును. దీనినిబట్టి ఆనాడు శాస్త్రిగారికి ఎదురైన పాత్రధారుల ఎన్నిక సమస్య, కొఱత, కొట్టవచ్చినట్లు కనబడుచున్నది. అట్లయ్యును పూనికతో నాటకమును ప్రయోగించి రక్తిగట్టించుట వారికే చెల్లినది. ఈ నాటకమున ఏడంకములున్నవి. ప్రథమ ద్వితీయ తృతీయాంకములందు వరుసగా రాముఁడు వచ్చును. చతుర్థ పంచమాంకములందురాడు. మఱల షష్ఠ సప్తమాంకములందు వచ్చును. అనగా మొదటి మూడంకములయందు రాముఁడుగా నటించిన వ్యక్తి మధ్యలో విరామ సమయమున రాముని వేషమును తుడిచివేసి, త్వరత్వరగా జనకుని వేషమును ధరించి చతుర్థాంకమున రావలయు నన్నమాట. ఎంత లేదన్ననూ ఈ వేషము మార్పిడికి సుమారు 20 నిముషములకు పైగా పట్టును. కావుననే కాబోలు తృతీయాంకమునకు చతుర్థాంకమునకు మధ్యగల శుద్ధ విష్కంభమును ఆడింపజేసిరి. ఇందు భాండాయనుఁడు సౌధాతకి అను రెండు పాత్రములు వచ్చును. చతుర్థాంకము ఐపోయిన తరువాత, ఆ వెంటనే పంచమాంకమున రాముఁడు రానక్కఱలేదు. షష్ఠాంకమున మాత్రమే వచ్చును. కావున జనకుని వేషమును తుడిచివేసి మఱల రాముని వేషమును వేసికొనుటకు తీరిక దొఱకును. ఇదంతయు చూడగా శాస్త్రిగారు కొంత అవస్థపడి యీ నాటకమును ప్రయోగించినట్లు అర్థమగును.

## నాటక ప్రయోగ నైపుణ్యము

కొందఱు కేవలము నాటకకర్తలు-కొందఱు నాటకకర్తలు, నాటక ప్రయోక్తలును. మఱికొందఱు నాటకకర్తలు, నాటక ప్రయోక్తలు, నటులుకూడ. ఈ మూడు లక్షణములలో ఏ రెండు గలవారైననూ నాటక వ్యవస్థకు న్యాయము చేకూర్చగలరు. కళాప్రపూర్ణులునాటకకర్తలు, ప్రయోక్తలును. నటులుకూడనేమో? వీరి కీనాటక కర్తృత్వ ప్రయోక్తృత్వ శక్తులు రెండునూభవభూతి వీరి నావేశించగా

వచ్చినవే ననిపించును. కళా ప్రవపూర్ణనకుగాని వీరి శిష్యులలో నగ్రేసరుడైన శ్రీమాన్ నేలటూరి రామదాసయ్యంగారికిగాని భవభూతి కేవలము నాటకకర్త గానేగాక ప్రయోక్తగా కూడ కనిపించినాడు. రామదాసయ్యంగారు తాము నంపాదించిన నంస్కృత ఉత్తరరామ చరిత్ర పీఠికలో 12 వ పుటలో ఇట్లు ఉల్లేఖించిరి:—

"నాటకములు వ్రాయుటయందు మాత్రమే ప్రీతిగల వాఁడుకాదు భవభూతి. వ్రాసినదానిని యాడించి చూచుటయందును మిక్కిలి ప్రీతిగల వాఁడు" అని.

దీని కుపబలకముగ మాలతీ మాధవములోని ఈ క్రింది వాక్యముల నుదాహరించిరి :-

"భవభూతిర్నామ మహాకవిః నిసర్గ సౌహృదేన, భరతేషు వర్తమానః స్వాంకృతిం ఏవంగుణ భూయసీం అస్మాకం హస్తే సమర్పితవాన్" తనకుగల స్వాభావిక స్నేహముచేత తన మాలతిని ఆ నటులచేత ఉంచినాడట.

అదే పీఠికలో 18 వ పుటలో శ్రీ అయ్యంగారు ఉత్తరరామ చరితములోని ఈ క్రింది శ్లోకమును ఉటంకించి అందు తమకు గోచరించిన భవభూతి యొక్క నాటక ప్రయోగ ప్రీతిని ఇట్లుగ్గడించినారు.

తామేతాం పరిభావయం త్వభినయై ర్విన్యస్త రూపాంబుధాః
శబ్ద బ్రహ్మవిదః కవేః పరిణత ప్రజ్ఞస్య వాణీమిమామ్.

అని యీ నాటకమును చక్కగా ఆడించి బుధులు ఆనందింతురుగాక అని తన సొంత అనుభవమునే చెప్పుచున్నాడా అనునట్లు వ్రాసినాడు" అని సెలవిచ్చిరి.

ఇంకనూ అదే వరుసలో ఉత్తరరామ చరిత నాటక ప్రయోగ విషయమున భవభూతికిని వేదం వారికినిగల సమానమగు ఆనందానుభూతిని యిట్లు పేర్కొనిరి.

"దీని ప్రయోగము గూర్చి శ్రీ వేదం వేంకటరాయశాస్త్రులవారు ఆ నాటకము పాఠము చెప్పుచుండగా భవభూతివలెనే తత్ప్రయోగముం జూడ ఉవ్విళ్ళూరుచున్నవారు నిజానుభవమును ఇట్లు ఆనతిచ్చినారు." అని చెప్పి తమ

గురువులు 1886 లో మద్రాసు పౌరసౌధమున ప్రదర్శించిన ఉత్తరరామ చరిత విషయము ఉటంకించినారు. రామదాసయ్యంగారు వెలిబుచ్చిన యీ అభిప్రాయములన్నియు గురువులనుండి శిష్యులకు సంక్రమించినవనుట తేటతెల్లమేగదా! శ్రీ శాస్త్రులవారు ఉత్తరరామ చరిత ప్రదర్శనద్వారా తొలుత నాటక ప్రయోక్తలైరి. తదుపరి దానిని అనువదించుట ద్వారా నాటక కర్తలైరి. ఈ పరిణామ క్రమములోనే ప్రతాపరుద్రీయ కర్తలై తత్ప్రయోక్తలైనారు.

శ్రీ వేదంవారు తమ ప్రతాపరుద్రీయమున ఏయే భాగములను ప్రయోగింపవచ్చునో మార్గదర్శన చేసియున్నారు. ఆ మార్గముననే ఆయా నాటక సమాజములవారు దానిని ప్రయోగించి రక్తికట్టించుచున్నారని వినికిడి. దీనిని యథాతథముగా ప్రయోగించినచో ఒకటికంటె ఎక్కువ రాత్రులు పట్టుననియు, వీరు సూచించిన మార్గమున ఒకరాత్రి పట్టుననియు చెప్పుదురు. దీనినిబట్టి మొత్తము ప్రతాపరుద్రీయము శ్రవ్య ప్రబంధముగాను, ఆయా భాగములు దృశ్యములుగాను రంజించుచున్నవని బోధపడుచున్నది. ఇదొక్క ప్రతాపరుద్రీయ విషయముననేగాదు, ఏనాటక విషయమందైననూ ఇంతే. ఒకనాటకమును, కవి వ్రాసినది వ్రాసినట్లు ఏ నాటక సంఘము వారుగాని ప్రదర్శించినట్లు కానరాదు. తమవద్దగల నటీనటుల శక్తి సామర్థ్యములను, రంగ పరికరములను, ఆర్థిక వనరులను, దేశకాల పాత్రానుసారముగ సామాజికుల యభిరుచి భేదమును బట్టి Edit చేసుకొని ప్రదర్శించుచుందురు. ఈ మెళకువలు తెలియని ప్రయోక్తకు పనికిరాకుండపోవుటకు ప్రతాపరుద్రీయమైనను, ఉత్తరరామ చరితమైనను, శాకుంతలమైననూ ఒక్కటే. తెలిసిన వ్యక్తికి, వస్తుతః అది మహానాటకమై యుండవలయునేగాని ఏ నాటకమైననూ, పరశువేది తగిలి బంగారమైనట్లు ఆ ప్రయోక్త చేతిలో బంగారమైపోవును. ఉత్తరరామ చరితమును యథాతథముగ చదువుకొన్నప్పుడు శ్రవ్యముగ రంజించుననియు, సరియగు విధముగ Edit చేసికొని ప్రయోగించినచో దృశ్యముగ నత్యంత రంజకంబనియు గుర్తించిన శాస్త్రిగారు దానిని చక్కగా ఎడిట్‌చేసి ప్రయోగ యోగ్యతను స్థాపింపగలిగిరి. ఉత్తరరామ చరితమునందు కలిగిన ఇట్టి విశ్లేషణాత్మక దృక్పథమే శాస్త్రిగారి ప్రతాపరుద్రీయ రచనా ప్రయోగములకు ఒజ్జబంతియైనదని భావింపవచ్చును. అసలు సంస్కృత భాష మృతమైనదని భావింపబడిన ఇటీవలి అంధకార యుగమున ఏ సంస్కృత నాటకము ఎడతెగక ప్రదర్శింపబడినది గనుక ఒకటి ప్రయోగ యోగ్యమైనది మఱొకటికాదు అని చెప్పుటకు? ఆ రోజులలో చంద్రున కొక నూలుపోగువలె సంస్కృత నాట్యరంగ నిర్మాణమునకు దోహదముచేసిన కళా ప్రపూర్ణునకు శ్రద్ధాంజలి ఘటించుట మన కర్తవ్యము,

---

# చెన్నపురి సంస్కృత నాట్యకళా క్షేత్రము

అవిభక్త మద్రాసు రాష్ట్రమున అంతర్భాగముగానున్న కాలమున తెలుఁగు వారికి తమ రాజధానీనగరమైన ఆ పట్టణముతోగల సంబంధ బాంధవ్యములను పురస్కరించుకొని అక్కడ వర్ధిల్లిన సంస్కృత నాటకరంగమును గూర్చి ఉల్లేఖించుట యుక్తమని భావించి ప్రత్యేకించి యీ శీర్షిక క్రింద నా యీ విషయములను క్రోడీకరించుట జరుగుచున్నది.

మద్రాసు నగరమున 1875 ప్రాంతమున ఆధునిక నాటకరంగము ప్రారంభమైనది. "ది మెడ్రాస్ డ్రమాటిక్ కంపెనీ" అను నాంగ్ల సమాజమును గూర్చియు, దానికి ప్రతిగా స్థాపింపబడిన శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యులవారి "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ సొసైటీని" గూర్చియు వెనుక తెలిసికొని యుంటిమి. కల్యాణ రామయ్యరు బృందమును గూర్చియు గురజాడ అప్పారావుగారి డైరీలలోని వాక్యములనుబట్టి తెలిసికొంటిమి. శ్రీ వేదంవారి ఉత్తరరామ చరిత నాటక ప్రయోగమును గూర్చిగూడ శ్రవణతాడితమైనది. మఱి రెండు మూడు విషయములను గూర్చి ముచ్చటించుకొందుముగాక.

బళ్ళారిలోని శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారి "సరస వినోదినీ సభ" తెలుఁగు నాటకములను చూచి ఉత్తేజితులైన కొందఱు యువకులు 1891 లో మద్రాసు నగరమున "సుగుణవిలాసినీ సభ" పేరుతో శ్రీ సంబంధం మొదలియార్ నేతృత్వమున ఒక నాటక సంస్థను స్థాపించి తెలుఁగు, అరవము, ఇంగ్లీషు నాటకములనేగాక సంస్కృత నాటకములనుగూడా ప్రముఖముగా ఆడుచుండెడివారు. వీరి ప్రదర్శనలు ఉత్తమోత్తమముగా నుండెడివనియు ఇందలి నటులు మంచి శిక్షణ గలిగియుండెడి వారనియు తెలియుచున్నది శ్రీ సంబంధం మొదలియారు విపరీతమైన కళా పిపాసగలవారు. నాటక కళ కొఱకు చివరికి హైకోర్టులో వకీలు వృత్తిగూడ వదిలి జీవితమును అంకితము చేసిన మహానుభావుఁడు.

ఇటీవలి కాలమున శ్రీమతి రుక్మిణీ అరండేలు చేసిన, చేయుచున్న సంస్కృత నాట్యకళా సేవ అమోఘమైనది. అడయారులో దివ్యజ్ఞాన సమాజమున కళాక్షేత్రమును నెలకొల్పి బాలబాలికలకు నాట్యకళా శిక్షణను ఇప్పటికినీ ఇచ్చుచున్నారు. ఈమె ప్రత్యేకత నాటక ప్రయోగములుకాదు. నృత్య ప్రదర్శన లిచ్చుట. కాళిదాస మహాకవి మాలవికాగ్ని మిత్రమను నృత్తరూపకమును భరత నాట్యశాస్త్ర సంప్రదాయానుసారముగా ప్రదర్శించి ప్రాజ్ఞలోకమును మెప్పించి ప్రశంసలనందుకొన్నది వీరు కుమారసంభవమును గూడ నృత్తరూపకముగ ప్రదర్శించుచుందురు. కథాకళి సంప్రదాయము ననుసరించి వీరు అభినయింతురు. ఇటీవల వీరు వాల్మీకి రామాయణ ఘట్టములను కొన్నింటిని సంగీత నృత్య రూపకముగా సిద్ధపఱచి ప్రదర్శించుచున్నారని వినికిడి.

ఉజ్జయినిలో ప్రతి సంవత్సరము కాళిదాస నాటకోత్సవములు జరుగుచున్నవి. ఆ సందర్భమున 1972 లో మద్రాసునుండి కుమారి కనకాబృందము కుమార సంభవము నృత్య నాటకమును ప్రదర్శించి స్వర్ణపతకమును ప్రధాన బహుమతిగా నందుకొన్నారు.

అచ్చట సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడు శ్రీ రాఘవన్‌గారి యాధ్వర్యమున సంస్కృత భాషా రంగము చక్కగా పనిచేయుచున్నదని చెప్పి విరమించుచున్నాను.

# ఆంధ్రీకృత సంస్కృత నాటక ప్రయోగములు

మనదేశమునందన్ని భాషాప్రాంతములలోవలె ఆంధ్రప్రదేశమున కూడ సుమారు వందసంవత్సరముల క్రిందటనే ఆధునిక నాటకరంగము ప్రారంభ మైనది. 1880-81 ప్రాంతమున ధార్వాడ నాటక సమాజమువారు తెలుఁగు నేలపై కాలు పెట్టి హిందీనాటక ప్రదర్శనములద్వారా మనవారిని ప్రభావితము చేసినప్పుడుగాని మనవారి దృష్టినాటక రచనలపైననూ నాటక ప్రయోగముల పైననూ మళ్ళినదికాదు అప్పుడు ప్రారంభమైన తెలుగునాటక రచనా ప్రయోగ ములు సంస్కృతానువాద నాటకములతో మొదలైనవి. మహామహులైనసంస్కృ తాంధ్ర పండితులనేకులు సంస్కృత నాటకములను ఆంధ్రీకరించుటకు దొఱ కొనగా మఱికొందఱు వానిని ప్రయోగించుటకు పూనుకొనిరి. ఈ సందర్భమున కొన్ని స్వతంత్ర నాటకములు కూడ వెలువడకపోలేదు. కాని ప్రధానముగా నిది ఆంధ్రీకరణయుగము. ఆంధ్రీకృత సంస్కృతనాటక ప్రయోగయుగము. ఇది 1875-1900 మధ్యకాలమని స్థూలముగా చెప్పవచ్చును.

ఈ కాలమున దాదాపు ప్రధానములైన సంస్కృతనాటకము లన్నియు అనువదింపబడినవి. ఒక్కొక్కదానిని ఒక్కరేగాదు అనేకులు అనువదించిరి. అట్లయ్యును "పుణ్యముచేత యశము లభించునను" నార్యోక్తి ననుసరించి ఏ కొందఱి మహితాత్ముల యనువాదములకో విలువ చేకూరినది. అంతేగాదు ప్రయోగ యోగ్యతకూడ లభించినది. ఇట్టి రెండువిధముల బహుళ ప్రచారము నకు వచ్చిన నాలుగైదు నాటకములను మాత్రమే తీసుకొని స్థాలీపులాక న్యాయ మున నిట ఉల్లేఖింప బడుచున్నది.

## రత్నావళి

శ్రీ హర్షుఁడు సంస్కృతమున రత్నావళి, ప్రియదర్శిక, నాగానందము అను మూడునాటకములను వ్రాసెను. అందులోనిదే ఈ రత్నా వళి. దీనిని శ్రీ కందుకూరి వీరేశలింగముగారు. (1848-1919) 1880లో ఆంధ్రీకరించిరి. 1881లో రాజమండ్రిలో వీరిచేత స్థాపింపబడిన తొలి తెలుగు

నాటక సమాజము నాధ్వర్యమున నిది వలుమార్లు ప్రదర్శితమైనది. ఇందు శ్రీ సోమంచి శంకరము అను కళాశాలా విద్యార్థియు అడివికొల్లు కనకరాజు అను వారును పాత్రధారణచేసిరి. ఆంధ్రీకృత నాటకములలో ప్రదర్శన యోగ్యతకు నోచుకొన్న తొలి నాటక మిదియేనని చెప్పవచ్చును.

## వేణీ సంహారము

సంస్కృత నాటకములలోనిది వీరరస ప్రధానమైనది. భారతమునందలి ఉపకథగాక, ప్రధానమగు భారతకథయే యితివృత్తముగా గలది. తింటే గారెలు తినవలె, వింటేభారతము వినవలెననిగదా లోకోక్తి; కావుననే కాబోలు నీ వేణి సంహారము మిక్కిలి లోకప్రియమై ప్రశస్తిగాంచినది. వేణీసంహారమనగా కొప్పుమోడ్చుట అని యర్థము. భీముఁడు కౌరవులను హతమార్చి రక్తసిక్తమైన చేతులతో ద్రౌవదియొక్క కురులను ముడుచుట యిందలి ప్రధానేతి వృత్తము.

## సంస్కృతకర్త నారాయణభట్టు?

ఈ నాటకమును భట్టనారాయణుడను కవి రచించెను. ఈతఁడు 7,8 శతాబ్దుల యందున్నట్లు ప్రతీతి. ఇంచుమించు ఇదే కాలమువాడగు వామనుఁడు తన కావ్యాలంకార సూత్రవృత్తియందు ఈ నాటకమునందలి శ్లోకముల నుదహరించుటవలన ఇది కొంతవఱకు స్థిరపడుచున్నది. ఆదిశూరుడను వంగదేశపు రాజు కాన్యకుబ్జ నివాసియైన భట్టనారాయణుని యాహ్వానించి యాతనికి వంచ గ్రామములను బహుమతిగా వంచియిచ్చెనని "క్షితీశవం శావళి" అను వంగ భాషా గ్రంథమునందున్నట్లు తెలియుచున్నది.

ఇదిట్లుండ ఈ భట్టనారాయణుఁడు భారత రచనలో నన్నయభట్టునకు తోడ్పడిన నారాయణభట్టు కావచ్చునని కొందఱూహించుచున్నట్లు విద్వాన్ శ్రీ దేవరకొండ చిన్నికృష్ణ శర్మగారు ఇటీవల తాము అనువదించిన వేణీసంహారము విజ్ఞప్తిలో పేర్కొనియున్నారు. వారివాక్యము లివి:

"మఱి భట్టనారాయణ అను నామధేయము నందలి భట్టశబ్దమును బట్టి యీ మహాకవి బ్రాహ్మణుడై యుండుననియు భారత రచనలో నన్నయ భట్టారకునకుఁ దోడ్పడిన నారాయణభట్టే భట్టనారాయణుడై యుండుననియు కొంద ఱూహించుచున్నారు. వారూహించినదే సత్యమైనచో నాంధ్రుల కది గర్వ

కారణమగును. భట్టనారాయణుఁడు నన్నయ భట్టారకునితోబాటు పదునొకండవ శతాబ్దియందు జీవించియుండును " అని. ఈ భట్టనారాయణ నారాయణభట్టుల ఐక్యతావాదమునుగూర్చి 1956లో భారతిలో ప్రకటింపబడిన శ్రీ గొట్టుముక్కల కృష్ణమూర్తిగారి "కన్నడాంధ్రములు" అను వ్యాసమునందు కూడ చర్చింప బడినది.

వేణీసంహారమునందలి ప్రార్థనా శ్లోకములలో మొదటి రెండును విష్ణు స్తుతి పరములు. మూడవది శివస్తుతిపరము. దీనినిబట్టి యీతఁడు నన్నయ తిక్కనలవలె హరిహరా ద్వైతభావముగల వాడని చెప్పవచ్చును, అనియు దేవరకొండ చిన్నికృష్ణ శర్మగారు వ్రాక్రుచ్చిరి. వీరింతటితో ముగించిన విషయ మును మఱికొంత సాగదీసినచో నన్నయ తిక్కనల హరిహరా ద్వైతభావములో నారాయణభట్టుగూడ భాగస్వామియే యగునుగదా? కాబట్టి నారాయణభట్టే భట్ట నారాయణుడను వాదము మఱికొంత బలపడుచున్నదని చెప్పవచ్చును. ఈ ఊహలన్నియు కొంతవఱకైననూ సత్యోత్థాపితములై, యీతఁడు తెలుఁగు వాడైనచో శ్రీ కృష్ణ శర్మగారన్నట్లు ఆంధ్రుల కది గర్వకారణమే యగును. కావుననే యీ విషయము నింతగా వ్రాయుట కుత్సహించితిని.

## ఆంధ్రీకర్త వసురాయకవి

ఈ సంస్కృత వేణీ సంహారమునకు నాలుగైదనువాదములు వెలువడినట్లు తెలియుచున్నది. అందులో ప్రముఖమైనది కీ. శే. శ్రీ వడ్డాది సుబ్బరాయుని యనువాదము. వీరు 1874 లో జన్మించి 1939 లో దివంగతులైరి. వీరి పూర్వ నివాసము వేగాయమ్మపేట. దరిమిలా రాజమహేంద్రవరమున స్థిరపడిరి. ఈ సంస్కృత నాటకమును వీరు 1883 లో నాంధ్రీకరించిరి. వీరి యనువాదము మూలమునకు దీటుగా నున్నదని సంస్కృతాంధ్ర పండితులెల్లరును మెచ్చు కొనిరి. తిరుపతి వేంకటకవులవంటి మహామహులు కూడ వీరి వేణీ సంహారాంధ్రీ కరణము చూసిన తరువాత తాముకూడ సంతటిపాకముతో ననువదింపవల యునని తలచి కొన్ని సంస్కృత నాటకముల ననువదించుటకు పూనుకొనిరని ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానిగారొకచో సెలవిచ్చిరి. తెలుఁగు నాటక రంగమున నాటక రాజమై విరాజిల్లు, తిరుపతి వేంకట కవులు రచించిన, పాండవోద్యోగ విజయములు నాటకమునకు సంస్కృత వేణీ సంహారముతోపాటు

వసురాయ కవిగారి యనువాదముకూడ వెలువడి పెట్టినదని అస్మదాదులు కొందఱి తలంపు. తెలుఁగు నాటకములలో పాండవోద్యోగ విజయములకుగల స్థానమెట్టిదో సంస్కృత నాటకములలో వేణీ సంహారమునకుగల స్థాన మట్టిదని ఒక్కముక్క చెప్పినచో సంస్కృత భాషా పరిచయములేని సంస్కృత భాషాభిమానులకు తెల్లము గాగలదని మనవి చేయుచున్నాను. నారాయణభట్టే భట్టనారాయణుడను కొన్నచో నాతఁడు రాజమహేంద్రవర నివాసియగును. అట్టియెడ రాజమహేంద్ర వర వాస్తవ్యులేయైన శ్రీ వడ్డాది సుబ్బరాయకవి పాలిట వేణీ సంహారాంధ్రీకర ణము పడుట దైవయోగమని చెప్పవలెను.

## ప్రయోగములు

ఇది 1883 లో అనువదింపబడినదని తెలిసికొంటిమి. ముద్రణ భాగ్య మును మాత్రము 1886 లో పొందినది. ముద్రింపబడుటకు పూర్వమే ఇది పలు మారులు ప్రదర్శితమైనది.

తొలి ప్రదర్శనము 1883 సంవత్సరము చివఱ వేగాయమ్మపేటలో వాద్రేవు రంగనాయికాంబారాణిగారి మందిరమున జరిగినదట. మఱికొన్ని మాఱులు ప్రదర్శించిన తరువాత తామే ఒక నాటక సమాజమును స్థాపించుటకు పూనుకొని "హిందూ నాటకోజ్జీవక సమాజము" అను సంఘమును స్థాపించి నారు శ్రీ వసురాయకవి. ఈ సమాజమున వీరు కవులు, దేశికులు, నటులుకూడ. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు 1884 ఫిబ్రవరిలో రాజమహేంద్రవర మున స్థిరపడుటకు వచ్చిరి. ఆ రోజులలో వసురాయల దేశికత్వమున, హిందూ నాటకోజ్జీవక సమాజమునాధ్వర్యమున వేణీసంహార నాటకములు ముమ్మరముగా ప్రదర్శింపబడుచుండెడివట శ్రీ చిలకమర్తివారు తమ స్వీయ చరిత్రలో వ్రాసిన దానినిబట్టి వారు స్వయముగా ఈ నాటకమును రెండుసార్లు చూసినట్లు వ్యక్తమగు చున్నది.

## నటుఁడుగా వసురాయకవి

శ్రీ వడ్డాది సుబ్బరాయకవి నాటకకర్త, ప్రయోక్తయేగాదు గొప్పనటులు కూడ. తొలి నాటకకర్తలలో భూమికాధారణ చేసిన మొదటివారు వీరేనని తెలిసిన వారు చెప్పుదురు. ఈ నాటకమున ప్రధాన పాత్రలు మూడు. ధర్మరాజు, అశ్వ

త్థామ, దుర్యోధనుఁడు. వీ రా మూడుపాత్రములను వహించిరి. ధర్మజాశ్వత్థామ పాత్రలను మహాశక్తిమంతముగా అతి సహజముగా నటించెడివారట. శ్రీచిలకమర్తి వారి కథనమునుబట్టి వారు చూచిన నాటకమున, కనుపర్తి శ్రీరాములుగారశ్వత్థామ పాత్రను, నుసర్ల అనంతరావుగారు దుర్యోధన పాత్రను, వసురాయలు ధర్మరాజ పాత్రను నిర్వహించిరి. చిలకమర్తివారే మఱొకసారి చూసినప్పుడు వసురాయలు ధర్మరాజుగాను అశ్వత్థామగానుకూడ నటించిరి. దుర్యోధనుఁడుగా నటించిరని ప్రతీతియేగాని యెప్పుడు నటించిరో యెవ్వరునూ పేర్కొనలేదు.

అశ్వత్థామగా వీర రౌద్రములను, ధర్మరాజుగా శాంతకరుణములను ఉట్టిపడునట్లు అమోఘముగా ఒకే నాటకమున నటించిరని, ఒకసారి చూసిన వారు మఱి మఱువజాలరని శ్రీ చిలకమర్తివారు చెప్పిరి. ఒకసారి వసురాయ కవి ఒక క్రొత్త ప్రయోగమును చేసిరట. నాటకాంతమున మూలములో లేని దండకము నొకదానిని ముక్కు తిమ్మన పారిజాతాపహరణమునుండి గ్రహించి ప్రత్యేకముగా శ్రీకృష్ణస్తవము చేసిరట. ఆనాడు వారు చదివిన ఆదండకము గాని, పద్యపఠనముగాని సామాజికుల ఒకలు పరవశింపఁజేసినవట. వీరు తెలుఁగు పద్యములతోపాటు మూలమునందలి సంస్కృత శ్లోకములనుగూడ పాడుచుండెడి వారు.

## మఱికొన్ని నాటక సంఘములు - ఆంధ్రవేణీ సంహార ప్రదర్శనలు

1885 ప్రాంతమున కాకినాడలో "హిందూసమాజము" పేరుతో నొక నాటక సంఘము వెలసినది. వారు తఱచుగా వసురాయని వేణీ సంహారమును ప్రదర్శించుచుండెడివారు ఇందలి సభ్యులలో శ్రీ దినవహి కృష్ణమూర్తిగారు భీముఁడుగాను, అలమూరి పట్టాభిరామయ్య దుర్యోధనుఁడుగాను నటించు చుండెడివారు.

విశాఖపట్టణములో 1895 ప్రాంతమున జగన్మిత్ర సమాజము స్థాపింప బడినది. శ్రీ రఘునాధవర్మ, అంకితం జగ్గారావు, మొసలికంటి సూర్యనారాయణ, సెట్టి లక్ష్మీనరసింహము, కాదంబరి జగన్నాధరావు, బెండూరి చిదంబర రావు మొదలగు కళాప్రియులిందు సభ్యులుగా నుండిరి. రాజా విక్రమదేవవర్మ గారు కట్టించిన హాలులో అనూదిత కాళిదాసు నాటకములు, ఆంధ్రవేణీ సంహారము ప్రదర్శింపబడుచుండెడివి.

1895 లో విశాఖపట్టణములోనే "కళాభిలాషక సమాజము" అను సంఘ మేర్పడినది. మారేపల్లి రామచంద్రశాస్త్రి, సెట్టి లక్ష్మీనరసింహముగారు ఇందు సభ్యులు. జగన్మిత్ర సమాజముతో పోటీగా యిది స్థాపింపబడినదట. ఈ సమాజమువారు ప్రప్రథమముగా వేణీ సంహారమునే ప్రదర్శించిరి. అనా డీ నాటకము జనరంజకముగా నున్నదని చెప్పుదురు.

1911 లో విశాఖపట్టణములో "కార్‌నేషన్ హిందీ అమెచ్యూర్సు" అను సంస్థను పార్శీ రామారావు అనువారుస్థాపించిరి. వీరుకూడ తొలిసారి వేణీ సంహారమునే ప్రదర్శించిరి.

ఇట్లనేక నాటక సమాజములవారు ఆంధ్రవేణీ సంహారమును పలుతావుల పలుమాఱులు ప్రదర్శించిరి. దాదాపు తొలి యాభై సంవత్సరములు ఆంధ్ర నాటకరంగమున నిది రాజ్యమేలినదని డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు చెప్పిన ఒక్కముక్కతో ఈ కథనము నింతటితో ముగించుచున్నాను.

## అభిజ్ఞాన శాకుంతలము

తెలుఁగున దీనికి వెలువడిసన్ని యనువాదములు మఱియే యితర నాటకమునకుగాని రాలేదు. కాని శ్రీ కందుకూరి వారి యనువాదమే యనువాదము. దీనినే అనేక నాటక సంఘముల వారాడుచుండెడివారు. శ్రీ పంతులుగారు దీని యనువాదమును 1875 లో ప్రారంభించి రెండంకములను వ్రాసి విడిచిపెట్టిరి. మఱల 1883 లో పూనుకొని పూర్తిచేసిరి.

ఈ ఆంధ్రీకరణము నాడిన నాటక సంఘములలో మైలవరం కంపెనీ మఱియు మోతేవారి కంపెనీ ముఖ్యమైనవి. మైలవరం రాజావారి యాధ్వర్యమున వెలసిన ఈ సమాజము తొలుత మైలవరమునందే పనిచేసి, తరువాత 1917 ప్రాంతముల విజయవాడకు మార్చబడినది. ఏలూరు మోతే నారాయణరావుగారి చేత స్థాపింపబడిన "సీతారామాంజనేయ నాటక సమాజమే" మోతేవారి కంపెనీగా పేరు పొందినది. ఈ రెండింటిలో కాల సరణినిబట్టి మైలవరం కంపెనీ మొదటిది. మోతేవారి కంపెనీ రెండవది. ఈ రెండు కంపెనీలవారు ఆంధ్ర శాకుంతలమును ఎక్కువగా నాడుచుండెడివారు. శ్రీ యడవల్లి సూర్యనారాయణ అను మహానటుఁడు తొలుత మైలవరం కంపెనీలోనూ తదుపరి మోతేవారి కంపెనీలోనూ మేనేజరుగా, నటుఁడుగా పనిచేయుచుండెడివారు.

## దుష్యంతుఁడుగా యడవల్లి సూర్యనారాయణ

శ్రీ యడవల్లివారు అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంత భూమికను ధరించు చుండెడివారు. పుట్టుకతోనే రాచఠీవి ఉట్టిపడు వీరు దుష్యంత వేషమున మహోదాత్తముగా నుండెడివారు. కమ్మనికంఠము, శ్రవణసుఖమైన వాచికముతో పండిత పామరుల నిరువురినీ యాకట్టుకొనుట వీరి ప్రత్యేకత. తెలుఁగు పద్యములతో పాటు ఎదనెడ సంస్కృత శ్లోకములనుగూడ పాడుచుండెడివారు. ఈ పద్ధతిని వీరు శ్రీ వసురాయ కవినుండి గ్రహించినట్లు కనబడుచున్నది "శాంతమిద మాశ్రమపదం" అను శ్లోకమును కానడ రాగములో కమ్మగా చదివెడివారట. వీరి దుష్యంత పాత్రమును కన్నారా చూసిన వయోవృద్ధులీనాటికీ యడవల్లి దుష్యంత పాత్రను గూర్చి ముచ్చటలు చెప్పుచుందురు. ఆంధ్రనాటక రంగమున దుష్యంతుడెవరు ? అను ప్రశ్నకు యడవల్లి అను సమాధానము వెంటనేవచ్చును. అప్పటికీ యిప్పటికీ వారిపేరే నిలుచుట అదృష్టమో దురదృష్టమో తెలియుటలేదు. ఇట్టుదాత్తమైన దుష్యంత పాత్రతోపాటు స్వభావ భేదముగలిగి రాజఠీవితో నొప్పు దుర్యోధన పాత్రను కూడ వీరు గంభీరముగ పోషించెడివారు. ఈ రెండు పాత్రలకు వీరు పెట్టినదిపేరు.

## శ్రీ వేదంవారి శాకుంతలము

కళాప్రపూర్ణ వేదం వేంకట రాయశాస్త్రిగారిని గూర్చి వెనుక విపులముగా చర్చించుకొంటిమి. వారనువదించిన సంస్కృత నాటకముల పట్టికను కూడ వినియుంటిమి. వారి యనువాదములలో ఉత్తరరామచరితమున్న పేరు మరిదేని కినిలేదు. కాని వీరి ఉత్తరరామ చరితముకంటె అభిజ్ఞాన శాకుంతలమే ప్రయోగ యోగ్యతను కొంతవలకా నాడు బడసినది. వీరియనువాద నాటకములన్నియు వీరి శిష్యులచేతనే ప్రయోగింప బడుచుండెడివి. అనేక మాఱు లీయనువాదములు రంగస్థలముపై ప్రదర్శింప బడినవి. అభిజ్ఞాన శాకుంతలము ప్రప్రథమ మమున 2-7-1897లో నెల్లూరులో ప్రయోగింపబడినది. అందులో శ్రీవారి శిష్యులైన దొరైస్వామి అయ్యంగార్ అనబడు కందాడై శ్రీనివాసన్‌గారు దుష్యంతుడుగా నటించిరి. ఆనాడు వారి పాత్రపోషణ మమోఘముగా నుండినదని చెప్పుదురు. దుష్యంతుండుగా వీరుకూడ తగినపేరు పొందినట్లు కనపడుచున్నది. వీరు అనువాద నాటకమునేగాక సంస్కృత నాటకమునుగూడ ప్రయోగించు

చుండెడివారు. శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారి మనుమలైన శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారు "ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన" "కళా ప్రపూర్ణ వేదం వేంకట రాయశాస్త్రి శతజయంతి'' సాహిత్యోపన్యాసములు అను గ్రంథమున శ్రీ దొరైస్వామి అయ్యంగారిని గూర్చి కొన్ని వివరములను చెప్పిరి. శ్రీ దొరైస్వామిగారు ఒకసారి జబ్బువడి కోలుకొని ఆర్థిక పరిస్థితులను చక్క బెట్టు కొనుటకు సంస్కృత శాకుం లమును, శాస్త్రిగారి ఆంధ్ర శాకుంతలమును మఱియు ప్రతాపరుద్రీయమును వరుస వరుసగా ప్రదర్శనములిచ్చి కొంతధనము నార్జించిరి. కాని తరువాతి ప్రదర్శనములకు నష్టపోయిరి. దానితోపాటు వారి యుత్సాహము సన్నగిల్లినది. వీరు చాలా చిన్నవయస్సుననే మరణించిరి. శ్రీ దొరైస్వామిగారు జాతీయవాది ఒకవైపున సంస్కృతాంధ్ర నాటకప్రయోగ ములద్వారా కళాసేవజేయుచూ మరొకవైపున రాజకీయవాదిగా కాంగ్రెసులో పనిచేసి జైలుకు వెళ్ళినవ్యక్తి. ఇట్లేమరి కొన్ని వివరములను శ్రీ వేదంవారి మనుమలు చెప్పిరి. శ్రీ అయ్యంగారితోపాటు సంస్కృత శాకుంతలము నందును ఆంధ్ర శాకుంతలమునందునూ శకుంతలగానటించిన వారిరువురు.ఒకరు కందాడై శఠగోప రామానుజంగారు. మరొకరు నందగిరి హనుమంతరావుగారు. వీరిరు వురూ శకుంతలవేషమున అచ్చగా అప్సరలవలెనుండెడి వారట. కళాప్రపూర్ణ శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారును, శ్రీ దొరైస్వామి అయ్యంగారును కలిసి నెల్లూరులో "ఆంధ్రభాషాభివర్ధనీ" అను సమాజమును నడిపి, శాస్త్రిగారి యను వాద నాటకములను, స్వతంత్రనాటకములను మాత్రమే ప్రదర్శించు చుండెడి వారు. శ్రీ వేదంవారు స్వయముగా నెల్లూరు మూలపేటలో నటులకు శిక్షణనిచ్చి పాత్రలను తీర్చిదిద్దెడివారు.

## తెలుగు ఉత్తరరామ చరితము

భవభూతి రచించిన ఉత్తరరామ చరితమును తొలుత అనువదించిన మహానుభావుఁడు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారి నాటకము లలో ప్రదర్శన భాగ్యమునకు నోచుకొన్నది వారి ఉత్తరరామ చరితానువాదమే. దీనిని వీరు 1880లో ప్రారంభించి "చింతామణి" పత్రికలో ప్రకటించిరి. తరువాత 1883లో పుస్తకరూపమున వెలువడినది. ఈ నాటకమును రాజమండ్రి లోని ఒక నాటకసమాజము వారికొఱకు, అనువదించినట్లు వారు వ్రాసుచ్చిరి.

దీనిని ప్రదర్శించిన నాటకసమాజము వనుదాయకవిగారి "హిందూనాటకోజ్జీవక సమాజమే." కావున ఈ నాటకసంఘమువారి కొఱకే యిది వ్రాయబడి యుండి నట్లూహింపవచ్చును.

శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారు కూడ ఉత్తరరామ చరితమును అనువదించినట్లు తెలిసికొంటిమి. వారి అనువాద నాటకములలో కెల్ల సాహిత్యగౌరవముతో నొప్పారునది యీ ఉత్తరరామ చరితమే. దీనిని నెల్లూరిలోని వీరి సమాజము వారే ప్రదర్శించిరని మాత్రము తెలియుచున్నదిగాని యింతకుమించిన వివరములు లభించుటలేదు.

## మృచ్ఛ కటికము

ఇది సంస్కృతభాషలో శూద్రక మహాకవి రచించిన గొప్ప సాంఘిక నాటకము, దీని ననేకమంది తెనిగించిరి. కాని కీ॥ శే॥ శ్రీ తిరుపతి వేంకట కవుల యనువాదమే రమ్యమైనది. తొలిదశలో వీరి యనువాదమునే అనేకనాటక సమాజములవారు ప్రయోగించు చుండెడివారు తెలుఁగుదేశమునందేగాక అధునిక కాలమున భారతదేశమునందే ఈ నాటకమును ప్రదర్శించిన గౌరవము తొలుత ఏలూరు మోతేవారి కంపెనీకే దక్కుచున్నది. దీనిని వీరనేక పర్యాయములాడిరి. 20-9-1924 నాడాడినట్లు ఇదమిత్థముగ నొకతేదీ లభించుచున్నది. శ్రీయుతులు జిడ్డు లింగయ్య, శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రిగారలు ఈ సమాజమునందలి నటులకు మంచి తరిఫీదునిచ్చి తయారుచేసినట్లు తెలియుచున్నది. శ్రీయుతులు కొచ్చర్లకోట రంగారావు శకారుఁడుగను, లక్ష్మీనారాయణ (వీరి యింటిపేరు తెలియుటలేదు.) చారుదత్తుడుగను, ఆరణి సత్యనారాయణ వసంతసేనగను పట్టాభిరామయ్య మైత్రేయుఁడుగను, ముంజులూరు కృష్ణారావు చందనకుఁడుగను నటించిరి. ఈ నాటకమునకు వీరు చేసిన రంగాలంకరణ హృదయంగమముగ నుండినదట.

ఇట్లాంధ్రీకృత సంస్కృత నాటకముల నాయా నాటక సమాజములవారు దశాబ్దముల తరబడి ప్రయోగించి అనూదిత నాటక ప్రయోగయుగమును సృష్టించిరి. దీనివలన ఈ నాటకములను సంస్కృతములోనే ప్రయోగింపజాలని లోటును కొంతవఱకు భర్తీచేసిరని చెప్పవచ్చును. అనాదంతవఱకైననూ చేసి పరోక్షముగ సంస్కృతభాషా కళామతల్లికి కర్పూర నీరాజనములు పట్టిన ధన్యజీవులు వారు. వారికి నమోవాకములు.

## మహాకవి కాళిదాసచరిత్ర నాటకము

సంస్కృతము నుండి తెలుఁగున ననువదింపబడిన నాటకములను ప్రదర్శించుచూ నటులు తెలుఁగు పద్యములతోపాటు మూలసంస్కృత శ్లోకము లను కూడ చదువుచుండిన వైనమును గూర్చి తెలిసికొంటిమి. ఇప్పుడు తెలుఁగు పద్యములు, సంస్కృత శ్లోకములు కలగాపులగముగా వ్రాయబడి సంస్కృత నాటక వాతావరణముతో నొప్పుచున్న తెలుఁగునాటకమును గూర్చియు తత్ప్ర యోగ బాహుళ్యమును గూర్చియు నరసికొందము.

తెలుగులో కాళిదాస జీవిత మితివృత్తముగాగల నాటకములు మూడు న్నవి. 1932 లో బందరు వాస్తవ్యులైన శ్రీ అవటపల్లె నారాయణరావుగారు రచిం చిన "మహాకవి కాళిదాస చరిత్ర" అను ఏడంకముల నాటక మొకటి. 1932 లోనే విజయవాడ వాస్తవ్యులు కాటోలు శ్రీ సోమరాజు రామానుజరావుగారు వ్రాసిన "భోజకాళిదాసు" అను ఎనిమిదంకముల నాటకముమరొకటి. 1964లో మద్రాసు పచ్చయ్యప్ప కాలేజీ తెలుఁగు అధ్యాపకులైన శ్రీ చిలకపాటి వేంకటరామానుజశర్మగారు నిర్మించిన "కాళిదాన చరిత్ర ప్రకరణము" అను పదంకముల నాటక మింకొకటి. ఈ మూడింటియందును శ్లోకము లున్నవి. సంస్కృతనాటక వాతావరణమున్నది. దాదాపు అన్నియు ప్రయోగయోగ్యములే. తెలుఁగునాటక రంగముపై ప్రయోగింపబడుచున్నవిగూడ. ఇట్లు వీనిలో కొన్ని సమాన గుణధర్మములున్ననూ విశిష్ట నిర్మాణ భేదముచేత శ్రీ అవటపల్లె నారాయణరావుగారి "మహాకవి కాళిదాన చరిత్ర" తక్కిన రెండింటినీ మించు చున్నది. కావుననే యిది ఎక్కువగా ప్రయోగ యోగ్యతను సంతరించు కొన్నది.

ఇందేడంకములున్నవి. సుమారు 25 సంస్కృత శ్లోకములున్నవి. శ్యామలాదండకమున్నది. కాళిదాసుతోపాటు బాణభట్ట భవభూతి మయూర కవి రాక్షస ఏకసంధాగ్రాహులు అను ఆర్గురు కవులు పాత్రలుగా నున్నారు. ఈ సంస్కృత శ్లోకము లొక్కొక్కటి ఒక్కొక్క రసపుటిక, "మాణిక్యవీణాం" మొదలగు నాల్గు వరుస శ్లోకములను గూర్చిగాని, శ్యామలాదండకముగూర్చిగాని ప్రత్యేకించి చెప్పబనిలేదు. దీనికితోడు ఇందలి సంస్కృత కవులందరూ కాళి దాసుతోపాటు మహాచతురుకుగా వ్యవహరింతురు. అన్ని అంకముల కంటె చతు

ర్థాంకము నంసస్కృత శ్లోకములున్నవి. సుమారు 15 శ్లోకము లిక్కడనే ఉన్నవి. ఎక్కువమంది కవులకు ఈ యంకమునందే ప్రవేశమున్నది. షష్ఠాంకమున యతికి భోజరాజుకు మధ్య నడచిన సంభాషణా శ్లోకముగాని, భోజకాళిదాసుల నడుమ నడచిన సంభాషణా శ్లోకముగాని మఱింత సంస్కృత నాటక వాతావరణ మును తెచ్చిపెట్టుచున్నవి. నటులు ఈ శ్లోకముల నన్నింటినీ ఉత్సాహముగా చదువుచుందురు. ప్రేక్షకు లీనాటకమును చూచుచు ప్రక్కవారితో "ఇదుగో యిప్పుడు శ్యామలాదండకముండును" యిదిగో యిప్పుడు భోజ కాళిదాసుల మధ్య సంస్కృత శ్లోకములతో సంభాషణ నడచును. ఇత్యాదిగా తినబోవుచూ రుచులను భావన చేసినట్లు మరుక్షణము రాబోవు విషయములను మహా ఉబ లాటముతో చెప్పుచుందురు. వినువారు కూడ అంతే ఉబలాటముతో వ్యవహ రింతురు. ఈ నాటకమును చూచుచున్నప్పుడు సామాజికుల హృదయములు నుసంస్కృతములై కాళిదాసాది మహాకవులన్ననూ, సంస్కృత భాషయన్ననూ మిక్కిలి యాదరముతో నొప్పారుచుండును. ఇది తెలుగు సామాజికుల హృదయ ములపై సంస్కృత ముద్రను వేయుచున్నదని చెప్పవచ్చును. ఒక్కొక్కతరి యిది తెలుఁగు నాటకమా? సంస్కృత నాటకమా? యను భ్రమను కూడ గొల్పుచుండును.

ఇట్టి నాటకము తెలుఁగు నాటక రంగముపై యిదొక్కటే కనబడు చున్నది. వేదంవారి ప్రతాపరుద్రీయమున విద్యానాథ పాత్రకు ప్రాధాన్య మున్నది. మూడు నాల్గు సంస్కృత శ్లోకములు కూడ నున్నవి. ప్రతాపరుద్ర యశో భూషణమును రాజుకు కృతి యిచ్చుట కూడ ఉన్నది. కాని అందు సంస్కృత నాటక వాతావరణము ఉట్టిపడుటకు వీలులేదు. కారణమందలి ప్రధా నేతి వృత్తము రాజైన ప్రతాపరుద్రునిది. విద్యానాధునిది కాదు. విద్యానాధు డొక్కడే యిక్కడ సంస్కృతకవి. పైపెచ్చు తురక పాత్రల ప్రభావము వలన విద్యానాధ పాత్ర మరీ గౌణమైపోయినది. పైగా విద్యానాధుఁడు కాళిదాసంత సుపరిచితుఁడుకాడు సామాజికులకు. వేదంవారు మఱికొంత శ్రద్ధపూని సంస్కృత నాటక వాతావరణమును కల్పించియున్నచో ప్రతాపరుద్రీయమునకు బంగారమునకు తావి యబ్బినట్లయ్యేడిదని చెప్పవచ్చును.

కాళిదాస నాటకముల వంటి నాటకములు మఱికొన్ని వెలువడవలసి యున్నది. అవి సామాజికుల హృదయములలో కల్పించు సంస్కృత నాటక

వాతావరణము పరోక్షముగ సంస్కృత నాట్యరంగ నిర్మాణమునకు దోహదకారి కాగలదు.

ఈ నాటకము వెలువడి యిప్పటికి 40 సంవత్సరములు పైబడినవి. ఈ సుదీర్ఘకాలమున దీని నెందరో సుప్రసిద్ధనటులు ప్రయోగించిరి. వెనుకటి తరము వారిలో కీ। శే॥ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ జొన్నలగడ్డ సీతా రామశాస్త్రి, మొదలగువారు ముఖ్యులు. ఇప్పటి వారిలో శ్రీయుతులు మద్దూరి సత్యనారాయణ, జి. యస్. యన్. శాస్త్రి, ప్రభృతులు ప్రసిద్ధివహించుచున్నారు.

# సంస్కృత సంగీత నృత్యరూపకములు—ప్రయోగములు

సంస్కృతమున జయదేవుని గీత గోవిందము గొప్ప సంగీత నృత్య రూపక మగుట జగద్విదితము. కాని కేవలము కావ్యములుగా వ్రాయబడిన వాల్మీకిరామాయణము, కాళిదాసుని రఘువంశ కుమార సంభవ మేఘ సందేశ ములు గూడ సంగీతనృత్య రూపకములుగ ప్రసిద్ధికెక్కుట ఆశ్చర్యకర విష యము. దీని కికారణము ఈ మహాకవుల రచనల యందిమిడియున్న సాహిత్య తత్వముతోపాటు అనిర్వచనీయమైన సంగీత ధర్మము కూడ. ఇంతేగాదు, ఈనాడు మన మాంధ్ర ప్రబంధము లందిమిడియున్నవనుకొనుచున్న నాటకీ యత, సంభాషణలు మొదలగునవి వీని యందుండుట కూడ కారణమని తోచక మానదు. స్థాలీపులాకన్యాయమున ఈ విషయ మాలోచింతము.

## రామాయణములో సంగీత ధర్మము

వాల్మీకి రామాయణ రచనకు మూలబంధమగు నీ క్రింది శ్లోకము నర యుడు.

మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిధునాదేకమ వధీః కామమోహితమ్.

బోయవాఁడు క్రౌంచ మిధునములో మగ దానిని బాణముతో కొట్టి చంపెను. మరణించుచున్న భర్తను చూచి ఆడది విలపించెను. తనకళ్ళ యెదు టనే జరిగిపోయిన ఈ ఘోరమును చూడగనే వాల్మీకి నోటినుండి ఈ శ్లోకము వెలువడినది. ఇది ఆడపక్షి యొక్క మూగవిలాపమునకు వాల్మీకి యిచ్చిన వాగ్రూపమట.

క్రౌంచి మూగ భాషలో పలికిన మాటల యర్థమిది:-

"ఓయీ నిషాదుడా! కామ మోహితులమైన మాలో నా పతినిహత మార్చితివి. ఇంక నీవు చిరకాలము జీవింపవుసుమా"

ఈ మూగవిలాపమునకు వాల్మీకి యిచ్చిన వాగ్రూపము యొక్క అర్థమిది :-

"ఓయీ నిషాదుడా! కామమోహితమైన క్రౌంచ మిథునములో నొకదానిని చంపితివి. నీవు చిరకాలము జీవింపవు సుమా!"

ఇట్లు తన నోటి నుండి శ్లోకము వెలువడిన వెంటనే నే నిప్పుడేమి పలికితిని? అని తనలోతాను వితర్కించుకొని వెంటనే యిట్లు సమర్థించుకొనెను.

పాదబద్ధో౽క్షరసమః తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకోభవతు నాన్యథా.

శోకార్తుడనైన నా యీ వాగ్ప్రవృత్తి పాదబద్ధము. అక్షరసమము తంత్రీలయ సమన్వితము. ఇది శ్లోకమే యగును గాని వేఱుగాదు.

ఇక్కడ వాల్మీకి నోటి నుండి వచ్చిన శ్లోకమున్నదిగాని ప్రక్కవాయిద్యమగు తంత్రీ స్వరమేదియు నుండుటకు వీలులేదు. మఱి వాల్మీకి యిట్లనుచున్నాడేమి?

డా॥ పాటిబండ మాధవశర్మగారు తమ "ఆంధ్రమహాభారతము-ఛందః శిల్పము" అను గ్రంథమున ఛందోవతారమను ఘట్టమున ఈ విషయము నెత్తుకొని పరమ రమణీయముగను మిక్కిలి కళాత్మకముగను అనుశీలనము చేసియున్నారు. అదియే నా కిప్పట్టున స్ఫూర్తిని కలిగించినదని మనవి చేయుచూ వారి సమన్వయ వాక్యములను యథాతథముగా పొందుపఱచుచున్నాను.

"వాల్మీకి నోటివెంట మానిషాద శ్లోకము వెలువడినప్పుడు అచ్చట తంత్రీస్వర మేదియులేదు. క్రౌంచీరోదన నాదమును వినుచునే వాల్మీకి మానిషాద శ్లోకము నుచ్చరించెను. క్రౌంచీరోదన నాదముతోపాటు తన శ్లోకమును గూడ వినెను. అనర్థకమైన క్రౌంచీకంఠనాదమే అచ్చట తంత్రీనాదము. దాని యందు లయ మొందియే శ్లోక వాక్యము వినబడెను. క్రౌంచీనాదము వ్యంజించు

భావము, వాల్మీకి వాక్యము వ్యంజించు భావము ఒక్కడే, పక్షియైన క్రౌంచి నాదము యొక్క యర్థము మనుష్యులకు వాల్మీకి వాక్యమున తెలియవచ్చును. సమానభావ వ్యంజకములైన రెండు కంఠనాదధారలు మేళన మొంది శ్రవోరంధ్రముల బ్రవహించుటచే వాక్యము తంత్రీలయ సమన్వితమై వినవచ్చినది. ఈ యభిప్రాయమును ఆనందించిన సోదరుఁడు రజనీ కాంతరావు దానిని మఱి కొంత భావన చేసి ఇంకొక యద్భుత విషయమును కనిపట్టెను. శ్లోకము "మానిషాద" అను నక్షరములతో ఆరంభమగుచున్నది. ఈ యక్షరములు మ, ని, స, ద, అను స్వరములు, క్రౌంచికూత యందీ స్వరములే యుండునట, వాల్మీకి క్రౌంచిరోదనతాదాత్మ్యమున నుచ్చరించిన వాక్యము అచ్చముగా క్రౌంచికూత వలెనే ఆరంభమైయుండును. ఆనంద వర్ధనాదులు ఈ ఘట్టమున దర్శించిన రససిద్ధాంత రహస్యమునకు ఇది యంతయు బలసంపత్తి॥

శ్రీయుతులు మాధవశర్మ, రజనీకాంతరావు గారలు ఈ ఘట్టమున సందర్శించిన సంగీత ధర్మము రామాయణము నందంతట నంతర్గతముగ బ్రవహించు చున్నదని భావించుటకు అవకాశము కలిగించుచున్నది వాల్మీకము నందిమిడి యున్న యీ అద్భుతతత్వమును కనుగొన్న కళాకారులు అనాదినుండి కొన్ని ఘట్టములను గానము చేయుచునే యున్నారు. వాటిని సంగీత నృత్యరూపకముగ ప్రదర్శించుచున్నారు కూడ. భోజరాజు తన చంపూ రామాయణమున "కుశ లవ నామధారులగు కుశీ లవులు రామకథను గానము చేసిరనియు నటించిరనియు" చెప్పుటలో గల యంతరార్థమిదియే.

## రామలీలోత్సవములలో రామాయణము

విజయనగరమున శ్రీ విజయరామ గజపతీంద్రులు ప్రతిసంవత్సరము రామలీలోత్సవములను జరుపుచుండెడివారు. ఈ విషయము శ్రీ మండ కామేశ్వర కవిచే వ్రాయబడి విజయరామ గజపతి కంకిత మీయబడిన కూర్మపురాణములోని ఈ క్రింది పద్యముల వలన తెలియుచున్నది (చూ. నిడదవోలువారి వి. సం. ఆం. వా. పో. పుట 5)

శ్రీవిజయరామ రాజన్య శేఖరుండు
రామలీలోత్సవం బతిరమ్యముగనుఁ
జేయుచుండగ నాటి త్రేతాయుగంబు
తోడవచ్చె ననంగను తోచె ధరణి.

అఖిలములు రామకథలు ప్రత్యక్షముగను
గాంచి ప్రజలు ఇట్లని వచించిరేమొ
గంటి మిట్టుల త్రేతాయుగంబునందు
నందఱికి చరితంబు ప్రత్యక్షమేది.

డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు 'తెలుఁగు నాటక వికాసము'లో 188 పుట యందు ఇవి జరుపబడిన తీరు తెన్నులను గూర్చి యిట్లు వ్రాసిరి:—

"విజయనగరములో సంస్థానాధిపతుల పోషణలో రామలీలోత్సవములు తొమ్మిదిరోజులు జరిగెడివి. తొమ్మిదిరోజులలోనూ తొమ్మిది రామాయణ ఘట్టములను ప్రదర్శించెడివారట. ఇది సంఘమున కంతటికినీ సంబంధించిన యుత్సవము (Community Festival). ఆ సమయములో విజయనగరము రామాయణ కాలమునాటి భారత వర్షముగా మాఱిపోయెడిది. నేటి సంస్కృత పాఠశాల కెదురుగా నున్న పెద్దమైదానము అయోధ్యాపట్టణము, ఊరికి తూర్పుగా నున్న ప్రదేశము లంకాపట్టణము. ఇంక రాజావారి పూలతోట మిథిలానగరము. 9 వ రోజున అయోధ్యాపట్టణము నుండి లంకాపట్టణమునకు దాడి వెడలెడివారు. మహారాజావారు కూడ ఊరేగింపులో లంకాపట్టణమునకు వెళ్ళెడివారు. అచ్చట రామ రావణ సైనికులకు (వారు తత్తదుచిత వేషములలో నుందురు) యుద్ధము, రావణ సంహారము జరిగెడివి. చిన్ని వరహాలు అనెడి కోమటి రావణ వేషమును ధరించెడివాడనియు, అతని ఆహార్యము నేటికిని విజయనగరములో కలదనియు తెలియుచున్నది"

ఈ రామ లీలోత్సవములలో శ్రీముదుంబై వరాహనరసింహస్వామి వారు తమ వీణాగాన ప్రదర్శన లిచ్చెడివారని శ్రీద్వారం భావనారాయణగారు "విజయనగరంలో సంగీత నృత్య విద్వాంసులు" అను వ్యాసము నందు పేర్కొనిరి.

పై మహానుభావుల వ్రాతల వలన ఈ ఉత్సవము లొకవైపున జన సామాన్య రంజకమగు జాతరల రూపముననూ, మఱొక వైపున సహృదయ సమ్మోదకరమగు సాహిత్య సంగీత నాట్యాది గోష్ఠిరూపముననూ జరుగుచుండెడి వని యనుకొనుటకు వీలుకలుగుచున్నది. విజయనగర వాస్తవ్యులైన వయోవృద్ధులు కొందఱి నడుగగా ఈ విషయము నిక్కే ధృవపఱచిరి.

శ్రీ విజయరామ గజపతికి వాల్మీకి రామాయణ తులసీ రామాయణము లపై మక్కువ ఎక్కువగా గోచరించుచున్నది. తులసీరామాయణమును మండ కామేశ్వర కవిచేత అచ్చ తెలుగులోనికి అనువదింపజేసిరి. ఈ యనువాదవిషయ మును శ్రీ నిడదవోలువారు తమ వి, సం, ఆం, వా, పో, లో విపులముగా చర్చించిరి. మచ్చునకై అన్ని కాండల నుండి కొన్ని హిందీ మూలములను వాని కెదురుగా అనూదిత పద్యములను చూపించిరి. మండ కామేశ్వరశాస్త్రి రచించిన "రామకథాసార సంగ్రహము" అను మూడాశ్వాసముల ప్రబంధము గూడ విజయరామ గజపతి వ్రాయించినదే. ఇక వాల్మీకి రామాయణ విషయము చెప్ప నక్కఱలేదు. పారాయణముగ, పురాణముగ, ఉపన్యాసముగ, బృందగానముగ, గోష్ఠులరూపమున నిరంతరము వ్యాసంగము చేయబడుచుండెడిది. రామకథా సాహిత్యముపై ఇంతటి మక్కువగలిగి, 9 రోజులు తొమ్మిది రామాయణ ఘట్ట ములను ప్రదర్శింపజేయుటయేగాక, 9 వ రోజు నాటి జాతరలలో స్వయముగా పాల్గొనగలిగిన కళాపిపాసతో నొప్పారి, సంస్కృత పాఠశాలను స్థాపించి, సంస్కృత నాటక సమాజమును గూడ వెలయించి సంస్కృత భాషా నాటకము లనే వేయింపగలిగిన రాజావారు వాల్మీకి రామాయణ ఘట్టములను రామ లీలో త్సవములలో సంగీతనృత్య రూపకములుగా ప్రదర్శింపజేసియుండక పోదురా యను విచికిత్స కలుగక మానదు. ఇరువురు బాలురకు కుశ లవ వేషములను వేయించి వీణావాదన పురస్సరముగ వారిచేత రామ లీలోత్సవములలో సంగీత నృత్యరూపముగ ప్రదర్శింపజేసియుందురని ఎవరైననూ అభిప్రాయపడుట కవ కాశమున్నది ఇది నేనుగా ఊహించుచున్నానేగాని నిరూపణకు ప్రమాణములేదు. దీనికి సహృదయులే ప్రమాణము.

## రుక్మిణి అరండేల్ రామాయణ రూపకము

శ్రీమతి రుక్మిణీ అరండేల్ వాల్మీకి రామాయణ ఘట్టములను సంగీత నృత్య రూపకముగ సిద్ధపఱచి తనకడ సుశిక్షితులైన కళాకారులచేత ప్రయో గింపజేయుచున్నారు. ఇటీవల బొంబాయి నగరమున వీరొక ప్రదర్శనమునిచ్చి యున్నారు.

1955-56 ప్రాంతముల శ్రీహరి హనుమచ్ఛాస్త్రిగారు (కీ॥ శే॥ శ్రీహరి నాగభూషణంగారి కుమారులు) వాల్మీకి రామాయణ ఘట్టములను గానము

చేయుచూ శ్రోతలను పరవశింపజేసెడివారు. బాపట్ల టౌనుహాలులో వీరొక గాన ప్రదర్శన మిచ్చియుండుట నేనెఱుగుదును.

విజయనగరం మహారాజా సంగీత కళాశాలలో థీరీలెక్చరర్‌గా పనిచేసి యిటీవలనే ఉద్యోగ విరమణచేసిన "సంగీత భూషణ" శ్రీ శిష్టా రాజశేఖరం గారు బాలరామాయణ శ్లోకములను కచేరీ చేయుటలో సిద్ధహస్తులు.

## కావ్యత్రయము-సంగీత నృత్యరూపకత

కాళిదాసదృష్టజాతకుఁడు. పట్టినది బంగారము ముట్టినది ముత్యముగ చేసిన కళాతపస్విలుఁడు. ఈతని నాటకత్రయము సంగతి యటుంచి కావ్య త్రయముకూడ సంగీత నృత్యరూపకముగ ప్రసిద్ధికెక్కినది. ఇంకనూ చెప్పవలె నన్న ఈతని దృశ్య ప్రబంధములు సైతము అంతగా ప్రయోగింపబడనివై శ్రవ్య ప్రబంధములుగా మాత్రమే మిగిలిపోయినవి. దీనికి విపరీతముగ శ్రవ్య ప్రబంధములు దృశ్య ప్రబంధములుగా రాణించుచున్నవని చెప్పినచో నతిశ యోక్తి కాజాలదు. అనగా కాళిదాస నాటకములు ప్రదర్శింపబడుటలేదు. చదివి ఆనందింపబడుచున్నవి. కావ్యములు చదువబడుటయేగాక ప్రయోగింపబడు చున్నవిగూడ. ఈయదృష్టమొక్క కాళిదాసునకే దక్కినది. కారణము స్పష్టము. భవభూతి నాటకములనే వ్రాసెను. కావ్యములను వ్రాయలేదు. ఆ నాటకములు కూడ ప్రయోగింపబడకపోయినచో పోవుగాక అసలు ప్రయోగించుటకు రంగ స్థలానుకూలములేగావను అపవాదు వాటికున్నదిగదా! భాసుఁడుకూడ కావ్యము లను వ్రాయలేదు. వ్రాసిన నాటకములు కాళిదాసుకే స్ఫూర్తిని ప్రసాదించినవి. అవి ప్రయోగ యోగ్యములగుటయేగాదు పరిమాణమున ఏకాంకికలవంటి చిన్నవై ప్రయోగ సౌలభ్యముకలిగి కాళిదాసు నాటకములకంటె ఎక్కువగా ప్రయోగింప బడుచున్నవనియూ చెప్పవచ్చును. భారవి మాఘ హర్షాదులు కావ్యములనే వ్రాసిరిగాని నాటకముల జోలికిపోలేదు. ఈ కావ్యములుకూడ నారికేళపాకముతో కూడి, కళాత్మకత కొఱవడియున్నవనుట స్పష్టము. శ్రీహర్షుడు కావ్యములను వ్రాయలేదు నాటకములనే వ్రాసెను. అవన్నియు ప్రయోగ యోగ్యములేగాని దాదాపు ప్రయోగింపబడుటలేదు. కాగా కావ్యములను, నాటకములను రెండింటిని వ్రాసి రెండిటియందును కళాపరాగమును కూరిపెట్టిన మహనీయుఁడు కాళిదాసు. ఇట్లు కత్తికి రెండువైపులా పదునుగలిగియున్న వ్యక్తి ఈతడొక్కడే.

డా॥రాఘవన్‌గారు 1972 నవంబరులో ఉజ్జయినిలో జరిగిన కాళిదాస నాట్యసమారోహ సందర్భమున కాళిదాస నాటక ప్రశస్తిని గూర్చి వర్ణించుచూ ప్రసంగవశమున చెప్పిన ఈ వాక్యములను పరిశీలింపుడు :

"The Drama is not a series of moving Pictures; nor is it a pure poem. Hence in the definition of Drama, Sanskrit Drama turgy lays Equal emphasis on Drsya and sravya".

"The Hindu"
Sunday, Decembae, 1972

ఈ వాక్యములు కాళిదాస నాటకములకు కావ్యములకు సమానముగ అనువర్తించును. ఇదిట్లనుశీలనము చేసికొనవలయును- కాళిదాస నాటకములు కావ్యములుకూడ. అట్లే కావ్యములు నాటకములుకూడ. కావుననే ఈతని నాటకత్రయ కావ్యత్రయములు రెండువిధములా సమానముగా రాణించుచున్నవి. ఈ పద్ధతియి వి రచింపబడిన నాటినుండియు అమలులో నున్నదనుటకు సందియము లేదు.

## కుమార సంభవము

శ్రీమతి రుక్మిణీ అరండేలు కుమార సంభవమును సంగీత నృత్యరూపకముగా ప్రదర్శింపుచుండెడివారు. వీరు కథాకళి సంప్రదాయము ననుసరించి నృత్తరూపకముగా కూడ ప్రదర్శించుచుందురు. కొన్ని దశాబ్దములుగా వీరు చేయుచున్న కృషి మిక్కిలి అభినందనీయము.

ఉజ్జయినిలో కాళిదాస నాటకోత్సవములు ప్రారంభించినప్పటినుండి ఆతని నాటకములకేగాక కావ్యములకుగూడ గిరాకీ పెరిగినది. యావద్భారతమునుండి అనేక బృందములవారు ప్రతి సంవత్సరము అక్కడికిచేరి నాటకములను కావ్యములనుకూడ ప్రదర్శించుచున్నారు.

భరత కళాప్రపూర్ణ, పేరణి తాండవ నృత్యకళా ప్రవర్తక, శ్రీ నటరాజ రామకృష్ణగారు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ తరపున 1968 అక్టోబరులో ఉజ్జయినీ కాళిదాస నాట్య సమారోహ గృహమున "కుమార సంభవమ్" నృత్య నాటకమును ప్రదర్శించి ప్రథమ బహుమతిగా సువర్ణ కలశమును గెలుచుకొనివచ్చిరి. ఆ సందర్భమున అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావు గారు శ్రీ నటరాజును అభినందించుచూ సన్మానముకూడ చేసిరి.

1972 నవంబరులో మద్రాసునుండి కుమారి కనకాబృందము ఉజ్జయినికి పోయి "కుమార సంభవమును" నృత్య నాటకముగా ప్రదర్శించి బంగారు కలశమును ప్రథమ బహుమతిగా గెలుచుకొనిరి.

1959 ఏప్రిల్ నెలలో బొంబాయిలోని ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసైటీ స్కూలునందు ఉపాధ్యాయులుగా పనిచేయుచుండిన శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మ గారు (ఇప్పుడు వీరు పూనాలో మహారాష్ట్ర ప్రభుత్వమునందు తెలుఁగు లాంగ్వేజ్ ఆఫీసరుగా పనిచేయుచున్నారు) అక్కడ చదువుకొనుచున్న ఆంధ్ర బాలికలచేత "కుమార సంభవమ్"సంగీత నృత్యరూపకమును ప్రదర్శింపఁజేసిరి. పార్వతీ-కపట బ్రహ్మచారుల సంవాదము చాల చక్కగా చూపింపబడినది. ఈ కార్యక్రమము ఆంధ్ర మహాసభ ఆవరణలో ఉన్నతోద్యోగులూ సంపన్న గృహస్థులూనైన అనేకాంధ్ర కుటుంబముల వారి సమక్షమున ప్రదర్శింపబడినది. హైస్కూలు వార్షికోత్సవ సందర్భమున ఇంకనూ అనేక సాంస్కృతిక కార్యక్రమములు యేర్పాటు చేయబడినప్పటికిని ఆనాడదియే ప్రధాన కార్యక్రమమని చెప్పవచ్చును. ఆనాడందు పాత్రధారణచేసి తమ నాట్యకౌశల్యముచేత సామాజికుల నుఱ్ఱూతలూగించిన ఆ తెలుఁగు బాలికల పేర్లు ప్రకటింపవలెనను ఉబలాట మున్ననూ ఇప్పుడు గృహిణులై సంసారమును చక్కబెట్టుకొనుచున్న ఆ తల్లుల కభ్యంతరముండునేమోయను నౌచిత్యమును పాటించి విరమించుచున్నాను. (ఈ రచయిత అప్పుడా స్కూలులో ఉపాధ్యాయుడుగా పనిచేయుచుండెను.)

## మేఘసందేశ రఘువంశములు

కాళిదాస నాటకత్రయములో అభిజ్ఞాన శాకుంతలము, కావ్యత్రయములో మేఘసందేశము లోక ప్రసిద్ధిచెందినట్టివి. మేఘసందేశము పరిమాణమున చిన్నది. మందార మకరందములను చిందించుచూ సంగీతానుకూలములైన మందాక్రాంత వృత్తములతో మొత్తము కావ్యము వ్రాయబడినది. ఉజ్జయినియందు ప్రతి సంవత్సరము తప్పకుండ ప్రదర్శింపబడు వానిలో నిది యొకటి.

1972 లో కలకత్తానుండి "ప్రాచ్యవాణి" అను బృందమువారు దీని నక్కడ ప్రదర్శించి ప్రాజ్ఞలోకపు ప్రశంసల నందుకొనిరి.

రఘువంశముకూడ ఆయా సమాజములవారిచే లోగడ ఉజ్జయినియందు ప్రదర్శింపబడినది. ఇందలి కౌత్స వృత్తాంతము, ఇందుమతీ స్వయంవర ఘట్టములు మిక్కిలి ప్రదర్శన యోగ్యములై ఆకర్షణీయముగ నుండును.

## మాలవికాగ్ని మిత్రము

ఇది కాళిదాస నాటకములలో కొంత భిన్నప్రకృతిగల నాటకము. సంగీత నృత్యరూపకముగ ప్రదర్శించుటకు వీలైన నాటకమిది. శ్రీమతి రుక్మిణీ అరండేలు ఈ నృత్తరూపకమును భరతనాట్యశాస్త్ర సంప్రదాయానుసారముగ ప్రదర్శించుచుందురు. ఉజ్జయినిలో పలు సమాజములవారిచేత ప్రదర్శింపబడినది.

సంస్కృత పాఠశాలలయందు తదితర చిన్న చిన్న నాట్యవేదికలయందు ఈ కావ్యములు చిన్న చిన్న ఘట్టములుగా నిరంతరము ఆయాచోట్ల ప్రదర్శింపబడుచునే యున్నవి. చంద్రునకొక నూలుపోగువలె ఆయా మహానుభావులు యథాశక్తి చేయు నిట్టి కార్యక్రమములన్నియు సంస్కృత భాషా నాట్య కళామతల్లి-యారాధనకై సమర్పించు పూజా పుష్పములే యగుట వారందరూ ధన్యజీవులు.

## గీతగోవిందము

భారతీయ భాషలలో వెలువడిన శ్రీకృష్ణగాథాత్మకములగు సంగీత నృత్యరూపకములన్నింటిపై దక్షిణభారతమున అష్టపదులుగా ప్రసిద్ధిచెందిన గీతగోవిందముయొక్క ముద్ర విపరీతముగా నున్నది. తెలుఁగులో వెలసిన శ్రీనారాయణ తీర్థులవారి శ్రీకృష్ణలీలాతరంగిణిగాని, సిద్ధేంద్రులవారి భామాకలాపము గాని గీతగోవిందము నాధారముగా చేసుకొని వెలువడినవే. వాఙ్మయ మహాధ్యక్ష శ్రీ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్యగారు శ్రీ మందాళ జగన్నాధరావుగారిచే సంపాదింపబడి సంగీతము సమకూర్చబడిన "శ్రీ గీతగోవిందము గీతశంకరము" అను గ్రంథమునకు తొలి పలుకు వ్రాయుచూ యక్షగాన కావ్యములు సంస్కృత భాషలో క్రి. శ. 11 వ శతాబ్ది నాటికే వెలసినవనియు తెలుఁగులోని యక్షగానములకు సంస్కృత యక్షగాన వాఙ్మయమే మూలమై యుండుననియు జయదేవ

కృతమగు గీతగోవిందము యక్షగానమే అని గ్రహింపవలని యున్నదనియు తెల్పిన వాక్యములివ్వట్టిన అనుసంధించుకొనదగియున్నవి. వంగదేశమున జరుగు శ్రీకృష్ణోత్సవముల నాధారముగాజేసుకొని వ్రాయబడిన యీ గేయ కావ్యము దేశమునందన్ని ప్రాంతములలోనూ జరుగు శ్రీకృష్ణోత్సవములందు గానము చేయబడుచుండుట మనమెఱిగిన విషయమే.

## శ్రీకృష్ణ లీలోత్సవములలో గీతగోవిందము

శ్రీ విజయరామ గజపతీంద్రులు ప్రతి సంవత్సరము విజయనగరమున కృష్ణలీలోత్సవములను జరిపించుచుండెడివారు. ఈ విషయముకూడ విజయనగర వాస్తవ్యులైన వయోవృద్ధులవలననేగాక శ్రీ నిడదవోలువారు ఉదహరించిన మండ కామేశ్వరకవి కృతమగు కూర్మపురాణములోని యీ క్రింది పద్యమువలన తెలియుచున్నది. (చూ. వి. ఆం. పో. పుట. 5)

అనువర్షంబును కృష్ణలీల జనులాశ్చర్యంబునుంబొందగా
ఘనభక్తిం దనరింపుచుండెనదియే కాలంబునం జేయుచుం
డునటుల్ నిశ్చయమొప్పజేసెనివి రెండుంజూచిమో దింపవ
చ్చునుగాకన్యులుఁ జెప్పగాఁ దరమెతచ్చోద్యంబు చూడన్వలెన్.

రామలీలోత్సవములకున్నంత ప్రసిద్ధి యీ కృష్ణలీలోత్సవములకున్నట్లు కానరాదు. ఎవరివలనగాని దీనిని గూర్చి ఇదమిత్థముగ తెలిసివచ్చుటలేదు. భరత కళా ప్రపూర్ణ, పేరణి తాండవ నృత్యకళా ప్రవర్తక శ్రీ నటరాజ రామకృష్ణ గారు "నాట్యకళ" తూర్పు భాగవత సదస్సు ప్రత్యేక సంచికలో శ్రీకాకుళం విశాఖపట్టణం జిల్లాలలో ప్రచారములోనున్న భాగవత కళనుగూర్చి విపులముగా చర్చించిరి. విజయనగర సంస్థానమున విజయరామ గజపతికి సంబంధించి వారక్కడక్కడ చెప్పిన విషయముల సారాంశమును ఒకచోటచేర్చి సూత్రబద్ధ ముగా పేర్కొనుచున్నాను.

"విజయనగర మహారాజుల కోటలో శ్రీ కోటదుర్గ అను పేరుతో అమ్మ వారి యుత్సవములు జరుపబడుచుండుట అనాదినుండియు వచ్చుచున్న ఆచారము. ఈ సందర్భమున దేవీ సాన్నిధ్యమున యక్షగాన భామాకలాపములు తెల్ల

వారులూ వేషముకట్టి మేళతాళములతో ప్రజారంజకముగ విసిపించుట ఇప్పటికి జరుగుచున్నది. ఆనాడు ఈ యక్షగాన భామాకలాపములందు సత్యభామాది స్త్రీ వేషములను ధరించిన పురుష భాగవత కళానేత్రలలో అక్కా భక్తుడు ముఖ్యుడు. అతడెప్పుడైననూ స్త్రీవేషము కట్టినచో ప్రేక్షకులు నిరుత్సాహపడి "అక్కా భక్తుడు రాడాయె మా మక్కువ తీర్చిపోడాయె" అని పాడుకొనుచూ ఇంటి ముఖము పట్టెడివారట. ఈ అక్కా భక్తునకు విజయరామ గజపతి "అతవ" అను గ్రామమున మడిమాన్యములిచ్చి పోషించిరి. ఈ మహారాజుపై జక్కిణీదరువుల సాహిత్యముకూడ ప్రచారములో నున్నది.

విజయనగర పురపాలనురే,
వీణగాన వినోదరే,
విజయశీల శ్రీ పూసపాటికుల
విజయరామ రవితేజ !—ఇత్యాది.

రామకృష్ణగారి యీ కథనమునుబట్టి దేవీ సాన్నిధ్యమున ప్రదర్శింపబడుచూ వచ్చిన ఈ భామాకలాప యక్షగానాదులే శ్రీకృష్ణలీలోత్సవ సంబంధములగు భాగములుగా భావింపవచ్చునేమోయని తోచుచున్నది. లేక విడిగా శ్రీకృష్ణలీలలు జరిపించుచుండిరేమో తెలియదు.

ఈ ఉత్సవములందు రాజావారు గీతగోవిందమును సంగీత నృత్యరూపకముగా ప్రదర్శింపజేసిరని భావించుటకు వీలుకలుగుచున్నది. శ్రీ నటరాజ రామకృష్ణగారు పూరీ జగన్నాథస్వామి యాలయమున స్వామివారి నిత్య కైంకర్య వేళలందు గీతగోవిందము గానరూపముననో నృత్యరూపముననో ప్రదర్శింపబడుట అనాదినుండియూ వచ్చుచున్న ఆచారమని పేర్కొనిరి. ఇక్కడ పూరీ జగన్నాథస్వామితో ఈ సంస్థానాధీశ్వరులకుగల సంబంధమును గూర్చి కొంత చెప్పుకొనవలసి యున్నది. ఈ సంస్థానాధీశ్వరులు పదవికిరాగానే వంశపారంపర్యముగ "శ్రీ మహేంద్రాద్రిచక్ర చూడామణి" మహోదధీశ "కళింగ దేశాధిపతి" మీర్జామన్నె సుల్తాన్-మొదలగు బిరుదులు సంక్రమించుచున్నవి. ఇందు కళింగదేశాధిపతి యనునది మనకిక్కడ ప్రస్తుతాంశము. వీరి నామముల చివర "గజపతి" అని యుండుటయు దీనికి సంబంధించినదే. విజయరామ గజపతికి పూర్వము ఇరవైనాల్గు తరముల చరిత్ర శ్రీ మంద కామేశ్వర కవి కృతమగు

కూర్మ పురాణమునందు లభించుచున్నది. వారిలో రాచిరాజను మహావీరుడొక డుండెను. ఆతడు తత్కాళ దేశాధిపతియగు వీరప్రతాపరుద్ర గజపతిని జయించి ఆతని "గజపతి" బిరుదమును తీసుకొనెను. అంతటితో వీరికి "కళింగ దేశాధిపతి" మొదలగు పై బిరుదములు సంక్రమించుచున్నవి. అది మొదలుకొని ఈ సంస్థానాధీశ్వరులకు కళింగదేశ ప్రజల ఇలవేల్పగు పూరీ జగన్నాధస్వామిపై భక్తి తాత్పర్యములు నెలకొన్నవి. వీరు తఱచుగా పూరీకివెళ్ళి స్వామివారికి కైంకర్యములను చేయించుట పరిపాటియైనది. విజయనగరమునందు దాసన్నపేటలో "జగన్నాధస్వామి'' దేవళమొకటుండుట గమనింపవలసి యున్నది. ఈ గ్రంథమునందలి తొలి వ్యాసమున ఆదిభట్ల నారాయణదాసుగారు విజయనగర వైభవమునుగూర్చి వ్రాసిన పద్యమునుదహరించితిని. అందలి "ఆనందపరవశంబై జగన్నాధ వీక్షణమున నభివృద్ధి గాంచెనెద్ది" అను పాదమునకు రెండర్థములున్నవి. ఆనంద గజపతి పాలనమున పెనుమత్స జగన్నాధరాజుగారి పర్యవేక్షణమున విజయనగరమభివృద్ధి చెందినదని ఒక అర్థము. పూరీ జగన్నాధ స్వామి యొక్కయు, విజయనగరములో వేంచేసియున్న జగన్నాధస్వామి యొక్కయు కరుణాకటాక్ష వీక్షణమున ఆనంద పరవశమై అభివృద్ధి చెందినదని మఱియొక అర్థము. ఈ రెండవ అర్థము స్వామివారికిని, ఈ సంస్థానాధీశ్వరులకునుగల అనుబంధ సంబంధములను స్పష్టపఱచుచున్నది. రాజావారు స్థాపించిన సంస్కృత నాటక సమాజమునకు "జగన్నాధ విలాసినీసభ" అని పేరుపెట్టుటలోగల యంతరార్థము కూడ నిదియే. మఱి దేవభాషా నాటక సంస్థకు తమ స్వామి పేరుపెట్టుట సమంజసమే గదా!

ఇంతచెప్పిన దానికి పిండితార్థమే మన పూరీ జగన్నాధస్వామి దేవాలయములో నిత్య నైమిత్తిక పూజావేళలందు ప్రయోగింపబడుచుండిన గీతగోవిందమును పలుమాఱులు కనులారగాంచిన శ్రీ విజయరామ గజపతీంద్రులు విజయనగరములో జరుగు శ్రీకృష్ణలీలోత్సవములందు దానిని ప్రయోగింపజేసియుండియుండవచ్చుననుట. ఇంతేగాదు జగన్నాధ విలాసినీ సభ ఆధ్వర్యమున కాళిదాసాది మహాకవుల నాటకములతోపాటు గీతగోవిందమును ప్రయోగింపజేసి యుండవచ్చును. ఇట్టివి చేయుటకు పండితుల మార్గదర్శకత్వము రాజావారికి ఉండనే ఉన్నదిగదా?

గీతగోవిందమునకు పక్కికి మక్కి తెలుఁగు అనువాదము లెన్నో వెలువడినవి. కీ॥ శే॥ బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు చేసిన అనువాదమొకటి ప్రశస్తమైనది. వీరు పొన్నూరు భావనారాయణస్వామి వారి సంస్కృత పాఠశాలలో సంస్కృతాంధ్రోపాధ్యాయులుగా పనిచేసిరి. 1946-50 మధ్యకాలమున పొన్నూరులో జరుపబడుచుండిన వారణాసి రామసుబ్బయ్యగారి సంగీతోత్సవములలో ఈ అనువాదము గానముచేయబడుచుండెడిది.

పద్మశ్రీ భానుమతీ రామకృష్ణగారికి అష్టపదులన్న యిష్టమనియు వారు తీయు సినిమాలలో ఏదేని ఒక అష్టపదిని పాడుటకు వీలుగా సన్నివేశములను కల్పింతురనియు ప్రతీతి. వారు పాడిన "సావిరహే" అను అష్టపదియు, శ్రీమతి పి. సుశీల పాడిన "చందన చర్చిత" అను అష్టపదియు విను వారిని ముగ్ధులను చేయుచుండుట మనమెఱిగిన విషయమే.

భరతనాట్యమును నేర్చుకొనువారు కనీసము దశావతార ఘట్టమునైనను నాట్యము చేయుటకో గానముచేయుటకో నేర్చుకొనుట పరిపాటిగదా!

## సంస్కృతములో హరికథలు

హరికథ నాట్యాంగమని చెప్పవచ్చునేమో ఆలోచింపవలసి యున్నది. అట్లైనచో నిది సంగీత నృత్యరూపక విభాగములో చేరును. సంగీత నృత్యములు, చతుర్విధాభినయములు. నాట్యమునకున్నట్లే హరికథకు గూడనున్నందున నిట్లు భావించుట కవకాశమేర్పడుచున్నది. తెలుఁగువారి హరికథలో నృత్యముండుట విశేషము. తక్కిన భాషా ప్రాంత హరికథలకీ పద్ధతిలేదట. తెలుఁగుననిది ప్రవేశపెట్టినవారు శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు. వీరు మన హరికథకు మూలపురుషులు. సంస్కృతమున హరికథ చెప్పిన తొలి మహనీయులు కూడ వీరేయగుట విశేషము.

## ఆదిభట్ల నారాయణదాసు

వీరిది విశాఖపట్టణం జిల్లాలోని విజయనగరము. శ్రీ మదానంద గజపతుల కాలమున సంస్థాన విద్వాంసులుగా విలసిల్లిరి. సంస్కృతాంధ్రములందు మహాపండితులు [illegible]. "హరికథా పితామహ" "మహాకవిగాయక శిరోమణి," "లయబ్రహ్మ" ఇత్యాది బిరుదాంచితులు, సంస్కృత[illegible] [illegible]నేక రచనలుచేసిరి.

సంస్కృత తెలుఁగు గ్రంథములనుండి యనేక శ్లోకములను. పద్యములను సేకరించి "నవరస తరంగిణి" యను గ్రంథముపేర ప్రచురించిరి. ఈ శ్లోకము లెందఱో హరిదాసులకుపకరించుచున్నవి. వీరొకసారి సంస్కృతములో హరికథ చెప్పిరట. వివరములుమాత్ర మిదమిత్థముగ తెలియవచ్చుటలేదు. ఒకసారి మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులవారు శ్రీ పాతూరి మధుసూదనరావుగారు సంస్కృతములో చెప్పిన హరికథను విని ఇట్లనిరట :- "ఆదిభట్ల నారాయణదాసుగారొకసారి సంస్కృతములో హరికథ చెప్పుట నేనెఱుగుదును. వారొక్కమారే చెప్పినట్లు తెలియుచున్నది. ఇప్పుడు మధుసూదనరావుగారు చెప్పిన కథను వింటిని. వీరనేకసారులు సంస్కృతములో కథలు చెప్పినట్లు వినుచున్నాను. చాల సంతోషము" అని. ఈ విషయమును నే నిటీవల శ్రీ పాతూరి మధుసూదనరావుగారిని దర్శించినపుడు చెప్పగా తెలిసికొంటిని. దానినే ఇక్కడ మనవిచేసితిని. కాగా శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు సంస్కృతములోకూడ హరికథలు చెప్పుటకు శ్రీకారముచుట్టిరని చెప్పవచ్చును.

## ప్రయాగ సంగమేశ్వరశాస్త్రి

వీరిది గుంటూరు జిల్లాలోని తెనాలి తాలూకాయందలి ఈమని గ్రామము. వీరు సంస్కృతాంధ్రములందు మహాపండితులు. సంగీత శాస్త్రపారంగతులు. వీరు సంస్కృతమున హరికథలు చెప్పినట్లు కానరాదు కాని యీ రచయిత వీరు చెప్పిన కథ నొకదానిని విని అప్పటికీ ఇప్పటికీ అది సంస్కృత హరికథయో తెలుఁగు హరికథయో తేల్చుకొనజాలని యనుభవమొకటున్నది.

1958 సం॥ లో తెనాలి వేదపాఠశాలలో శ్రీరామనవమి ఉత్సవములు జరుపబడినవి. అప్పుడు శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు "సీతాకల్యాణము" హరికథ చెప్పిరి. శ్లోకము లన్నియు వాల్మీకి రామాయణమునుండి చదివిరి. పాడిన పాటలుకూడ కొన్ని తెలుఁగు కొన్ని సంస్కృతము. ఇక వివరణచేయునపుడు వారుపయోగించిన భాష సంస్కృత భూయిష్టమైన శిష్టవ్యావహారికము. ఇక చెప్పడిది తెలుగు కథయో సంస్కృత కథయో ! ఈ రచయితకు మాత్రమది సంస్కృత కథయను యనుభూతినే యిచ్చుచున్నది.

## పాతూరి మధుసూదనరావు

వీరు గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకాలోని భట్టిప్రోలు వాస్తవ్యులు. సంస్కృతాంధ్రములందు గొప్పపండితులు. "వందిత హరిదాసహంస" బిరు దాంచితులు. వీరు భగవద్గీతను హరికథగా చెప్పుదురు. విని తీరవలసిన కథ యది. వీరెప్పుడు హరికథ చెప్పిననూ ప్రారంభమున పదినిముషములు సంస్కృతమున ప్రసంగించిగాని కథను ఎత్తుకొనరు. ఈ పద్ధతికి శ్రీ జమ్మల మడక మాధవరాయశర్మగారు పెట్టినది పేరు. వారెప్పుడుపన్యాసము చెప్పి ననూ పదనిముషములు సంస్కృతములో తప్పక ప్రసంగింతురు. ఒక్కొక్క ప్పుడు చివరకూడ సంస్కృతములోనే ప్రసంగించి ముగింతురు.

ఇట్టి మహనీయుల తపఃఫలితముగనే ఈ భాష ఎందరు చావగొట్టిననూ చావక నిలిచియున్నది. శ్రీ మధుసూదనరావుగారి కదమతొక ప్రత్యేకత ఉన్నది. సంస్కృతము వచ్చినవారితో సంస్కృతముననే మాట్లాడుదురు. అవతలి వ్యక్తి ఇబ్బందివడుచున్నట్లు పసిగట్టినచో సంస్కృతమును చాలించి తెలుగునకు వత్తురు. వీరనేకమాఱులు సంస్కృతములో కథలు చెప్పిరి :-

1956 ఏప్రిల్ నెలలో శివరాత్రినాడు రాత్రి 7 గంటలనుండి 10 గం॥ వఱకు కాశీ విద్యాపీఠమున విద్యాభూషణ, పద్మభూషణ శ్రీ రాజరాజేశ్వరశాస్త్రి గాడ్‌గారధ్యక్ష పీఠముననుండగా "పార్వతీ పరిణయము" అను హరికథను సంస్కృతములో చెప్పిరి. కథానంతరము శ్రీ రాజేశ్వరశాస్త్రిగారు మాట్లాడుచూ ఆంధ్రదేశమున భక్తులు, ప్రవక్తలు ఎక్కువగా నున్నందున భక్తి చాల ఉన్న దనియు సంస్కృతములో హరికథ చెప్పుట అసాధారణ ప్రజ్ఞయనియు సెల విచ్చిరి.

బ్రహ్మశ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రి గారి జన్మస్థానమైన ద్రాక్షా రామము, కోటిపల్లి దగ్గఱనున్న "తంగేరు" అను గ్రామమున ఒక వివాహ సందర్భమున పార్వతీ పరిణయము సంస్కృత హరికథ చెప్పిరి।

1945 ప్రాంతమున భీమవరం తాలూకా మహదేవపట్నం గ్రామమున ఒక వివాహ సందర్భమున "పార్వతీ పరిణయము" చెప్పిరి.

---

# ఆంధ్రప్రదేశ్‌లో 1874 తరువాత వెలువడిన కొన్ని సంస్కృత రూపకములు

ఈ పుస్తకము ప్రధానముగా గడచిన నూఱేండ్లలోను జరిగిన సంస్కృత నాటక ప్రయోగములను గూర్చి ప్రకటించుట కుద్దేశింపబడినది. అట్లయ్యును ఈ ఒక్క వ్యాసము మాత్రము, ఈ నూఱేండ్లలో వెలువడిన సంస్కృత నాటక రచనలను గూర్చి ముచ్చటించుటకు కేటాయింపబడుచున్నది. ఇది ప్రధాన రచనా ప్రణాళికకు భిన్నముగాదు. ఒక విధముగా దానికి పూరకమేయగును. మన దేశమున ఎల్లప్పుడూ సంస్కృత నాటక రచనలూ, సంస్కృత నాటక ప్రయోగములూ సమాంతర రేఖలపై సాగివచ్చుచునేయున్నవి. సంస్కృతము మృతభాష యను విషప్రచారము ఈ నూఱేండ్లలోనే ఎక్కువగాను గట్టిగా కూడ సాగినది ఐననూ దాని కెదురీది నిలబడిన కొందఱు మహానుభావులు ప్రాచీన నాటకములను ప్రయోగించుచూవచ్చిరి. మఱికొందఱు నూతన నాటకములను రచించుచూవచ్చిరి. ఈ రెండు ప్రయత్నముల సమన్వయమును దిఙ్మాత్రముగ చూపించుటకే ఇది వ్రాయబడుచున్నది.

## కోరాడ రామచంద్రశాస్త్రి

వీరు "మధుకరీ మంజరీయము" అను తొలి తెలుగు నాటకమును రచించి ప్రథమాంధ్ర నాటక కర్తలలో ప్రథములుగా పేర్కొనబడుచున్నారు. 1816 లో తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకా, కేసనకుఱ్ఱు గ్రామమున జన్మించి 1900సం॥ మరణించిరి. తల్లి సుబ్బమాంబ. తండ్రి లక్ష్మణశాస్త్రి. శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రికి శిష్యులు. శ్రీ కోరాడవారు తొలుత బందరు నోబుల్ స్కూలులోనూ, దరిమిలా నోబుల్ కళాశాలలోనూ దాదాపు 40 సం॥ ఉపాధ్యాయులుగా పనిచేసిరి. సుప్రసిద్ధ తెలుగు సాహిత్య విమర్శకులు, "సంధి" "ద్రావిడ భాషలు" మొదలగు భాషా శాస్త్రగ్రంథములను వ్రాసినవారూ నైన శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వీరి పౌత్రులు.

### వీరు వ్రాసిన సంస్కృత రూపకములు నాలుగు :-

(1) శృంగార సుధార్ణవ భాణము, (2) కమనానంద భాణము, (3) రామచంద్ర విజయ వ్యాయోగము, (4) త్రిపురాసుర విజయడిమము. శృంగార సుధార్ణవమును వీరు 1839 లో తమ 23 వ ఏటనే వ్రాసిరని తెలియుచున్నది.

### పరవస్తు వేంకట రంగాచార్యులు.

వీరు విశాఖపట్టణమున క్రీ. శ 1822 లో జన్మించి 1900 సం॥ మరణించిరి. తల్లి మంగతాయమ్మ, తండ్రి శ్రీనివాసాచార్యులు పరవస్తు వేంకట రామానుజస్వామివారు వీరికి పౌత్రులు, కోరాడ రామచంద్రశాస్త్రిగారి తరువాత ప్రథమాంధ్ర నాటక కర్తలలో వీరిది ద్వితీయ స్థానము. వీరికి "మహామహోపాధ్యాయ" అను బిరుదము గలదు.

"మంజుల నైషధము" వీరి సంస్కృత రూపకము, ఇందేడంకములు గలవు, రోజుకొక యంకము చొప్పున ఏడు రోజులలో దీనిని వ్రాసిరట. ఈ రూపకమును వీరు 1877 ప్రాంతమున రచించినట్లు తెలియుచున్నది. శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు దీనిని 1941 లో తెలుగులోనికి అనువదించిరి. శ్రీమాన్ రామానుజస్వామిగారు దీనికి పీఠికను వ్రాసిరి.

### మఱికొందఱు సంస్కృత నాటక కర్తలు, నాటకములు :-

మతుకుమల్లి నృసింహకవి—శ్రీకృష్ణ జలక్రీడా విలాసము.
పద్మనాభశాస్త్రి—త్రిపుర విజయ వ్యాయోగము. లీలాదర్పణము.
రొంపిచెర్ల పార్థసారథి భట్టర్—మదనానంద భాణము.
శాంతి భద్రాద్రి రామశాస్త్రి—ముక్తావళి.
బోధానంద సరస్వతి—బిచ్చుర్యాలోక నాటకము.
వేంకటాచార్యుడు—చాతురీచంద్రిక.
వేంకట కవి—విలాస భూషణము.
కాశీలో స్థిరపడిన ఆంధ్రు డొకరు—మృగాంకలేఖ.

ఈ వివరము లన్నియు డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారి "తెలుగు నాటక వికాసము" నుండి గ్రహింపబడినవి. వారికి కృతజ్ఞతలు.

## పేరి కాశీనాథశాస్త్రి.

ఈతఁడు ఆనందగజపతీంద్రుని కాలమున విజయనగరం మహారాజా సంస్కృత కళాశాలలో వ్యాకరణ సాహిత్యోపాధ్యాయులుగా పని చేయు చుండెడివారు.

"యామినీపూర్ణ తిలక," "పాంచాలికా రక్షణము." అనునవి యీతని సంస్కృత నాటకములు. ఇవి ఆనందగజపతి మహారాజావారి అభ్యర్థనపై వ్రాయబడినవి. ఈతని విషయము శ్రీ నిడదవోలు వారి "విజయనగర సంస్థానము - ఆంధ్రవాఙ్మయ పోషణ" నుండి గ్రహింపబడినది. వారికి ధన్య వాదములు.

## విశ్వనాథ సత్యనారాయణ.

తెలుఁగు సాహిత్యమున వీరు చేపట్టని ప్రక్రియలేదు. వీరు పట్టినది బంగారము ముట్టినది ముత్యముగా మారిపోవును. తెలుఁగులో అనార్కలి, నర్తనశాల వంటి మహానాటకములను వెలయించిరి. "వీరి నర్తనశాల" భాస నాటకమునకు దీటు కాగలదు.

అమృత శర్మిష్ఠము, గుప్త పాశుపతము- ఇప్పటికి వెలువడిన సంస్కృత నాటకములు. మొదటిది ఇరవై యేండ్ల నాడునూ, రెండవది ఐదేండ్ల నాడునూ వ్రాయబడి యిటీవలనే బొంబాయిలో ముద్రింపబడి వెలువడినవి. వీరు "సీతాయణము" అను పేరుతో మరో సంస్కృత నాటకమును వ్రాయుచున్నారని వినికిడి. కాళిదాస నాటకత్రయము, భవభూతి నాటకత్రయము, శ్రీ హర్షదేవుని నాటకత్రయము వలె విశ్వనాథ నాటకత్రయము వెలయుట ముదావహము.

## డా॥ బి. ఆర్. శాస్త్రి

ఆచార్య డా॥ బి.ఆర్. శాస్త్రి (బొమ్మకంటి రామలింగశాస్త్రిగారు) ఉస్మానియా విశ్వవిద్యాలయమున సంస్కృత శాఖాధ్యక్షులుగా పని చేయుచున్నారు. వీరు సంస్కృతములో విషాదాంతములు, సుఖాంతములు, చరిత్రాత్మకములు మొదలగునవి దాదాపు నాల్గు నాటకములను వ్రాసినారు. ఇవిగాక కావ్యములు, లఘుకావ్యములు, గేయములు, గద్యకావ్యములు కూడ చాల వ్రాసినారు. వీరి నాటకములలో చాలా వఱకు అనేక మాఱులు రంగస్థలముపై ప్రయోగింపబడి

నవి. వీరి "విక్రాంత భారతము" అను నాటకమునకు ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వము అవార్డు నిచ్చినది.

వీరి నాటకములలో ఇతి వృత్తములు ప్రఖ్యాతములైననూ ఆధునిక ధోరణులను ప్రవేశపెట్టి క్రొత్త పద్ధతిగా వ్రాసిరి. వీరు ప్రాచీన గురుకుల పద్ధతిలో నొక వైపుననూ, ఆధునిక విశ్వవిద్యాలయములలో నొక వైపుననూ విద్య నభ్యసించి గొప్ప పాండిత్యమును గడించిరి. వీరికి దాదాపు 12 భాషలలో మంచి ప్రవేశమున్నది. వీరి నాటకములలో గొప్ప ఖ్యాతినార్జించిన నాటకము దేవయాని. ఇది ఒక సారి ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రము నుండి ప్రసారము చేయబడినది. "సంస్కృత థియేటరు" బృందము వారిచే రెండుసార్లు హైదరాబాదు నగరమున రంగస్థలముపై ప్రదర్శింపబడినది. వీరి నాటకము లన్నియు భాస నాటకములవలె స్వల్ప వ్యవధిలో ప్రయోగించుటకు వీలుగాను, ఆధునికరంగ పరికరములను సమకూర్చుకొని యాడుటకు అనువుగాను ఉండును. శ్రీ శాస్త్రిగారు ప్రస్తుతము అమెరికాలో ఉన్నారు.

## శ్రీ కోలాచలం యజ్ఞ నారాయణ దీక్షితులు

వీరు గుంటూరు వాస్తవ్యులు. సంస్కృతాంధ్రములందు గొప్ప పండితులు, "వరూధిని" "అనార్కలి" అనునవి వీరి సంస్కృత నాటకములు. వీరు కన్యాశుల్కమును సంస్కృతములోని కనువదించిరి వీరి "వరూధిని" గుంటూరు, తిరుపతి, హైదరాబాదు నగరములందు ప్రదర్శింపబడినది. కన్యాశుల్కము, అనార్కలి ఆకాశవాణి విజయవాడ కేంద్రము నుండి ప్రసారము చేయబడినవి.

## ఓగేటి పరీక్షిత్ శర్మ

వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయమునుండి "భాషా ప్రవీణ" ప్రాచ్య విద్యాపట్టభద్రులు. బొంబాయి యూనివర్సిటీ నుండి సంస్కృతము నందును, లింగ్విస్టిక్స్ నందును యమ్. ఏ లో ఉత్తీర్ణులైరి ప్రస్తుతము పూనాలో మహారాష్ట్ర ప్రభుత్వమునందు తెలుగు లాంగ్వేజ్ ఆఫీసరుగా పని చేయుచున్నారు. ఈ రచయితతో కలిసి ఎన్నో సంస్కృత నాటకములను ప్రయోగించిరి.

"లలిత గీతాలహరి" అనునది వీరి సంస్కృతగేయ సంపుటి. ఇందు ముప్పదిరెండు గేయములున్నవి. వీటి కన్నింటికి వీరు రాగములను, తాళములను సూచించియున్నారు. ఇవన్నియు తొలుత ఆయా సంస్కృత పత్రికలలో ప్రచురింపబడినవి. బొంబాయి ఆకాశవాణి కేంద్రము నుండి ప్రసారము చేయబడినవి. సంస్కృత విశ్వపరిషత్ సభలలోనూ, 1968 లో హైదరాబాద్‌లో జరిగిన అఖిల భారత తెలుగు మహాసభలలోనూ, ఇంకనూ బొంబాయి, పూనా నగరములలోను అనేక వేదికల నుండి వారిచేత స్వయముగానూ తదితరగాయనీ గాయక బృందముల వారిచేతనూ పలుమారులు గానము చేయబడినవి. 1968 ఏప్రిల్‌లో పుస్తక రూపమున ముద్రితము.

"పరీక్షిత్" అను సంస్కృత నాటకమును, "యశోధరా" అను పంద్రెండువందలశ్లోకముల కావ్యమును వ్రాసిరి అవి యింకనూ అముద్రితములు.

## తిరుమల రామచంద్ర

వీరు సుప్రసిద్ధ పత్రికా రచయితలు. సంస్కృతాంధ్రము లందు గొప్ప పండితుడు. మంచి మేధావి. సంస్కృతములో కొన్ని రచనలు చేసిరి. 1932లో "సత్యాగ్రహి విజయః" అను నాల్గు రంగముల సంస్కృత నాటికను రచించిరి. స్వాతంత్ర్య పోరాటమున సత్యాగ్రహమున పాల్గొని విజయమును సాధించిన యువ దేశభక్తుని చర్యలు స్ఫూర్తిదాయకముగా వర్ణింపబడినవి.

## సంస్కృత పత్రికలలో నాటికలు

ఈ వంద సంవత్సరములలో తెలుగు దేశమున రెండే రెండు మాస పత్రికలు వెలువడినవి. ఒకటి :- విజయవాడనుండి "అమృత సందేశః" అను సంస్కృతాంగ్ల మిశ్రితము దీనికి వైద్యరాజ డా॥ దంటు సుబ్బావధాని, జి వి. రెడ్డి అనువారలు సంపాదకులు. రెండు :- చిత్తూరు సంస్కృత భాషా ప్రచారిణీ సభ ఆధ్వర్యమున నడచుచున్న "గైర్వాణీ" అనునది. దీనికి శ్రీమాన్ టి. కె. తిరువేంగళాచార్యులు సంపాదకులు.

ఈ రెండింటియందును అప్పుడప్పుడు కొన్ని చిన్న చిన్న సంస్కృత నాటికలు వెలువడు చుండెడివి.

ఇంకెందరో మహనీయులు అనేక విధములగు గేయములను, నాటకములను, కావ్యములను సంతరించియుందురు. అనుక్తులునూ, అజ్ఞాతులునూ నైన వారందరికీ నమోవాకము లర్పించుచూ విరమించటమైనది.

— —

# గద్వాల సంస్థానములో సంస్కృత నాటక ప్రదర్శనలు

గద్వాల సంస్థానమున జరిగిన సంస్కృత నాటక ప్రయోగములను గూర్చి ఎక్కడనూ రేఖా మాత్రముగ నైననూ లిఖిత పూర్వకముగ లభించుట లేదు. ఆంధ్రప్రాంతమున విజయనగరమునవలె, తెలంగాణమున సంస్కృతాంధ్ర భాషా కళాపోషణకు కేంద్రమై వర్ధిల్లిన ఈ సంస్థానమున సంస్కృత నాటక ప్రయోగములు జరిగియుండక పోవునా యను విచికిత్సతో గద్వాల ప్రాంతమువారేయైన శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారిని కలుసుకొని యీ విషయమై వాకబు చేసితిని. వారు ఎప్పుడో తమ చిన్నతనమున జరిగినట్లు వినియుంటినని చెప్పి శ్రీ గుండేరావు హర్కారే గారిని కలుసుకొన్నచో వివరములు తెలియగలవని సెలవిచ్చిరి. వారి సూచన మేరకు శ్రీ హర్కారే గారిని తొలిసారి దర్శించి 50 సం॥ నాడు అక్కడ ప్రవర్తిల్లిన సంస్కృత నాటక ప్రయోగములను గూర్చి సేకరింపగలిగితిని. అవి వ్రాయుటకు ముందు శ్రీ గుండేరావు హర్కారేగారిని గూర్చి కొంత పరిచయము చేయుట అవసరము.

## శ్రీగుండేరావు హర్కారే

వీరు 13 ఏప్రిల్ 1867 లో హైదరాబాదులో జన్మించిరి. మహారాష్ట్రులు. మధ్వ బ్రాహ్మణులు. విద్యాభ్యాసము పూర్తియైన పిదప న్యాయశాఖలో ఉద్యోగిగా ప్రవేశించిరి. 1918 ప్రాంతమున హైదరాబాద్ సంస్థాన హైకోర్టు చీఫ్ జస్టిస్ మీర్జాయార్ జంగ్‌వద్ద పి. ఏ. గా పని చేసిరి. 1919 లో గద్వాల సంస్థానమునకు ప్రభువైన శ్రీరాజా సీతారామ భూపాల్ బహద్దరు వారికి వ్యతిరేకముగా కర్నూలు ఇలాకా వాడైన కొత్తకోట వెంకటరామారెడ్డి అనువాడు లేవిన విప్లవమును అణచివేయుటకు హైదరాబాద్ ప్రభుత్వము శ్రీ హర్కారే గారిని గద్వాల సంస్థానమునకు డెప్యూటీ కలెక్టరుగను, సెషన్సు జడ్జిగను నియమించి పంపినది. వారు ప్రజల సహకారముతోనూ రాజావారి అండదండల

తోనూ క్రమక్రమముగా పరిస్థితులను అదుపులోనికి తీసుకొని అలజడులను అరి కట్టి ప్రశాంత పరిణామమును గలిగించిరి. తొలుత హర్కారే గారిని ప్రభు త్వము రెండేళ్ళపాటు మాత్రమే అక్కడ నియమించి పంపినది. కాని వారు సాధించిన ఈ ఘనవిజయముతో ప్రజలును, రాజావారునూ వారిని కోరి కోరి తమకడ 30 సంవత్సరములుంచుకొనిరి. ఈ విధముగా గద్వాల సంస్థాన చరి త్రలో శ్రీ హర్కారేగారి జీవిత చరిత్ర పెనవేసుకొనియున్నది.

వీరు సంస్కృతాంధ్రాగ్ల హిందీ మరాఠీ కన్నడ ఉర్దూ భాషలలో గొప్ప పండితులు, సంస్కృతమున ఎన్నో పరీక్షలు ప్రాసైరి. "వాచస్పతి" (నవద్వీప), తర్కశిరోమణి, వ్యాకరణ శిరోమణి (మెద్రాస్), విద్యాభూషణ (బెల్గాం), విద్యా భాస్కర (ఋషీకేశ్) మొదలైనవి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యులు. రాష్ట్రపతి వి వి. గిరి నుండి సంస్కృత భాషా పాండిత్యమునకు అవార్డుపొందిరి.

శ్రీ హర్కారేగారెన్నో రచనలు చేసిరి. ప్రభావతీ ప్రద్యుమ్నమును సంస్కృతములోని కనువదించిరి. వసుచరిత్ర మొదటి నాల్గాశ్వాసములను మరాఠీ భాషలోనికి గద్యరూపమున అనువదించిరి. షేక్స్పియర్ "హేమ్లెట్", "మిడ్సమ్మర్స్‌నైట్" నాటకములను సంస్కృతీకరించిరి. ఖురాన్ మొదటి ఏడు భాగములను గద్య పద్యాత్మకముగ సంస్కృతీకరించిరి. మొదటి భాగము ప్రభుత్వ పత్రిక "ఇస్లామిక్ కల్చర్"లో ప్రకటింపబడినది. గోల్డ్‌స్మిత్ "ట్రావెలర్"అను కవితను సంస్కృతములో వ్రాసిరి. "బాబాతాహెర్" అను పార్సీ పద్యకావ్యమును సంస్కృతము చేసి ప్రచురణకై సాహిత్య అకాడమీకి సమర్పించిరి. పాణిని అష్టాధ్యాయీ సూత్రములను సులభపద్ధతిలో నేర్చుకొను టకు వీలుగ యంత్రము నొక దానిని సిద్ధపఱచిరి. దానిని మన కందుబాటులో నుండునట్లు చేయుటకు ప్రయత్నములు చేయుచున్నారు.

చార్మినార్ ప్రాంతమున, శాలిబండకడ, గౌలిపురా చివర, గాంధీ విగ్ర హము నానుకొనియున్న 18-7-728 నెం॥ కుటీరమున శరతల్పగతుడైన యీ కురువృద్ధుని చూచినంతనే,యెవరికిగాని స్ఫూర్తి కలుగక మానదు. వారిని దర్శించి నేను వచ్చిన పని తెల్పితిని. వారిట్లనిరి. "ఎంతచల్లనిమాట చెప్పితిరి. సంస్కృత భాషా నాటక ప్రయోగములను పునరుద్ధరించుచున్నారన్నమాట. చావుకు సిద్ధ

ముగ నున్న నాకు అమృతము పోసినట్లైనది. వ్రాసుకొనుడు చెప్పెదను", అని. ఆ సమయమున వారి ముఖమున వెల్లివిరిసిన ఆర్ద్రతా పూర్ణమగు నానందము నకు పులకరించిపోతిని. అట్టిది వారి సంస్కృత భాషాభిమానము.

## గద్వాల నిర్మాత సోమనాద్రి

రెండు వందల సంవత్సరములనాడు పెద్ద సోమభూపాలుఁడు అను నామాంతరముగల సోమనాద్రి కృష్ణానదికి మూడుమైళ్ళ దూరమున అరణ్య ప్రాయముగ నున్న తావున ఈ కోటను, నగరమును స్థాపించుటతో దీని చరిత్ర ప్రారంభమగుచున్నది. అంతకుముందు ఈ రాజులు రాజవోలు, కోరపల్లి అను చోట్ల రాజచిహ్నములతో అధికారము నెఱపుచుండెడివారట. సోమనాద్రి గొప్ప తనమును గూర్చి కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు 'హైందవధర్మ వీరులు' గ్రంథమున యిట్లు వ్రాసిరి. "గద్వాల పంచాంగ కర్తలు తమ పంచాంగములలో ఇతర శకములతోపాటు నేటికినీ సోమనాద్రి శకమును గణించుచూ వచ్చు చున్నారు".

## శ్రీ రాజా సీతారామ భూపాల్ బహద్దరు

ఆధునిక కాలమున ఈ సంస్థానమును పాలించిన వారిలో వీరు సుప్ర సిద్ధులు. వీరి కాలముననే సంస్కృతాంధ్ర నాటక ప్రయోగము లిక్కడ ప్రవ ర్తిల్లినవి. ఈయన సంస్కృతాంధ్రాంగ్ల హిందీ ఉర్దూ భాషలపై మంచి అభిమా నముగలవారు. రాజావారు 1926 లో దివంగతులైన పిమ్మట వీరి సతీమణి శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారు రాణియై 1948 వఱకు సంస్థానమును సమర్థతతో పాలించిరి. ఈ భార్యా భర్తల పరిపాలనా కాలమున ఇక్కడ శ్రీయుతులు ఆది పూడి ప్రభాకరామాత్య, కొండాపూరు కృష్ణమాచార్యులు, పుల్లగుమ్మి వెంకటా చార్యులు మొదలగు సంస్కృతాంధ్ర విద్వాంసులు విలసిల్లిరి.

## వేదశాస్త్ర సాహిత్య సభలు

ఈ సంస్థానమున సోమనాద్రి కాలము నుండియు 1948 వఱకు ప్రతి సంవత్సరము అవిచ్ఛిన్నముగ వేదశాస్త్ర సాహిత్య సభలు జరుగుచుండెడివి. కార్తీక మాసమున వేదశాస్త్ర సభలు, మాఘమాసమున సాహిత్య సభలు జరు

గుట పరిపాటి సాహిత్య సభలలో సంస్కృతాంధ్ర ఉర్దూ పండితులు, కవులు పాల్గొనుచుండెడివారు. ఈ సభలలో పాల్గొన్న విద్వాంసు లందరికి రాజావారు సత్కారములు చేయుచుండెడివారు. ఆధునిక కాలమున ఇట్లు సన్మానింపబడిన వారిలో కీ॥ శే॥ తిరుపతి వేంకట కవులు, కొప్పరపు సోదర కవులు, వేంకట పార్వతీశ్వర కవులు, చోకూరి కాశీపతి మొదలగు వారెందరో గలరు.

## తెలుగు నాటకములు

1921 ప్రాంతమున ఇక్కడ తెలుగు నాటకములు ప్రారంభమైనవి. కొత్తకోట వెంకట రామారెడ్డి యొక్క అగడములను అరికట్టిన తరువాత రాజా వారికిని, సంస్థాన ప్రజలకును కొంత ఆనందోత్సాహములు కలిగినవి. అంత టితో రాజావారు ఔదార్యముతో ధర్మకార్యములు చేయుటకు ప్రారంభించిరి. అన్నదానములు చేయించిరి. బీదయింటి పిల్లలకు వివాహములు చేయించిరి. అదే వరుసలో తెలుగు నాటకములను వేయించిరి. బళ్ళారి నుండి ధర్మవరం వారి "సరసవినోదనీ సభ" వారు వచ్చి నాటకములు వేసి పోవుచుండెడివారు (ధర్మ వరం రామకృష్ణమాచార్యులు మాత్రము రాలేదు). కూచిపూడి బృందమువారు భామాకలాపము లాడుచుండెడివారు. ఇది చూసిన తరువాత స్థానికులు కొందఱు చిన్న చిన్న నాటకములను అప్పుడప్పుడు ఆడుచుండెడివారు. ఈ విధముగా సంస్థానమున గతములో అలముకొన్న భీతావహ పరిస్థితి తొలిగి ఆనందమయ మైన కళాత్మక వాతావరణము నెలకొన్నది. ఇందులో శ్రీ హర్కారేగారి కృషి ఎంతయో గలదనుట స్పష్టము. ఇట్లు తెలుగు నాటకములకు దారితీసిన కుతూ హలకర పరిస్థితుల పరిణామ క్రమములోనే గద్వాలలో సంస్కృత నాటకములు ప్రదర్శింపబడినవి.

## సంస్కృత నాటక ప్రయోగములకు ప్రేరణ

ఆదిపూడి ప్రభాకరామాత్య మొదలగు విద్వాంసులు తీరిక వేళలందు శ్రీ హర్కారేగారింటిలో కలుసుకొని ఇష్టాగోష్ఠి జరుపుచుండెడివారు. తెలుగు నాటకములు వేయబడుచున్న కాలమున ఆ గోష్ఠిలో నాటకముల ప్రసక్తి గూడ వచ్చుచుండెడిది. ఇట్లుండ ఒకనాడు అక్కడ చేరిన మిత్రుల కోరికపై శ్రీ ప్రభా కరరావుగారు కొన్ని తెలుగు పద్యములను కొన్ని సంస్కృత శ్లోకములన్ను

పాడిరి. వారు పాడిన ఫణితి తెలుగు పద్యములకొకవిధముగను, సంస్కృత శ్లోకముల కొకతీరుగను దేనికది క్రొత్తపద్ధతిగా నుండెను. దానిపై కొంత చర్చ జరిగినది. శ్రీ ప్రభాకరామాత్య ఆ విషయము నిట్లు విశ్లేషణ చేసి చెప్పిరి. "మూడు నాలుగు తెలుగు పద్యములను విన్నప్పుడు శ్రోత యొక్క మనోవృత్తి యెట్టిదిగా నుండునో అట్టిది ఒకటి రెండు సంస్కృత శ్లోకములను విన్నంత మాత్రముననే శ్రోతకు చేకూరును" అని. సంస్కృత కావ్య నాటకాలను ఆధారముగా చేసుకొని ఈ విషయముపై తరువాత ఒకటి రెండు సార్లు గోష్ఠి జరిగినది. ఆ సందర్భమున సంస్కృత నాటకములను ప్రయోగించిన బాగుండునను భావము తొలుత ప్రభాకరరావుగారికి తోచినది రాజావారితో సంప్రదించిన మీదట అందరూ కలిసి సంస్కృత నాటక ప్రయోగమునకు తలపడిరి

## అభిజ్ఞాన శాకుంతల మాలవికాగ్ని మిత్రములు

తొలుత వీరభిజ్ఞాన శాకుంతలమును ప్రయోగించిరి. రక్తి కట్టలేదు. కొన్ని నెలల తరువాత దానినే మరల ఆడిరి కొంచెము మెఱుగుగా నున్నను విజయవంతము కాలేదని చెప్పవచ్చును. తరువాత మాలవికాగ్ని మిత్రమును వేసిరి. ఇదియు అంతగా ఎక్కలేదు. కాళిదాస నాటకములు వేయుట కష్టమనిపించి ఈ రెండింటినీ వదిలివేసిరి

## రత్నావళి నాటిక

దీనిని హర్ష చక్రవర్తి రచించెను. పరిమాణమున చిన్ననాటకము. వీరు దీనిని ప్రయోగించిరి. మొదటి ప్రదర్శనయే బ్రహ్మాండముగ రక్తికట్టినది. దానితో ఉత్సాహము వచ్చి పదే పదే దానినే ప్రయోగింపజొచ్చిరి. ఈ నాటక ప్రభావము అక్కడి వారిపై యెంతయో పడినది. బొంబాయి నిర్ణయసాగర్ ముద్రణాలయమునకును, బనారస్ చౌఖంబా ప్రెస్సునకును రత్నావళి ప్రతులను పంపమని వ్రాయగా వారుపంపిరి. రెండవసారి మఱికొన్ని పంపమని వ్రాయగా చౌఖంబా ప్రెస్సువారు ఉన్నకొద్ది ప్రతులను పంపుచున్నామనియు మఱొకసారి కావలెనన్నచో ప్రస్తుతము పంపజాలమనియు ఉత్తరము వ్రాసిరి. ఈ ఉత్తరము చదువుకొని ఆనాడదొక చమత్కారముగా చెప్పుకొనిరట. సుమారు 60 కాపీలను తెప్పించుకొనిరి. దాదాపు ప్రతివ్యక్తి తనసొంత కాపీ ఉంచుకొనవలయునన్నంత ఉబలాట పడిరి.

## ప్రయోగ ప్రయత్న విధానము

మొదట తాము వేయదలచుకొన్న నాటకమును గూర్చి క్షుణ్ణముగ అవగత మొనర్చుటకుగాను అందు పాల్గొను వారందఱినీ సమావేశపఱచి ఆ నాటక విషయమును పరిచయము చేయుట వీరవలంబించిన మొదటి పద్ధతి. దీని వలన కేవలము తన పాత్ర వఱకే గాక మొత్తము నాటకము యొక్క పరిచయము వారికి కలుగును. దాని వలన నాటకము విజయవంతమగుటకు వీలున్నది. అది పూడి ప్రభాకరరావుగారు పాత్రలను ఎన్నికచేసి వారికి చతుర్విధాభినయములను నేర్పుచుండెడివారు. శ్లోకపఠనమునందు వారు నటులకు ప్రత్యేక శిక్షణ నిచ్చుచుండిరి. వీరిలో కొందరు శ్రీ హర్కారే గారింటికి వచ్చి ఏమైననూ సలహాలను అడిగినచో వారు తమకు తోచినది చెప్పుచుండెడివారు. నాటక ప్రయోగమునకు ముందు ప్రతిరోజు రిహార్సలు జరుగుచుండెడివి. చక్కగా తయారైన తరువాతనే ప్రయోగమునకు పూనుకొనెడివారు.

హర్కారేగారికి యీ నాటక ప్రయోగ విషయమున దేశికత్వము వహింపవలెనను ఉత్సాహమున్నప్పటికినీ తాను కూడ పూర్తిగా దిగినచో అతిపరిచయమేర్పడి అవజ్ఞతకు దారితీయునేమోయను భయముతో తమ ఉద్యోగధర్మము యొక్క మర్యాదను కాపాడుకొనుటకు అంతగా పాల్గొనెడివారు కారట. ఒక దశలో వీరికి తాము కూడ వేషధారణ చేయవలెనన్నంత ఉత్సాహము కలిగినదట.

## రంగస్థలము

తొలుత కోటలోపలనున్న చెన్నకేశవస్వామి దేవాలయ మహాద్వారమునకు ముందర ఉన్న మైదానమునందు కఱ్ఱలతో నాటకశాలను నిర్మించి ప్రదర్శించుచుండెడివారు సంస్కృతాంధ్ర నాటకములకు రెండింటికీ అదియే రంగస్థలము. తరువాత తరువాత కొన్నిసారులు కోటకు మూడు మైళ్ళదూరమున కృష్ణానది యొడ్డున గల రాజావారి బంగళా లోపలి ప్రాంగణమున జరిగెడివి. తెలుఁగు నాటకములకు వచ్చినంత జనము సంస్కృత నాటకములకు కూడ వచ్చెడివారు. రాజావారు సంస్కృతమున స్వయముగా పండితులు కారు గాని పండితుల సాహచర్యము వలన శ్రుతపాండిత్యము చాల అబ్బినది. వారు సపరివారముగా వచ్చి నాటకములను తిలకించెడివారు.

## పాత్రధారులు

ఆదిపూడి ప్రభాకరరావు, గొబ్బూరి నంజన్న, నంకాపూర్ కిషన్‌రావు గారలు ప్రధాన భూమికలను వహించు చుండెడివారు. వీరుగాక కృష్ణప్ప, శ్రీనివాసాచార్య, పూర్ణచంద్రరావు గారలు కూడ పాత్రధారణ చేయుచుండిరి. పూర్ణ చంద్రరావు విదూషక పాత్రలు బాగుగా వేసెడివారు. శ్రీయుతులు గొబ్బూరి సంజన్న, నంకాపూర్ కిషన్‌రావులు చెప్పుకోదగిన సౌందర్యవంతులు. మంచి గాయకులు, నటన తెలిసినవారు. రాజావారికి వీరన్న అభిమానము మెండు. వీరి పాత్రలు రాజావారినే గాక సామాజికుల నందరినీ ఆకట్టుకొనెడివట.

## వనపర్తినుండి గద్వాలకు ప్రేక్షకులు

గద్వాలలో జరుగు సంస్కృత నాటక ప్రదర్శనలకు వనపర్తి నుండి కూడ సంస్కృత భాషాభిమానులైన ప్రేక్షకులు వచ్చుచుండెడివారు. రత్నావళి నాటక ప్రతులను కొన్నింటిని వనపర్తివారు కూడ తీసికొనిపోయిరి. వనపర్తి సంస్థానము గద్వాలకు సమీపముననే గలదు. వనపర్తికి గద్వాలకు మధ్య ఒక స్టేషను ఉన్నది. గద్వాలలో జరుగు కార్యక్రమములకు వనపర్తివారు, వనపర్తిలో జరుగు కార్యక్రమములకు గద్వాలవారు వెళ్ళుట పరిపాటి. పండితులు కూడ అక్కడికి వచ్చినవారు ఇక్కడికి, ఇక్కడకు వచ్చినవారు అక్కడికి వెళ్ళి రాజుల నాశ్రయించుచుండుట మామూలే.

## గద్వాల వీధులలో అపభ్రంశ సంస్కృతోచ్చారణ

క్రితము రాత్రి సంస్కృత నాటకమును చూచిన తరువాత అందలి శ్లోక భాగములు, డైలాగులు ప్రేక్షకులకు కొందఱకు కొన్ని పట్టుబడుచుండెడివి. వాటిని ఆ మఱుసటి రెండు మూడు రోజులలోనూ వారు వీధులలో అపభ్రంశముగ ఉచ్చరించుచుండెడివారు. అది విన్న హర్కారేగారు మహదానందపడి పోయి సంస్కృతము మృతభాషకాదు, కాజాలదు, అను ధైర్యోత్సాహములను తెచ్చుకొనిరి. ఎన్నడో స్మృతి సుప్తములైన ఆ ఘట్టములన్నియు తలచుకొని ఆర్ద్రమనస్కులైన శ్రీ గుండేరావు హర్కారేగారు సంస్కృత భాషా ప్రచారము నేడు నాటకముల ద్వారానే జరుగవలెను ఇది తప్ప మరొక బలమైన మార్గము కానరాదు అని నొక్కిచెప్పి యీ సంస్కృత భాషా నాటక ప్రయోగ పునరుద్ధరణోద్యమమును, ఈ గ్రంథ రచనా ప్రయత్నములను ప్రశంసించిరి.

---

# తెలుఁగునాట చెదురుమదురుగా జరిగిన కొన్ని సంస్కృత నాటక ప్రయోగములు

ఈ వ్యాసమున సంస్కృత పాఠశాలా కళాశాల లందును, సంస్కృత భాషా సభలయందును, సంస్కృత విద్యార్థి సమ్మేళనము లందును జరిగిన, లభ్యమైనట్టి కొన్ని ప్రయోగములను గూర్చి వ్రాయబడుచున్నది. ఆ రోజులలో మధూకరమెత్తికొనుచు, వారములు చేసికొనుచూ ఒకపూట తిని తినక కాల క్షేపము చేయుచూ ఆ దేవ భాష నభ్యసించిన దేవతా మూర్తుల వంటి విద్యార్థు లెందరో ఇందున్నారు. కొందఱు ధనవంతుల బిడ్డలుకూడ ఉన్నారు. వీరందరూ ఆ భాష నభ్యసించుచున్న రోజులలో పొందిన ఆనందమే వారిని ఈ చిన్న చిన్న సంస్కృత నాట్యప్రయోగములకు పురికొల్పినది. సంస్కృతము మృతము కాకుండ నిలబెట్టిన మహానుభావులు వీరందరు అని చెప్పినచో అతిశ యోక్తిలేదు.

## పొన్నూరు

గుంటూరుజిల్లాలోని పొన్నూరు పురమున వేంచేసియున్న శ్రీ భావనారా యణ స్వామివారి సంస్కృత పాఠశాలలో 1946 మార్చి నెలలో జరిగిన పాఠ శాలా వార్షికోత్సవ సందర్భమున భాసుని "దూతవాక్యము" అను సంస్కృత నాటిక ప్రయోగింపబడినది. దీనికి ప్రేరకులు పాఠశాలా ప్రధానా చార్యులునూ ఈ రచయిత యొక్క గురుదేవులునూనైన బ్రహ్మశ్రీ చల్లాసత్యనారాయణశాస్త్రి గారు. వీరు "భారతీ నిరుక్తి" ప్రణేతలలో నొకరు. వారి సూచనమేఱకు దీనికి నిర్వహణము నెఱపినవారు అప్పటికీ యిప్పటికీ ఆ పాఠశాలలోనే (ఇది 1950 లో కళాశాలగా మాఱినది) వ్యాకరణ సాహిత్యోపాధ్యాయులుగా పని చేయు చున్నవారునూ ఈ రచయిత యొక్క గురు పరంపరలోని వారునూ నైన శ్రీమాన్ పరాశరం వేంకటకృష్ణమాచార్యులుగారు. ఇందు కృష్ణుడుగా శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మయు, దుర్యోధనుఁడుగా ఓగేటి అచ్యుతరామశాస్త్రియు నటించిరి.

ప్రదర్శనకు అవిభక్త మద్రాసు రాష్ట్ర ప్రాచ్యకళాశాలా పాఠశాలల విద్యాశాఖాధికారి శ్రీ బాలసుబ్రమణ్యంగారు ప్రధానాతిథిగా విచ్చేసిరి.

1947 మార్చి, ఏప్రిల్ నెలలో మఱల వార్షికోత్సవ సందర్భమున వేణీసంహారములోని అశ్వత్థామాంకము ప్రదర్శింపబడినది. ఇందు పాత్రగ్రాహులు :— అశ్వత్థామ- శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మ, కర్ణుఁడు-ఓగేటి అచ్యుతరామశాస్త్రి, దుర్యోధనుఁడు- శ్రీ చావలి సత్యనారాయణ, కృపాచార్యుఁడు-శ్రీ ఉపద్రష్ట వెంకటరామయ్య, అశ్వసేనుఁడు-కీర్తిశేషుఁలు శ్రీ జలసూత్రం సీతారామశాస్త్రి, పర్యవేక్షణ- శ్రీ చల్లా సత్యనారాయణశాస్త్రిగారు, నిర్వహణ-శ్రీమాన్ పరాశరం వేంకట కృష్ణమాచార్యులుగారు. వీరికి సహాయకులు శ్రీ మల్లాప్రెగడ రంగారావుగారు. (వీరక్కడనే సాహిత్యోపాధ్యాయులుగా నుండిరి) ఈ ప్రదర్శనకు ప్రధానాతిథిగా విచ్చేసినవారు మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులవారు.

## తెనాలి

1950 మార్చి నెలలో తెనాలి సంస్కృత కళాశాలా ప్రిన్సిపాల్ గారైన గురువర్యులు శ్రీ కావూరి సుబ్బరామయ్యగారి ప్రోత్సాహముతో కళాశాల వార్షికోత్సవ సందర్భమున వేణీసంహారము ప్రదర్శింపబడినది. అందు శ్రీయుతులు తిగుళ్ళ వెంకటేశ్వరశర్మ అశ్వత్థామగనూ, ఓగేటి అచ్యుతరామశాస్త్రి దుర్యోధనుడుగనూ, వంగల రామకృష్ణశాస్త్రి కర్ణుడుగనూ, అఘోరపతిశాస్త్రి కృపాచార్యుడుగనూ, తమ్మవరపు సుబ్బారావు అశ్వసేనుడుగనూనటించిరి. ఈప్రదర్శనమునకు నటకావతంస శ్రీ స్థానం నరసింహారావుగారు ప్రధానాతిథిగా విచ్చేసిరి.

ఇదే నాటకము మరోసారి ప్రదర్శింపబడినది .అప్పుడు శ్రీ చావలి సత్యనారాయణ దుర్యోధనుఁడుగనూ, అచ్యుతరామశాస్త్రి అశ్వత్థామగనూ, తిగుళ్ళ వెంకటేశ్వరశర్మ కృపాచార్యుడుగనూ నటించిరి. వంగల రామకృష్ణశాస్త్రి, తమ్మవరపు సుబ్బారావు తమ పూర్వపు పాత్రలను యథాతథముగా స్వీకరించిరి.

## నరసరావుపేట

1950 ఏప్రిల్ నెలలో ఆంధ్రరాష్ట్రప్రాచ్య విద్యార్థి పరిషత్ మహాసభలు గుంటూరు జిల్లాలోని నరసరావుపేటలో మహావైభవముగా జరిగినవి. ఆంధ్ర

ప్రాంతములోని ప్రాచ్యకళాశాలల నుండియు, పాఠశాలల నుండియు అనేకమంది విద్యార్థులు ప్రతినిధులుగా పాల్గొనిరి. శ్రీ కావూరి సుబ్బరామయ్య, శ్రీమతి బత్తుల కామాక్షమ్మ, శ్రీ జమ్మలమడక మాధవరాయశర్మ మొదలగు మహావిద్వాంసు లెందరో హాజరైరి. కోట కెదురుగానున్న శ్రీ సీతారామస్వామి ఆలయమున మహాసభలు నిర్వహింపబడినవి. ఆలయప్రాంగణములోని కల్యాణ మంటపమే వేదికగా అమర్చబడినది.

ఈ సందర్భమున పట్టపగలు 11 గంటలకు అభిజ్ఞాన శాకుంతలము ప్రదర్శింపబడినది. చతుర్థ పంచమాంకములు మాత్రమే ప్రయోగింపబడిన ఈ నాటకమునందీ క్రిందివారు పాత్రగ్రాహులు :- దుష్యంతుఁడు—శ్రీమాన్ దివి శ్రీమన్నారాయణాచార్యులు, కణ్వుఁడు-శ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ, శార్ఙ్గరవుఁడు-శ్రీ ఓగేటి అచ్యుత రామశాస్త్రి, శారద్వతుఁడు- శ్రీ ఓగేటి పరీక్షిత్ శర్మ. శకుంతల-శ్రీ దోర్బల విశ్వనాథశర్మ. తాపసి—శ్రీ భవానందము మొదలగువారు.

ఈ నాటక ప్రదర్శనకు ప్రధానాతిథులుఁగా విచ్చేసినవారు అప్పుడు నరసరావుపేటలో అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేయుచున్న శ్రీ మాణిక్యారావుగారు. వీరు వదాన్యులు. సంస్కృత భాషాభిమానము గలవారు. ఈ మహాసభల నిర్వహణమును తమ భుజస్కంధములపై నిడుకొని విజయవంతముగా నెఱవేర్చినవారు శ్రీమాన్ వేదాంతం రామకృష్ణమాచార్యుల వారు. వీరు మొదటి నుండియు సంస్కృత భాషా ప్రచారము చేయుటయందు దీక్ష వహించినవారు. ప్రాచ్య విద్యార్థుల సంక్షేమమునకు కృషి చేసినవారిలో ముఖ్యులు. ప్రస్తుతము నరసరావుపేటలో నొక ప్రాచ్య కళాశాలను స్థాపించి దానికి ప్రిన్సిపాల్‌గా పని చేయుచున్నారు.

## కొవ్వూరు

పశ్చిమగోదావరి జిల్లాలోని యీ గ్రామమునందలి ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము యొక్క వార్షికోత్సవ సందర్భమున 1950 లో కళాశాలా ప్రాంగణమున అభిజ్ఞాన శాకుంతలము ప్రదర్శింపబడినది. కళాశాలా ప్రిన్సిపాల్ శ్రీ కేశిరాజు వెంకటనృసింహ అప్పారావుగారు విద్యార్థులను ప్రోత్సహించి దీనిని ప్రయోగింపజేసిరి. అప్పారావుగారు శాకుంతలము నాంధ్రీకరించిన వారిలో

నొకరు. ఈ నాటక నిర్వహణము నందుత్సాహముగ కృషి చేసిన వారిలో అప్పుడక్కడ చదువుకొనుచున్న డా॥ అమరేశం రాజేశ్వరశర్మ గారొకరు. ఇందు పాత్రధారులు :- దుష్యంతుఁడు-శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మ, శకుంతల-శ్రీ మైనేని సత్యం. తక్కిన వారి వివరములంద లేదు.

## పాలకుర్తి

ఈ గ్రామము వరంగల్‌జిల్లా జనగామ తాలూకాలో నున్నది. ఇది హరిహరక్షేత్రము. శ్రీ సోమేశ్వర లక్ష్మీనృసింహస్వాములు స్వయంభువులై వెలసియున్నారు. ఈ క్షేత్రవాసులునూ నృసింహస్వామివారి యర్చకులునూనైన బ్రహ్మశ్రీ మహాత్మా పాలకుర్తి వేంకట నారాయణ అయ్యంగారు శ్రీసోమేశ్వర లక్ష్మీనృసింహస్వామి వేద పాఠశాలను నెలకొల్పి ముప్వురు ఉపాధ్యాయులకు, 50 మంది విద్యార్థులకు భోజనాది సౌకర్యములను కలిగించుచూ సుమారిరువది సంవత్సరములు కొనసాగించిరి.

1950 లో జరిగిన ఈ పాఠశాలా వార్షికోత్సవ సందర్భమున విద్యార్థులచే వేణీసంహారము ప్రదర్శింపబడినది. అక్కడి న్యాయాలంకార శాస్త్రాధ్యాపకులైన శ్రీ బి. నరసింహాశర్మగారు దీనికి దేశికత్వము వహించిరి. ఇందు పాల్గొన్నవారు:- శ్రీయుతులు పాలకుర్తి సోమేశ్వరశర్మ; జూనూతుల సీతారామశర్మ, కె. వేంకటాచార్యులు, పి. వెంకటేశ్వరశర్మ, మదూరి నరసింహాశర్మ, ఖాన్కర వర్ఝుల చంటియ్యశర్మ, ఎ. నరసింహాచార్యులు, యన్. నరసింహాచార్యులు మొదలగువారు. ఈ వివరములను లిఖిత పూర్వకముగా అందజేసిన శ్రీ బి. నరసింహాశర్మగారు వీరిలో ఎవరేపాత్రను ధరించిరో వివరింపరైరి. ఇదే నాటకము గ్రామవాసుల కోరికపై మఱల 1951 లో ప్రదర్శింపబడినది.

## కైకలూరు

ఇది కృష్ణాజిల్లాలో నున్న నొక తాలూకా కేంద్రము. ఇక్కడ 1952 సం॥ ప్రాంతమున నొక సంస్కృత పాఠశాల ఉండెడిది. ఆరోజులలో ఆంధ్ర రాష్ట్ర ప్రాచ్య విద్యార్థి పరిషత్తునకు ప్రధాన కార్యదర్శిగా పని చేసిన ఈ రచయిత పరిషత్ కార్యకలాపములను పరిశీలించుటకు ఆంధ్ర ప్రాంతము నందలి అనేక ప్రాచ్య కళాశాలలను సందర్శించుట జరిగినది. అప్పుడీ పాఠశాలను

చూచుటకు కైకలూరు కూడ వెళ్ళుట సంభవించినది. ఆరోజేలనో ఆ పాఠ శాలకు సెలవు ప్రకటింపబడినది. అక్కడ చదువుకొనుచున్న వకీర్‌రావు, పరిమి రామ కృష్ణశాస్త్రి అను ఇర్వురు పరిషత్కార్య కర్తలుగా నుండిరి. వారిరువురూ కలిసి ఊరిలోనికి పోయి సుమారు 25 మంది విద్యార్థులను వెంటబెట్టుకొని పాఠ శాలకు తీసికొనివచ్చి సభను ఏర్పాటు చేసిరి. పరిషత్ కార్యకలాపముల సమీక్షా నంతరము ఉత్సాహవంతులైన విద్యార్థులు రెండు మూడు సాంస్కృతిక కార్య క్రమములను నిర్వహించిరి. పరిమి రామ కృష్ణశాస్త్రికి నాట్యమువచ్చును. వారొక అష్టపదిని చదివి నాట్యము చేసిరి. ఎవరో ఒక విద్యార్థి శాకుంతలము లోని కణ్వపాత్రను అభినయించెను. ఆ అభినయముగాని ఆశ్లోక పఠనముగాని యిప్పటికినీ లీలగా కన్నుల యెదుట తారాడుచున్నట్లున్నవి. ఈ కార్యక్రమ ములు సాయంత్రం 5 గం॥ ప్రాంతమున జరిగినవి. అనుకోకుండ జరిగిన ఈ సాంస్కృతిక కార్యక్రమములందెట్టి వేషధారణయు జరుగలేదు. మామూలు దుస్తులతోనే అభినయించిరి. ఇది మరపురాని మహాసంఘటన.

## గుంటూరు

కర్నూలు రాజధానిగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రము వచ్చిన తరువాత గుంటూ రులో 1954లో ఆంధ్ర హైకోర్టు ఏర్పడినది. దానికి ప్రారంభోత్సవము చేయు సందర్భమున అనేకమంది కేంద్ర రాష్ట్ర నాయకులు విచ్చేసిరి. అట్లు వచ్చిన వారిలో డా॥ కైలాసనాథ్‌కట్జూ, అనంతశయన మయ్యంగార్ మొదలగు సంస్కృత భాషాభిమానులు, విద్వాంసులు ఎందరో ఉండిరి. ఈ సందర్భము నుపయోగించుకొను తలంపుతో చిత్తూరు సంస్కృత భాషా ప్రచారిణీ సభ గుంటూరు శాఖా వార్షికోత్సవములు ఏకాదండయ్య పంతులు హాలులో ఏర్పాటు చేయబడినవి. ఇవి నిర్వహించినవారు కీర్తిశేషులు శ్రీ నేతి సుబ్బారావుగారు. ఈ సందర్భమున సాయం సమయమున తెనాలి శ్రీ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి బృందము వారిచే వేణీసంహారము ప్రదర్శింపబడినది. దీనికి శ్రీ కట్జూ, శ్రీ అయ్యంగార్, మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్య, వఝెపూర్ణ ప్రజ్ఞాచార్య, జమ్మల మడక మాధవరాయ శర్మ, చల్లా సత్యనారాయణశాస్త్రి, రాయప్రోలు లింగన సోమయాజులు మొదలగు విద్వాంసు లెందరో విచ్చేసి నాటకము పూర్తియగు వఱకు ఉండి తిలకించిరి. ఈ బృందమువారి నాట్య ప్రయోగ నైపుణ్యమునకు

మెచ్చుకొని ఈ ప్రచారిణీ సభవారు శ్రీ కట్టూ కరకమలముల ద్వారా వీరికొక కప్పును బహూకరించిరి. అదిప్పటికినీ తెనాలి సంస్కృత కళాశాలలో భద్ర పఱచబడియున్నది. ఇందలి పాత్రధారులు :- అశ్వత్థామ-ఓగేటి అచ్యుత రామ శాస్త్రి, కర్ణుడు-వంగల రామకృష్ణశాస్త్రి, దుర్యోధనుఁడు-ప్రతాప వేంకటసుబ్ర మణ్యం, కృపాచార్యుఁడు- కీ॥ శే॥ శ్రీ జలసూత్రం సీతారామశాస్త్రి, అశ్వ సేనుఁడు-శ్రీ తమ్మవరపు సుబ్బారావు, హార్మోనియం-శ్రీ వంగవేటి కామేశ్వ రరావు.

1955 లో గుంటూరులోని దివి రంగాచార్యులవారి రామమోహన ఆయు ర్వేద కళాశాలా వార్షికోత్సవ సందర్భమున వీరిచేతనే వేణీసంహారము ప్రద ర్శింపబడినది. కళాశాల ముంగిలి ప్రాంగణమున వేయబడిన పెద్దపందిరిలో అందముగా అలంకరింపబడిన రంగస్థలముపై అన్నిహంగులతోనూ వేయబడిన యీ నాటకము భలే రక్తి గట్టినది.

గుంటూరు న్యూపట్టాభిపుర వాస్తవ్యులు శ్రీ కె. ఎ. వి. వై. దీక్షితులు గారు మనుచరిత్ర నాధారముగా చేసుకొని "వరూధిని" అను సంస్కృత నాటక మును వ్రాసి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి అంకితమిచ్చిరి. 1963 లో ఏకాదండయ్య పంతులు హాలులో జరిగిన యీ ఆవిష్కరణోత్సవ సందర్భమున శ్రీ గోపాలరెడ్డిగారి సమక్షమున ఈ నాటకము ప్రదర్శింపబడినది. శ్రీ కాశీ కృష్ణాచార్యులు, పూర్ణప్రజ్ఞాచార్యులు, జమ్మలమడక మాధవరాయశర్మ, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి ప్రభృతులు ఈ ప్రదర్శనమును తిలకించిరి.

1966 లో గుంటూరు పార్వతీపురమున ఆది శంకరాచార్యుల వారి విగ్రహ ప్రతిష్ఠాపన సందర్భమున శ్రీ శృంగేరి శంకరాచార్యుల వారి సమక్ష మున ఇది రెండవ సారి ప్రదర్శింపబడినది. ఈ రెండు ప్రదర్శనము లందునూ ఈ క్రింది వారు నటించిరి. వరూధిని-శ్రీ బుఱ్ఱా సుబ్రమణ్యశాస్త్రి, ప్రవరుఁడు- శ్రీ జి. యస్. యన్. శాస్త్రి, సిద్ధుఁడు-శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి, చెలికత్తె- శ్రీ యమ్. కోదండరామశాస్త్రి (ఒకసారి యెవరో స్త్రీయే నటించిరట)

గుంటూరు నగరమున సంస్కృత నాటకములను ప్రదర్శించిన ప్రముఖు లలో శ్రీ కూచిభొట్ల చంద్రశేఖర శర్మగారొకరు (వీరి ప్రయోగ వివరములు

సమయమున కందలేదు). ప్రస్తుతము వీరు బందరు నోబుల్ కళాశాలలో కాబోలు లెక్చరరుగా పనిచేయుచున్నారు.

## తిరుపతి

1-4-1964 లో ఇక్కడ జరిగిన సంగీత నాటకోత్సవముల సందర్భ మున శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి యధ్యక్షతన దేవస్థానమువారి ఆడిటోరియ ములో శ్రీ కె. వై. దీక్షితులుగారి "వరూధిని" ప్రదర్శింపబడినది. ప్రొఫెసర్ సాంబమూర్తి, చిత్తూరు సుబ్రమణ్యం పిళ్ళై మొదలగు సహృదయులు దీనికి హాజ రైరి. దేవస్థానమువారు వరూధినిగా నటించిన శ్రీ బుఱ్ఱా సుబ్రమణ్యశాస్త్రికి, ప్రవరుఁడుగా నటించిన శ్రీ జి. యస్. యన్. శాస్త్రికి పతకములను బహూక రించిరి.

చిత్తూరు సంస్కృత భాషా ప్రచారిణీ సభ గతపావు శతాబ్దము పైగా చేయుచున్న సంస్కృత ప్రచారము జగద్విదితము. 1973 లో కాబోలు ఈ సభ యొక్క రజతోత్సవములు జరుపబడినవి. ఆ సందర్భమున తిరుపతిలో కూడ ఇవి జరిగినవి. అప్పుడు తిరుపతి వెంకటేశ్వర ప్రాచ్య కళాశాలకు చెందిన శ్రీ రంగభట్టర్ అను వారు "వేణీసంహారము"లోని కొన్ని భాగములను ప్రదర్శిం చిరి. ఈ ప్రదర్శన చాల రసవత్తరముగ జరిగినదనియు, ప్రాజ్ఞ లోకము యొక్క మన్ననలను బడసినదనియు చూసినవారు చెప్పిరి.

## రేపల్లె

ఈ పుస్తక రచనా సందర్భమున వ్యక్తిగతముగా కలుసుకొన్న మహాను భావులలో మహాకవి శ్రీ నోరి నరసింహశాస్త్రి గారొకరు. వీరు మహానవలా రచ యితే గాదు మంచినాటక కర్తలు గూడ. "సోమనాథవిజయము" అను చారిత్రక నాటకమును, "భాగవతావతరణము" పౌరాణిక పద్యనాటికను వ్రాసిరి. ఇవి పరి మాణమున చిన్నవి. గుణమున కళాఖండములు. వీరి నాటక కళా ప్రియత్వమున కివి నిదర్శనములు. ఈ దృష్టితో సంస్కృత నాట్యరంగమును గూర్చి వీరి నుండి వినవలయునను కుతూహలముతో దర్శించితిని. అనారోగ్య స్థితిలో నుండియు యీ ఉద్యమమును ఆశీర్వదించి అసాధారణ విషయముల ననేకము సెలవిచ్చిరి. పూర్వము రాజాస్థానములలో సంస్కృత నాటకములు పగలే ఆడబడుచుండె

అనున దొకటి. దాని కొకటి రెండు బలమైన ఉపపత్తులను కూడ సూచించి ఆలోచనను రేకెత్తించిరి. అదొక ప్రత్యేక వ్యాసముగా వ్రాయవలసిన విషయము. ఈ సందర్భమున ఇటీవల వారు చూసిన సంస్కృత నాటక మొక దానిని గూర్చి చెప్పిరి. రేపల్లెలో శ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారి యాధీనమున నొక ప్రాచ్య కళాశాల నడచుచున్నది. అందలి విద్యార్థులు వేణీసంహారమును ఒక సంవత్స రము క్రిందట ప్రదర్శించిరి.

## బొబ్బిలి

శ్రీకాకుళంజిల్లాలో ఉన్న చరిత్ర ప్రసిద్ధమైన ఈ పట్టణమున "విజ్ఞాన వివర్ధినీ పరిషత్తు" అను సంస్థ ఒకటున్నది. దీనికి అనుబంధ సంస్థగా "రాఘవాచార్య నాట్యమండలి" ఒకటి పనిచేయుచున్నది. దీని ఆధ్వర్యమున ఆ చుట్టుపట్ల అనేక సంస్కృత నాటకములు ప్రయోగింపబడినవి. వీరు శాకుంతల మున చతుర్థాంకమును, సంస్కృతీకరించిన మయ సభను, ఆడుచుందురు. ముది గొండ లింగమూర్తిగారు రచించిన "వెంకన్న కాపురం" అను నాటికను వీరు సంస్కృతమున అనువదించి అనేక చోట్ల ప్రయోగించి రక్తి గట్టించుచున్నారు. యస్. రామగోపాలశాస్త్రి అనువారు కార్యదర్శిగా నున్న ఈ విజ్ఞాన వివర్ధినీ పరిషత్తు వారి కార్యకలాపములను మిక్కిలి అభినందింపవలసియున్నది.

## నాగార్జునసాగర్

నల్లగొండజిల్లాలో అంతర్భాగముగా నున్న నాగార్జునసాగర్ హిల్‌కాల నీలో 31-5-1974నాడు హైదరాబాద్ "సంస్కృత థియేటరు"వారు వేణీసంహా రమును ప్రదర్శించిరి. రమాసహిత శ్రీ సత్యనారాయణస్వామి వారి దేవాలయ విగ్రహ ప్రతిష్ఠాపన సందర్భమున జరిగిన బ్రహ్మాండమైన ఉత్సవముల సందర్భ మున ఏర్పాటుచేయబడిన ఈ నాటక ప్రదర్శనకు సుమారు వెయ్యిమంది హాజ రైరి. స్వామివారి సన్నిధిలో పావన కృష్ణానదీతీరమున శ్రీయుతులు నారయ్య, వేణుగోపాలాచార్యులు, వెంకటప్పయ్య, దశరథ రామరెడ్డి మొదలగు సంస్కృత భాషా కళాభిమానుల యాధ్వర్యమున వేయబడిన ఈ నాటకము సంస్కృత నాట్య కళామ తల్లికి పట్టిన కర్పూర మంగళ నీరాజనము అనుటలో అతిశ యోక్తి లేదు.

## నెల్లూరు

ఇక్కడి మూలపేటలోని సంస్కృత కళాశాల సుప్రసిద్ధమైనది. కులపతి యనదగిన కీ॥ శే॥ శ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రి గారు దీనికెన్నో సంవత్సరములు ప్రిన్సిపాల్‌గా పనిచేసిరి. ఇక్కడి నుండి తయారైన విద్యార్థు లెందరో మహాపండితులై విలసిల్లుచున్నారు. భారతీనిరుక్తి ప్రణేతలైన శ్రీహరి సోదరులు, తిరుమల రామచంద్ర, ఉపద్రష్ట వెంకటరామయ్య, ఉపద్రష్ట కృష్ణమూర్తి, చావలి కృష్ణమూర్తి, శఠగోపన్ వంటి పండితు లిక్కడ చదువుకొన్నవారే.

ఈ కళాశాలలో 1933 సం॥ మున అభిజ్ఞాన శాకుంతలములోని కొన్ని భాగములు ప్రదర్శింపబడినవి. ఈ ప్రయోగమును వేయించినవారు సుప్రసిద్ధ సినిమా సంగీత దర్శకులైన కీ॥ శే॥ శ్రీ ఘంటసాల బలరామయ్యగారు. వీరు స్వయముగా సంస్కృతమునందు గొప్ప పండితులు. కావున వీరే నటులకు చతుర్విధాభినయమును నేర్పిరి. అసలు ఘంటసాల బలరామయ్యగారి నాట్యకళా జీవితము ఈ నాటకముతోనే ప్రారంభమైనదని విద్వాన్ తిరుమల రామచంద్రగారి యభిప్రాయము. శ్రీ రామచంద్రగారు ఈ నాటకమున "ధీవరుఁడుగా" నటించిరి. తక్కిన పాత్రధారుల పేర్లు వారికి జ్ఞాపకము లేక చెప్పలేక పోయిరి.

## కర్నూలు

ఇక్కడ స్వామి వివేకానంద సంస్కృత పాఠశాలలో 1975 మార్చి 7, 8, 9 తేదీలలో వార్షికోత్సవములు జరిగినవి. అప్పుడు 9-3-75 తేది ఉదయం 8-45 గం॥ భవభూతి జయంతి జరిగినది. డా॥ సి. మార్కండేయశాస్త్రి, M. A. Ph. D. గారు ఉపన్యాసకులు. ఆనాటి సాయంత్రము అనేక కార్యక్రమములతోపాటు 15 నిముషములు సంస్కృత నాటిక కూడ ప్రదర్శింపబడినది.

## ఇతర పట్టణములు

కామారెడ్డి, ధర్మపురి, వేములవాడ, ప్రొద్దుటూరు మొదలగుచోట్ల గల ప్రాచ్య కళాశాలలలో అప్పు డప్పుడు కొన్ని సంస్కృత నాటికా ప్రయోగములు జరిగినట్లు రూఢిగా తెలియుచున్నది. వివరములకు ప్రయత్నింపగా లభ్యపడ లేదు. ఎప్పటికైననూ సేకరించి గ్రంథస్థము కావింపవలసియున్నది.

---

# ఆకాశవాణి సంస్కృత నాటకములు

మద్రాసు, హైదరాబాదు, విజయవాడ రేడియో కేంద్రములనుండి ప్రసార మైన సంస్కృత నాటకములను గూర్చిన భోగట్టాను సేకరించుటకు ప్రయత్నించగా 1950 ప్రాంతమున విజయవాడ కేంద్రమునుండి తొలినాటకము ప్రసారమైనట్లు తెలియవచ్చినది. అంతకు పూర్వము ఒకవేళ ఏ మద్రాసు కేంద్రము నుండియో ప్రసారమై యుండవచ్చుననుకొందమన్నను బొత్తిగా ఆధారములు లభింపకపోవుట వలన యిప్పటికిదియే తొలినాటకమని భావించుట యుక్తమని తోచుచున్నది.

## నాగానందము

ఈ ప్రసారమైన తొలినాటకము నాగానందము. మొదటి మూడంకముల కథ చెప్పి, నాల్గవ అంకము నుండి చివరివఱకు ప్రసారము చేయబడినది. మొత్తము 45 నిముషములు పట్టినది. నాటకమును "ఎడిట్" చేసి తెలుఁగు వ్యాఖ్యానము చెప్పి నిర్వహించినవారు డా॥ పాటిబండ మాధవశర్మ గారు. జీమూత వాహనుఁడుగా కవిసామ్రాట్, కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు, శంఖచూడుఁడుగా సర్వశ్రీ పేరాల భరతశర్మ గారు నటించిరి. ఇంకను సి. హెచ్. ఆంజనేయశాస్త్రి ప్రభృతులు పాల్గొనిరి. శ్రీ మాధవశర్మ గారు ఆ రోజులలో యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాలలో లెక్చరరుగా పని చేయుచుండిరి. వారు కాంట్రాక్టు పద్ధతిపై రేడియోలో నెల కిన్ని కార్యక్రమముల చొప్పున బాలల కార్యక్రమమును నిర్వహించుచుండెడివారు. ఆ సందర్భమున ఈ నాటకమును నిర్వహించు అవకాశము వారికి తటస్థించినది. ఇందు కవిసామ్రాట్టు నటసామ్రాట్టుగా మారి కళా ప్రపూర్ణతను సంతరించు కొనుట చాల విశేషము. విశ్వనాథ వారు చేపట్టని ప్రక్రియేలేదుగదా।

## కుమార సంభవము

నాగానందము ప్రసారమైన కొద్దినెలలకే కుమారసంభవములోని "పార్వతీ తపశ్చర్య" సంగీత రూపకముగా ప్రసారము చేయబడినది. నిర్వహించినవారు

అప్పటి స్టేషన్ డైరెక్టరుగారే. వారికి సంస్కృతము వచ్చునట. ఆ యభిలాషతో ఈ ప్రయోగమునకు పూనుకొనిరట.

## భాస నాటకములు

1953-1960 మధ్యకాలమున ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు విజయవాడ కేంద్రమునందు కార్యక్రమ నిర్వాహణాధికారిగా వ్యవహరించు చుండెడివారు. ఆ సమయమున వారు "ప్రతిమ" "మధ్యమ వ్యాయోగము" మొదలగు భాస నాటకములను చాల వఱకు ప్రసారము చేసిరి. శాకుంతలము, ఉత్తర రామచరితము మొదలగు వానిని కూడ ప్రసారము చేయించిరి. శ్రీ లక్ష్మీ కాంతంగారు స్వతహాగా రంగస్థల నటులు. వేణీసంహారమునందు ధర్మరాజు పాత్రను సమర్ధతతో నటించుచుండెడివారు. కావున నాటక ప్రయోగ ప్రక్రియలో మంచి అనుభవమును గడించిరి. వారు ప్రసారము చేసిన రేడియో నాటకము లన్నియు ఎంతోకళాత్మకముగా నుండినవని తెలిసినవారు చెప్పుటలో ఆశ్చర్యము లేదు. వీరు ఈ రేడియో నాటకములందు కూడ ఒక్కొక్కప్పుడు పాత్ర గ్రహణము చేయుచుండెడివారు. ఆరోజులలో విజయవాడ నుండి ప్రసారమైన నాటకములలో సాధారణముగా శ్రీ పింగళి వారితోపాటు శ్రీయుతులు కేశవపంతుల నరసింహశాస్త్రి, బాలాంత్రపు రజనీకాంతరావు, పాతూరి మధుసూదనరావు, ములుకుట్ల సదాశివశాస్త్రి, శ్రీమతి జె. యస్. శ్యామసుందరి మొదలగువారు పాత్ర గ్రాహులుగా నుండిరి. శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారు పింగళి వారితో కలిసి విజయవాడ స్టేషను నందు పని చేయుచున్న కాలమున తాముగా మాలతీ మాధవ ముద్రారాక్షసములను ప్రసారము చేసిరి.

## శాకుంతల వేణీసంహారాదులు

1954–58 మధ్యకాలమున హైదరాబాద్ స్టేషను నుండి శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారు సంస్కృత నాటకములలోని కొన్ని రసవద్ఘట్టములను తీసుకొని 15 నిముషములకు సరిపడునట్లుగా "ఎడిట్" చేసి, ఆ ఘటము లందలి ప్రధాన కథాంశమునకు అతుకునట్లు అందమైన పేర్లను పెట్టి వాటిని నాటికల రూపమున ప్రసారము చేసిరి. వివరము లివి.

(1) శకుంతలా ప్రస్థానమ్—శకుంతల అత్తవారింటికి ప్రయాణమగుట. ఇది శాకుంతలము నందలి చతుర్థాంకము లోనిది.

(2) ప్రత్యాదేశః—దుష్యంతుఁడు శకుంతలను తిరస్కరించుట. శాకుంతలములోని పంచమాంకము నందలిది.

(3) శస్త్రపరిత్యాగః—అశ్వత్థామ కర్ణునిమీది క్రోధముతో శస్త్రమును పరిత్యజించుట. ఇది వేణీసంహారము నందలి తృతీయాంకము లోనిది.

(4) ప్రవహణ విపర్యయః—బండి తారు మారగుట. ఇది మృచ్ఛకటికము లోనిది.

ఇట్లే మఱికొన్ని గలవు. శ్రీ శాస్త్రిగా రవలంబించిన యీ పద్ధతి మంచి ప్రయోగాత్మకము, వినూత్నమునైన ప్రక్రియ యని చెప్పవచ్చును. రేడియోలో కార్యక్రమములను ప్రసారముచేయుటకు కేటాయింపబడు సమయము పావుగంట, ఇరవై నిముషములు, అర్థగంట ఇట్లు మిక్కిలి పరిమితముగా నుండును. ఆ కొద్ది సమయములో ఒక సంస్కృత నాటకమును ప్రసారము చేసి రక్తి గట్టించవలయునన్న ఇట్టి పద్ధతియే శ్రేష్ఠమని చెప్పవచ్చును.

## మృచ్ఛకటికము

శ్రీ భద్రవ్రత గారు 1970, 71 సం॥ ప్రాంతమున హైదరాబాద్ కేంద్రము నుండి మృచ్ఛకటికము, అభిజ్ఞాన శాకుంతలమును తమ నిర్వాహణము క్రింద ప్రసారము చేసియున్నారు. ఈ రెండును గంట నాటకములు. మృచ్ఛకటికలో డా॥ జి. వి. సుబ్రమణ్యం, ఓగేటి అచ్యుత రామశాస్త్రి, ముట్నూరి రాధాకృష్ణమూర్తి, చల్లా ధర్మప్రసాద్, కుమారి శమంతకమణి, కుమారి నళినీ పరాట్కర్ మొదలగు వారు పాల్గొనిరి. శాకుంతలమునందు డా॥ పాటిబండ మాధవశర్మ, శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, డా॥ జి.వి సుబ్రమణ్యం, ఓగేటి అచ్యుత రామశాస్త్రి, అంబడిపూడి పూర్ణానందశర్మ, ముట్నూరి రాధాకృష్ణమూర్తి, కుమారి శమంతకమణి, శ్రీమతి అనసూయ మొదలగువారు పాల్గొనిరి. ఈ నాటకములను శ్రీ భద్రవ్రతగారే ఎడిట్ చేసిరి. ఇవి గంట నాటకములు గావున గంటకు సరిపోవునట్లు తమ స్వంత పద్ధతిలో ఎడిట్ చేసిరి. అధి

మధ్యావసానములు చెడకుండ మొత్తము నాటకమును సారము వడకట్టినట్లు సంగ్రహపఱచి ప్రసారము చేయుట వీరవలంబించిన పద్ధతి. ఈ రెండు ప్రసారములు చాల రక్తి గట్టినవి. మృచ్ఛకటికము రాత్రి 9 గం॥ తరువాతను, శాకుంతలము మధ్యాహ్నం 3 గం॥ తరువాతను ప్రసారమైనవి. మృచ్ఛకటిక నిర్వహణమును మెచ్చుకొనుచు ఎన్నో ఉత్తరములు వచ్చిపడినవి. వాస్తవమున కదొక కళాఖండమని చెప్పవచ్చును. శాకుంతలమును మధ్యాహ్న సమయమున కాక రాత్రిసమయమున ప్రసారము చేసియుండినచో మఱింత ఆనందముగా నుండెడిదని వ్రాయుచూ ఒక సహృదయుఁడు సంస్కృత నాటకములను ప్రసారము చేయుటకు రాత్రివేళ మిక్కిలి ఉచితముగా నుండునని సలహానిచ్చియున్నాడు. ఇది నిర్మాణాత్మకమైన సూచనయని శ్రీ భద్రవ్రతగారభిప్రాయపడిరి.

## ఆధునిక నాటకములు

విజయవాడ కేంద్రము నుండి గత రెండు మూడు సంవత్సరములలో గుప్తపాశుపతము, వరూధిని, లవంగి, జయదేవ, కన్యాశుల్కము, అనార్కలి మొదలగు సంస్కృత నాటకములు ప్రసారింపబడినవి. ఇవన్నియు ఆధునికులచే స్వతంత్రముగా వ్రాయబడినవో, ఇతర భాషల నుండి అనువదింపబడినవో యగుట విశేషము. గుప్తపాశుపతమున శ్రీయుతులు నాట్యాచార్య మల్లాది సూర్యనారాయణ, కందుకూరి చిరంజీవరావు, శ్రీరంగం గోపాలరత్నం ప్రభృతులును, జయదేవ యందు బాలమురళీకృష్ణ, గోపాలరత్నం ప్రభృతులును, అనార్కలియందు ఏలూరిపాటి అనంతరామయ్య, కోలాచలం యజ్ఞనారాయణ దీక్షితులు, సి. హెచ్. రామమోహన్‌రావు ప్రభృతులును పాల్గొనిరి. ఇందులో ఒకటి రెండు భద్రవ్రతగారి నిర్వహణములో ప్రసారము చేయబడినవని తెలియుచున్నది.

## సంస్కృత థియేటరు

హైదరాబాద్ సంస్కృత థియేటరు బృందమువారు 1972 జూన్ 1975 మార్చి మధ్యకాలమున 5 సంస్కృత నాటకములను ప్రసారము చేసిరి. ఇవన్నియు పావుగంట, ఇరవై నిముషములు, ఇరవైయైదు నిముషములు, నలభైఐదు నిముషములు ఇట్లు ప్రసారము చేయబడినవి. చాలా వఱకివి సంస్కృత థియే

టరు స్థాపకులు, అధ్యక్షులునైన ఓగేటి అచ్యుతరామశాస్త్రి నిర్వహణముననే ప్రయోగింపబడినవి. వివరములకు "సంస్కృత ధియేటరు అవతరణ, ఒక మహోద్యమమునకు నాంది" అను వ్యాసమును చూడగలరు.

## రేడియో ప్రక్రియ

పైన పేర్కొనబడిన విషయములను బట్టి ఒక సంగతి స్పష్టపడుచున్నది. రేడియోలో ఒక నాటకమును ప్రసారము చేయుటకు అవలంబింపవలసిన పద్ధతి, ఎడిట్ చేసుకొనువిధానము, దానికి కేటాయింపబడిన సమయమునుబట్టి ఉండును. ఏదిగాని ప్రయోక్త యొక్క నిర్వహణా నైపుణ్యమును బట్టి రాణించు ననుట ప్రత్యేకించి చెప్పపనిలేదు. రేడియో నాటకములకు తెలుఁగులో వ్యాఖ్యానము చెప్పుట మాత్రము ముఖ్యము. లేనిచో ఆ అర్థమయ్యే కొంచెమైనను అర్థము కాదను నిరుత్సాహముతో శ్రోతలు రేడియోను ఆపివేయుట నిక్కము.

రంగస్థల సంస్కృత నాటక ప్రయోగమునకు, రేడియో సంస్కృత నాటక ప్రసారమునకు భేదము స్పష్టము. మొదటి దానికి ప్రేక్షకులు, రెండవ దానికి శ్రోతలు ముఖ్యము. రంగస్థల నాటకములందు చూచుట, వినుట, రెండును ఉండును. రేడియో నాటకములను వినుట మాత్రమే గలదు. చతుర్విధాభినయములందు ఒకచోట దోషమున్నను రెండవ చోట గుణముండుట వలన ప్రేక్షకులు రంగస్థల నాటకములను చూచి యానందించుటకు అవకాశము గలదు. రేడియోలో వాచికాభినయ మొక్కటే యుండును గాన గుణదోషములు రెండును అక్కడే వ్యక్తమగును. కావున వాచికమునందు మిక్కిలి శ్రద్ధవహింపవలసి యున్నది. శ్రోతలు సంభాషణలను వినుచున్నప్పుడు ఎంతప్రభావితులు కావలె ననగా తాము నాటకమునే చూచుచున్నామను అనుభూతికి లోను గావలెను. ఎంత సంస్కృతము వచ్చినవారైననూ, సంభాషణలను చూచి చెప్పవచ్చును గదా యన్న ధీమాను వదలుకొని దాదాపు కంఠస్థము చేసినట్లుగా అవగత మొనర్చుకొనుట చాల ముఖ్యము. రంగస్థల నాటకములను కొద్దిమంది మాత్రమే చూతురు. రేడియో నాటకములను లక్షల మంది వినుటకు వీలున్నది. వారందరికీ సంస్కృతముపై గౌరవమును, అభిమానమును కలిగింపవలయునన్న 'రేడియో టెక్నిక్' సంబంధమైన మెళకువలు తెలిసియుండుట చాల అవసరము.

## ఆకాశవాణి-సంస్కృత భాషా సేవ

ఆకాశవాణి ద్వారా సంస్కృతమున కెంతో మేలు జరుగుచున్నది. ఇంకనూ ఎంతో జరుగవలసియున్నను ఇప్పటికి దీనిని మెచ్చుకొనకతప్పదు. నాల్గు శీర్షికల క్రింద రేడియోలో సంస్కృత కార్యక్రమములు నిర్వహింపబడు చున్నవి. ఒకటి :- అమర భారతి. ఇందు సాధారణముగా నాటికలు ప్రసార మగుచుండును. ప్రసంగములు కూడ కద్దు. రెండు: అమరవాణి. ఇందు ప్రసంగ ములు వచ్చుచుండును. మూడు : సంస్కృత పరిచయము-ఇందు సంస్కృత కావ్యపాఠములు చెప్పబడుచున్నవి. నాల్గు: వార్తలు. సంస్కృతములో ప్రతిరోజు వార్తలు వచ్చును. ఈ కార్యక్రమముల నన్నిటిని వేలాది ప్రజలు విని యానం దించుటయే గాక సంస్కృత భాషపై యభిమానమును పెంచుకొనుచు అభ్య సించుటకు కూడ ముందుకు వచ్చుచున్నారని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు. ఆకాశవాణిలో సంస్కృత భాష కీమాత్రము స్థానము కల్పించిన కేంద్ర ప్రభు త్వమునకు ధన్యవాదము లర్పింపవలసియున్నది.

——

# భాగ్యనగర సంస్కృత నాట్యకళారంగము

1936 సంవత్సర ప్రాంతమున, సికింద్రాబాద్ మహబూబ్ కళాశాల హైస్కూలులో సంస్కృతాంధ్రోపాధ్యాయులుగా పనిచేయుచుండిన శిరోమణి శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు స్కూలు వార్షికోత్సవ సందర్భమున విద్యార్థులచే భాసుని "మధ్యమ వ్యాయోగమును" ప్రయోగింపజేసిరి. దరిమిలా 1937, 1938 సంవత్సరములలో ఏదో ఒక సంవత్సరమున అభిజ్ఞాన శాకుంతలములోని చతుర్థ పంచమాంకములను ప్రదర్శింపజేసిరి. శాస్త్రిగారి ప్రయోగములను చేయించుటకు వారిని ప్రేరేపించిన విషయ మొకటున్నది. 1935 సం॥ ప్రాంతమున అమెరికాలో శూద్రక మహాకవి రచించిన "మృచ్ఛకటికము" సంస్కృత నాటకము ప్రదర్శింపబడినదను వార్తను వారు "హిందూ" దిన పత్రికలో చదువుట తటస్థించినది. దానితో వారు త్తేజితులై విదేశములలోనే సంస్కృత నాటకములు ప్రయోగింపబడుచుండ మనమిక్కడ ఉపేక్షించుటయా? యను నా వేదనతో వారీనాటక ప్రయోగములకు పూనుకొనిరి. పిమ్మట వీరు 1954–1962 మధ్యకాలమున హైదరాబాదులోని రెడ్డి కాలేజీలో సంస్కృతోపన్యాసకులైనంతట కాలేజీ వార్షికోత్సవములందు "స్వప్నవాసవ దత్తము"ను, "శాకుంతలము"ను, "ప్రతిమా నాటకము"ను విద్యార్థులచేత ప్రయోగింపజేసిరి. ఈ సందర్భమున శ్రీ శాస్త్రిగా రొకసారి కణ్వ పాత్రను నిర్వహించిరి.

## మధ్యమ వ్యాయోగము

1955 సం॥ ప్రాంతమున ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో "మధ్యమ వ్యాయోగము ప్రదర్శింపబడినది. ఎవరో సాంస్కృతిక సంఘమువారు ఆయా భాషలలో నాటక ప్రదర్శనలను ఏర్పాటుచేయుచూ సంస్కృత నాటకమును కూడ ప్రదర్శింపదలచి ఉస్మానియా విశ్వవిద్యాలయములోని సంస్కృత విభాగము వారి నడిగిరి. అప్పుడు సంస్కృత శాఖాధ్యక్షులుగా పని చేయుచుండిన డా॥ ఆర్యేంద్ర శర్మగారి యాధ్వర్యమున నిది ప్రదర్శింపబడినది. పాత్ర గ్రాహుల

పేర్లు :- సూత్రధారుఁడు-డా॥ ఆర్యేంద్ర శర్మ, బ్రాహ్మణుఁడు-శ్రీ ఖండేరావ్ దేశపాండె, పుత్రుడు-శ్రీ ప్రహ్లాదధాతే, భీముఁడు-కీ॥ శే॥ శ్రీ హనుమంతాచారి ఉపాధ్యాయ, ఘటోత్కచుఁడు-డా॥ జి. వి. సుబ్రమణ్యం, హిడింబి-మిసెస్ బర్న్. అప్పటి భారత రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ గారు హైదరాబాద్ వచ్చిన సందర్భమున వారి గౌరవార్థ మీ సాంస్కృతిక కార్యక్రమము లేర్పాటు చేయబడినవి. ఈ నాటకమును మిక్కిలి అసక్తితో తిలకించిన అధ్యక్షులు ప్రయోగ నైపుణ్యము నెంతో మెచ్చుకొనిరి. సామాజికు లధిక సంఖ్యలో పాల్గొనిరి.

## మృచ్ఛకటికము

భాగ్యనగర సంస్కృత నాటక రంగ చరిత్రలో 1957 సం॥ ప్రాంత మున ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో వేయబడిన "మృచ్ఛకటిక" నాటక మొక ప్రముఖ ఘట్టమని తెలిసినవారు చెప్పుదురు. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటైన తరువాత నగరమున వేయబడిన తొలి నాటక మగుట దీనికి చారిత్రక ప్రాధాన్య మున్నది. ఇందు ప్రస్తుతము ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుఁగు శాఖాధ్యక్షులైన ఆచార్య డా॥ బి. రామరాజు గారు చారుదత్తుడుగను, సంస్కృత శాఖాధ్యక్షు లైన ఆచార్య డా॥బి. ఆర్. శాస్త్రిగారు శకారుదుగను, డా॥జి. వి. సుబ్రమణ్యం గారు జూదరులలో నొకరుగను, శ్రీ ఖండేరావ్ దేశపాండే గారు మైత్రేయుఁడు గను, కుమారి సుమతీ దివాన్ అను నామె వసంతసేనగను (వీరు వివాహానంత రము సుమతీ రాజోల్కర్ అయినారు) నటించిరి. మిసెస్ బర్న్ కూడ నటిం చిరి. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖ తరపున ప్రయోగింప బడినది. డా॥ ఆరేంద్రశర్మ పర్యవేక్షకులుగను, శ్రీ ఖండేరావ్‌దేశపాండే నిర్వా హకులుగను నుండిరి. అప్పుదు దక్షిణ భారత హిందీ ప్రచారసభ- ఆంధ్రశాఖ కార్యదర్శిగా నున్న శ్రీ వేమూరి ఆంజనేయశర్మ గారి యింటిలో (సుల్తాన్ బజారులో) మూడు నెలలు రిహార్సల్సు జరిగినవి. నాటక మొక గంటసేపు పట్టినది. ఆంధ్రప్రదేశ్ తొలి గవర్నర్ శ్రీ సి. యమ్. త్రివేది ప్రధానాతిథిగా విచ్చేసిరి.

ఈ నాటకమును చూసినవారు బహుధా మెచ్చుకొనుచున్నారు. ముఖ్య ముగా డా॥బి. రామరాజు గారి ధారుదత్త పాత్రపోషణము, డా॥ బి. ఆర్. శాస్త్రి

గారి శకార పాత్ర నిర్వహణము అద్భుతముగా నున్నవట. డా॥ రామరాజు గారు 1973 జులైలో తెలుఁగు శాఖాధ్యక్షులై, 1974 ఏప్రిల్ నెలలో వరంగల్లు నుండి నివాసమును హైదరాబాద్‌కు మార్చుకొన్నప్పుడు వారి నభినందించుచూ శ్రీ తిరుమల రామచంద్రగారు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో హైదరాబాద్ నోట్ బుక్కు నందొక వ్యాసము వ్రాసిరి. అందులో వారి చారుదత్త పాత్ర పోషణ మును గూర్చి మిక్కిలి ప్రశంసించిరి. మఱి కొందరిట్లు ప్రశంసించిరి : డా॥ అమరేశం రాజేశ్వరశర్మ గారు :- మృచ్ఛకటిక నాటక ప్రయోగము చరిత్రా త్మకమైనది. రామరాజుగారి చారుదత్త పాత్ర పోషణ మద్భుతముగ నున్నది." డా॥ జి. వి. సుబ్రమణ్యం గారు :- నాటకము చాల రక్తిగట్టినది. రామరాజుగారి చారుదత్త పాత్ర పోషణము కళాత్మకముగ నున్నది." శ్రీ ఖండేరావ్ దేశ పాండే గారు :- రామరాజు గారు చాల చక్కగ నటించిరి. అది చూసిన తరు వాత వారిచేత దుష్యంత భూమికను, చెలమచెర్ల రంగాచార్యుల వారిచేత విదూ షక పాత్రను వేయించి శాకుంతలము నాడించవలెనను కుతూహలము కలిగినది. ఆప్రయత్నములు కలిసి రాలేదు." ఇందరిన్ని చెప్పిన తరువాత ఆచార్య రామ రాజు గారి ముఖతః వినవలెనను కుతూహలముతో వారిని కలుసుకొని యడిగి తిని. వారిట్లు చెప్పిరి :- "నాటకము చాల బాగున్నది. అందరూ చక్కగ నటిం చిరి. మంచి ప్రయోగము". డా॥ బి. ఆర్. శాస్త్రిగారు ప్రస్తుతము అమెరికాలో ఉన్నందున వారి యభిప్రాయమును వినుటకు వీలులేకపోయినది.

## స్వప్నవాసవ దత్తము

1960 సం॥ ప్రాంతమున సీతారామ్‌బాగ్ వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాల విద్యార్థులు, కళాశాలా వార్షికోత్సవ సందర్భమున స్వప్నవాసవ దత్తమును ప్రదర్శించిరి. ఇది చాలా రక్తి గట్టినదని శ్రీమాన్ కె. వి. సుందరాచార్యులు. డా॥ వంగీపురం వరదాచార్యులు చెప్పిరి.

## దేశరక్షణ నిధికి వేణీసంహారము

1962 లో చైనా మనపై దాడి చేసినప్పుడు ప్రజలందరూ ఏకమై మన ప్రభుత్వమున కండగా నిలిచి, ఎవరికి తోచినట్లు వారు దేశ రక్షణ నిధికి ధన మున్ను వసూలుచేసి సమర్పించిరి. కళాకారులు సాంస్కృతిక ప్రదర్శనల ద్వారా

ధనమును సేకరించి యిచ్చుట అందఱికిని తెలిసిన విషయమే. ఆ సందర్భమున సంస్కృత నాటక కళాకారులు కూడ ఉడుతా భక్తిగా తమ కర్తవ్యమును నెఱవేర్చిరి. సికింద్రాబాద్ హిందీ హైస్కూలులో 1963 ఏప్రిల్ నెలలో దేశరక్షణ నిధి సేకరణకై అనేక సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేయబడినవి. అందు "వేణీసంహారము" సంస్కృత నాటక భాగములు కూడ ప్రదర్శింపబడినవి. ఆనాడిదియే ప్రముఖ ప్రదర్శనమని కూడ చెప్పవచ్చును. ఇందు నటులుగా శ్రీయుతులు ఓగేటి అచ్యుతరామశాస్త్రి, తిగుళ్ళ వెంకటేశ్వరశర్మ, హెచ్. యల్. నారాయణ, ఇంకొల్లు సత్యనారాయణ ప్రభృతులు పాల్గొనిరి. అప్పుడు దాదాపు 1200 రూపాయలు రక్షణ నిధికి సమర్పింపబడినవి. ఈ సంస్కృత నాటకమును చూసిన సికింద్రాబాద్ నగర ప్రముఖులు కొందఱు ప్రజలలో భావనమైక్యతను పెంపొందించుటకు సంస్కృత భాషా ప్రచారము సరియగు సాధనమనియు, సంస్కృత నాటక ప్రదర్శనల ద్వారా అది మఱింత సాధ్యమనియు, తమ తమ యభిప్రాయములను వెలిబుచ్చిరి. దేశరక్షణ నిధికి సంస్కృత నాటకమును ప్రదర్శింపజేసిన హిందీ విద్యాలయాధికారులను అభినందించిరి.

## వరూధిని

1964 ఆగష్ట్ ప్రాంతమున రవీంద్ర భారతిలో "వ రూ ధి ని" అను సంస్కృత నాటకము ప్రదర్శింపబడినది. గుంటూరు వాస్తవ్యులైన శ్రీ కోలాచలం యజ్ఞనారాయణ దీక్షితులు గారు వ్రాసిన ఈ నాటకమును వారి బృందము వారిచేతనే "ఆంధ్ర ప్రదేశ్ నాట్య సంఘము"వారు వేయించిరి. ఇది శ్రీ యమ్. ఆర్. అప్పారావు గారి యధ్యక్షతన జరిగినది. అప్పటి గవర్నర్ శ్రీ పట్టం తానుపిళ్ళె, నటసామ్రాట్ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు మొదలగు మహామహులెందరో ఈ ప్రదర్శనను తిలకించిరి. ఇందు ప్రవరుఁడుగా శ్రీ జి. యస్. యన్. శాస్త్రి, వరూధినిగా శ్రీ బుఱ్ఱా సుబ్రమణ్యశాస్త్రి, సిద్ధుఁడుగా శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి నటించిరి.

## అభిజ్ఞాన శాకుంతలము

1963 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యమున రవీంద్ర భారతిలో విజయనగరం డి. వై. సంపత్కుమార్ బృందము వారిచేత

అభిజ్ఞాన శాకుంతలము ప్రదర్శింపబడినది. ఈ ప్రదర్శనకు అప్పటి భారత దేశాధ్యక్షులు డా॥ యస్. రాధాకృష్ణన్, ప్రధాన మంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, కామరాజ్‌నాడార్, నిజలింగప్ప, నంబూద్రిపాద్, సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి, మొహియుద్దీన్, నవాబ్ జంగ్ మొదలగు నాయకు లందరూ విచ్చేసి మూడు గంటలసేపు కూర్చొని మొదటి నుండి చివరివఱకూ తిలకించి ఎంతో మెచ్చుకొనిరి. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, ఆంధ్రభూమి, మొదలగు దినపత్రికలును, ప్రజామత, ఆంధ్రప్రభ, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, యువజన, అఖండ భారతి వంటి వార పక్ష పత్రికలునూ, ఎంతో పొగడినవి.

ఆధునిక రంగ పరికరములతోనూ, విద్యుద్దీప కాంతులతోనూ, పెద్ద ఆర్కెష్ట్రాతోనూ, భారీయెత్తున జరిగిన ఈ ప్రయోగమును చూసిన వారి హృదయములలో చెఱగని ముద్ర వేయబడినది.

విజయనగరములో నాట్యాచార్య శ్రీ డి. వై. సంపత్కుమార్ గారు "గీతానృత్య కళామందిర్" అను కళా సంస్థను 1955లో స్థాపించి భరత నాట్యము, కూచిపూడి నృత్యము, జానపద నృత్యము- మొదలగు వివిధ కళా శాఖలలో క్రొత్త క్రొత్త ప్రయోగములను చేయుచూ భారత దేశమంతటా తిరుగుచూ కార్యక్రమముల నిచ్చుచున్నారు. ఈ కార్యకలాపముల కన్నిటికీ "భాషా ప్రవీణ" శ్రీ పేరి నరసింహశాస్త్రి గారు మార్గదర్శకత్వము చేయుచున్నారు.

ఈ బృందమువారు 1961 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారి పక్షమున ఉజ్జయినీలో జరుగు కాళిదాస జయంతి నాటక మహోత్సవములలో పాల్గొని అభిజ్ఞాన శాకుంతలమును ప్రదర్శించి ప్రథమ బహుమతిగా బంగారు కలశమును గెల్చుకొనిరి. ఆ బహుమానము ఖరీదు రూ 5,000/- వేలు. ఇందు శ్రీ సంపత్కుమార్ గారు స్వయముగా జాలరి పాత్రను ధరించి అనమానమగు నృత్యముతో మొత్తము నాటకమునకే శోభను సమకూర్చిరి. ఆ తరువాతనే ఈ బృందమువారు హైదరాబాద్ వచ్చి రవీంద్ర భారతిలో శాకుంతలమును ప్రదర్శించిరి. ఈ బృందమును గూర్చి వ్రాయవలసిన దెంతయో గలదు. శ్రీ విజయరామ విజయానంద గజపతుల చేత ఆరాధింపబడిన

సంస్కృత నాట్యకళామ తల్లికి ఆగడ్డమైననే జన్మించిన శ్రీ డి. వై. సంపత్కుమార్ మణుల మంగళ నీరాజనములను పట్టుట మహద్భాగ్యమని మనవి జేయుచూ విస్తర భీతిచే విరమించటమైనది.

## సురభారతీ సమితి

హైదరాబాదులో సురభారతీ సమితి వారు చేయుచున్న సంస్కృత భాషా ప్రచారము మిక్కిలి గణనీయమైనది. 1970 ఏప్రిల్ నెలలో శ్రీయుతులు ఏ. వి. సుబ్రమణ్యన్, కె. లక్ష్మణశాస్త్రి, డా॥ పి. రామచంద్రుడు, డా॥ వి. జి. లావే మొదలగు మహానుభావులచేత స్థాపింపబడిన ఈ సంస్థ సంస్కృత సాహిత్య గోష్ఠులను, ఉచిత సంస్కృత శిక్షణ తరగతులను నడపుచూ నగరములో చక్కని సంస్కృత భాషా వాతావరణమును, సృష్టించినది. ఇటీవల ఈ సమితి వారు ఆయా బృందముల నాహ్వానించి తమ వేదికపై రెండు మూడు సంస్కృత నాటకములను కూడా ప్రయోగింపజేయుట ముదావహము.

విక్రమోర్వశీయము— "సంస్కృత థియేటర్" నాటక సంస్థ స్థాపకులైన శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి బృందము వారిచే 19 అక్టోబర్, 1970 తేదీనాడు నారాయణగూడా వై. యమ్. సి. ఏ. హాలులో జరిగిన కాళిదాసోత్సవ సందర్భమున ఈ నాటకము వేయింపబడినది.

ఊరుభంగము-సికింద్రాబాద్‌లోని శ్రీ జయేంద్రసరస్వతీ విద్యాలయం విద్యార్థులచే 17-1-1971 నాడు ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో జరిగిన వ్యాసజయంతి సందర్భమున ప్రయోగింపబడినది.

Rama's Banishment- శ్రీజయేంద్రసరస్వతీవిద్యాలయ విద్యార్థుల చేత ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో 9-5-1971 నాడు జరిగిన సమితి వార్షికోత్సవ వాల్మీకి దినోత్సవముల సందర్భమున ప్రయోగింపబడినది.

## భారతీయ సంవిద్

ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖాధ్యక్షులైన ఆచార్య డా॥ బి. ఆర్. శాస్త్రి గారి అధ్వర్యమున 1978 సం॥లో ఈ సంస్థ స్థాపింపబడినది. ఇదొక పరిశోధనా సాంస్కృతిక సంస్థగా తన కార్యకలాపములను

సాగించుచూ ఉన్నతాదర్శములతో సంస్కృత భాషా ప్రచారమును చేయు చున్నది. ఉచిత సంస్కృత శిక్షణ తరగతులను నడుపుట, మేధావంతులైన విద్వాంసులచేత ఉన్నత ప్రమాణములతో కూడిన పరిశోధనా వ్యాసములను పఠింపజేయుట, వివిధ భాషా కవుల సమ్మేళనములు జరుపుట, సంస్కృత నాటకములను ప్రయోగింపజేయుట వంటి కార్యక్రమముల వైవిధ్యము ఈ సంవిద్ కార్యకలాపములందు కానబడుచున్నది.

ఈ సంస్థ ఆధ్వర్యమున సికింద్రాబాద్ కీస్ హైస్కూలు నందు ఓగేటి అచ్యుతరామశాస్త్రి బృందముచే 1974 మార్చి 28 నాడు జరిగిన శ్రీరామనవమి ఉత్సవముల సందర్భమున డా॥ బి. ఆర్. శాస్త్రి గారే రచించిన "దేవయాని" ప్రదర్శింపబడినది.

## శాకుంతలము

46 సం॥ ప్రాంతమున, శిరోమణి శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రి గారు, నారాయణగూడా బాలికా పాఠశాలయందు చదువుకొనుచున్న బాలికల చేత శాకుంతలమునందలి చతుర్థాంకమును వేయించిరి. ప్రస్తుతము హైదరాబాద్ నగర రాజకీయ రంగమున ప్రసిద్ధికెక్కిన శ్రీమతి సరోజినీపుల్లారెడ్డిగారు ఆ నాడు శకుంతలగా నటించిరి అప్పటి హైదరాబాద్ సంస్థానమున న్యాయశాఖా మంత్రిగా పనిచేయుచుండిన శ్రీ రావుబహద్దరు ఆరామముద్ అయ్యంగారు దీనికి విచ్చేసి తిలకించి ప్రశంసించిరి.

ఇంకనూ ఎవరైననూ వేసియుండవచ్చును. వారికిని, పైన పేర్కొన బడిన మహానుభావులకునూ, సంస్కృత భాషా ప్రచార సంస్థలకును అభినంద నలు తెలియజేయుచూ హైదరాబాద్ సంస్కృత కళారంగముయొక్క తరు వాయి భాగమును గూర్చి ఆ పైన తెలిసికొందముగాక.

# "సంస్కృత థియేటరు" అవతరణ, ఒక మహోద్యమమునకు నాంది

దినాంకము 7-4-1970, సాధారణ నామసంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి, మంగళ వారంనాడు, తెలుఁగు ఉగాది పర్వదినమున శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి ఆధ్వర్య మున శ్రీయుతులు పోతరాజు ఆంజనేయశర్మ, ముట్నూరి రాధాకృష్ణమూర్తి, చల్లా ధర్మ ప్రసాద్, చివుకుల రామకృష్ణశర్మ, కె. వి. సుందరాచార్యులు, అంబడిపూడి పూర్ణానందశర్మ స్థాపక సభ్యులుగా పంజగుట్టలోని 8-2-46 నెంబరు గల ఓగేటి అచ్యుతరామశాస్త్రి వసతి గృహమున "సంస్కృత థియే టరు" (The Sanskrit theatre) అను సంస్కృత నాటక సంస్థ స్థాపింప బడినది.

దేశమున తెలుఁగు మొదలగు ప్రాంతీయ భాషా నాటక రంగములు ఎంతో అభివృద్ధి చెందుచున్నవి. ఒక్క సంస్కృత నాటకరంగమే శతాబ్దుల తరబడి యిప్పటికినీ మూలబడియున్నది. దృశ్యములుగా రాణింపవలసిన సంస్కృత మహానాటకము లింకనూ పండితుల చేతిలో శ్రవ్యములుగా మిగిలిపోవుట దుర దృష్టము. వెనుకటి తరముల పండితులు సంస్కృతమును మృతము కానీయ కుండుటకు ఎన్నోపద్ధతుల నవలంబించిరి. పాఠశాలలు పెట్టిరి. పత్రికలు నడి పిరి. కావ్యనాటకాదులను వెలయించిరి. ప్రాచీన గ్రంథములను పునర్ముద్రించిరి. ఇంకెన్నియో చేసిరి. కాని సంస్కృత నాటక ప్రయోగములను బొత్తిగా విస్మ రించిరి. ఆ ఒక్కలోప మిప్పటికినీ యట్లే జరుగుచున్నది. దానిని పూరించుట కికనైననూ సంస్కృత నాటక ప్రయోగములను పునరుద్ధరించుట ముఖ్యము. ఏదో ఒకటి రెండు సారులు అలవోకగా వేయుట వంటిది గాక ఇదొక మహో ద్యమముగా కొనసాగవలెను. సంస్కృత భాషా ప్రచారమునకు సరియగు సాధ నము నాటక ప్రయోగములే. సంస్కృతము వచ్చిన వారిని, రాకపోయిననూ తదభిమానులను, భాషాభిమానమున్ననూ లేకపోయిననూ కళాభి రుచిగల వారిని,

ఇట్టిందరిని ఏకత్రితము చేయగల శక్తి ఒక్క నాటక రంగమునకే ఉన్నది. కావున సంస్కృత నాట్య రంగమును, నిర్మింపజేయుట అవసరమను సంకల్పముతో ఈ నాటక సంస్థ స్థాపింప బడినది.

1874 లో విజయనగరమున స్థాపింపబడిన "జగన్నాధ విలాసినీ సభ" సంస్కృత నాటక సమాజము తరువాతను, 1880 ప్రాంతములో మద్రాసులో వెలసిన "ది మెడ్రాస్ ఓరియంటల్ డ్రమాటిక్ సొసైటీ" తరువాతను, అంతటి ఉత్తాలములైన ఆశయాదర్శములతో ఆవిర్భవించిన మూడవ సంస్థ ఈ "సంస్కృత థియేట"రని చెప్పవచ్చును.

## రంగస్థల నాటకములు.

ఈ థియేటరు వారిప్పటికి తరిఫీదు పొంది ప్రదర్శించుచున్న నాటకములు నాలుగు :– వేణీసంహారము, విక్రమోర్వశీయము, దేవయానీ, ప్రతాపరుద్ర పట్టాభిషేకము– అనునవి. ఈ యైదేండ్లలోనూ వీరీ నాటకముల నన్నింటినీ కలిపి మొత్తము పదిహేను పర్యాయములు రంగస్థలముపై ప్రదర్శించిరి. కొన్ని ముఖ్య సందర్భములందు జరిగిన ప్రయోగములను గూర్చి మాత్రమే యిట నుల్లేఖింపబడుచున్నది.

## వేణీసంహారము

ఈ సంస్థ అవతరించిన తరువాత వీరు ప్రయోగించిన తొలి నాటకమిది. 12 జూలై 1970 నాడు రాత్రి 7 గం॥లకు సికింద్రాబాద్ జీరా క్లబ్బులో "అశ్వత్థామ" అను పేరుతో వీరు దీనిని ప్రదర్శించిరి. జంటనగరములలోని పలువురు పండితులు విచ్చేసిరి. ఆచార్య డా॥ దివాకర్ల వెంకటావధాని గారు (తెలుగు శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము) అధ్యక్షత వహించిరి. ప్రదర్శన మత్యద్భుతముగ నున్నది. ఈ ప్రయోగ విజయమే వీరికి నిరంతరముత్సాహమును ప్రసాదించుచున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరు గారి యాధ్వర్యమున విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టరు గారైన శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారి నిర్వహణలో 21-11-1970 నాడు గన్‌ఫౌండ్రీలోని మహబూబియా గరల్స్ హైస్కూలులో భారీ యెత్తున సంస్కృత మహోత్సవములు జరుపబడినవి.

ఆరోజు రాత్రి 8 గం॥ ఇదే నాటకము ప్రదర్శింపబడినది. ప్రదర్శనకు అప్పటి విద్యాశాఖామాత్యులు శ్రీ పి. వి. నరసింహారావుగారు విచ్చేసిరి.

వీరి నాటకమును జంటనగరములలోనే గాక ఇతర చోట్లకూడ ప్రదర్శించుట విశేషము. 31-5-1974 నాడు నాగార్జునసాగర్, హిల్‌కాలనీలో రమా సహిత సత్యనారాయణస్వామి దేవాలయమున విగ్రహ ప్రతిష్ఠాపనోత్సవ సందర్భమున నిది ప్రదర్శింపబడినది. ఉస్మానియా యూనివర్సిటీ మాజీ వైస్‌ఛాన్సలర్ డా॥ రావాడ సత్యనారాయణ గారధ్యక్షత వహించిరి.

ఈ నాటకము నందిప్పటి వరకు పాల్గొనుచుండిన పాత్ర గ్రాహుల పేర్లు :— దుర్యోధనుఁడు-శ్రీ పోతరాజు ఆంజనేయశర్మ, (ఒకసారి పాత్రను డా॥ జి. వి. సుబ్రమణ్యం గారు ధరించిరి) కర్ణుడు-శ్రీ ముట్నూరి రాధాకృష్ణమూర్తి, అశ్వత్థామ- శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, కృపాచార్యుడు-శ్రీమాన్ కె. వి. సుందరాచార్యులు, (నాగార్జునసాగర్‌లో స్థానికులైన శ్రీ వెంకటప్పయ్య గారిపాత్రను వహించిరి). అశ్వసేనుఁడు- శ్రీ చల్లా ధర్మప్రసాద్ (ఒకసారి కళాస్రవంతి సాహితీ సంస్థ అధ్యక్షులు శ్రీమాన్ యన్. జి. రామానుజాచార్యులు గారిపాత్రను ధరించిరి) ఇప్పటికి వీరినాటకమునే యెక్కువగా ప్రదర్శించిరి. నిర్వహణ- శ్రీయుతులు పోతరాజు ఆంజనేయశర్మ, ముట్నూరి రాధాకృష్ణ మూర్తి గారలు. దర్శకత్వము.—ఓగేటి అచ్యుతరామశాస్త్రి.

## విక్రమోర్వశీయము

19 అక్టోబరు 1970 నాడు సురభారతీ సమితి వారు జరిపిన కాళిదాసోత్సవములందు నారాయణగూడ, వై. యమ్. సి. ఏ హాలులో ఈ థియేటరు వారి నాటకములోని చతుర్థాంకమును మాత్రము ప్రదర్శించిరి. డా॥ పురాణిక్ గారధ్యక్షత వహించిరి. పురూరవుఁడుగా ఓగేటి అచ్యుతరామశాస్త్రి, ఊర్వశిగా శ్రీ చల్లా ధర్మప్రసాద్ నటించిరి.

## దేవయాని

ఇది ఉస్మానియా యూనివర్సిటీ సంస్కృత విభాగం అధ్యక్షులు ఆచార్య, డా॥ బి. ఆర్. శాస్త్రి గారు వ్రాసిన నాటకము. ఇది 12 మార్చి 1978 సోమవారం నాడు సాయంత్రం 7 గం॥ లకు ఉస్మానియా యూనివర్సిటీ ఆవ

రణలోని టాగోర్ ఆడిటోరియము నందు ప్రదర్శింపబడినది. ఉస్మానియా యూనివర్సిటీకి అనుబంధముగా నున్న "సంస్కృత ఎకాడమీ" నూతన భవనములకు ప్రారంభోత్సవము జరిగిన సందర్భమును పురస్కరించుకొని యిది ప్రయోగింపబడినది. యూనివర్సిటీకి చెందిన పలువురధ్యాపకులు దీనిని తిలకించిరి. యూనివర్సిటీకి అప్పుడు వైస్‌ఛాన్సలర్‌గా నున్న శ్రీ యన్. నరోత్తమరెడ్డి గారు ప్రధానాతిధిగా విచ్చేసిరి.

ఇదే నాటకము 28 మార్చి, 1974 నాడు సికింద్రాబాదులోని కీస్ హైస్కూలు నందు శుభశ్రీ గారి ఆధ్వర్యమున నడచు "శ్రీరామనవమి కల్చరల్ ఫెస్టివల్" సమితి వారి యాహ్వానముపై భారతీయ సంవిద్ సంస్థ ఆధ్వర్యమున "సంస్కృత థియేటరు" బృందముచే ప్రదర్శింపబడినది. ఓపెన్ ఏర్ థియేటరులో వెయ్యిమంది తమిళాంధ్ర సామాజికుల సమక్షమున జరిగిన ఈ నాటకము మహారసవత్తరముగా సాగినది. ఈ నాటకము నందిప్పటి వఱకు పాల్గొనుచుండిన నటీనట బృందము-యయాతి-శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, దంతిలుడు-శ్రీ అంబడిపూడి పూర్ణానందశర్మ, శుక్రాచార్యుఁడు-శ్రీ ముట్నూరి రాధాకృష్ణమూర్తి, శాపపురుషుఁడు-శ్రీ పోతరాజు ఆంజనేయశర్మ, దేవయాని-శ్రీమతి మల్లాది విజయలక్ష్మి, శ్రీమతి సుశీల, శర్మిష్ఠ-శ్రీమతి ఆనందినీ రామనాథన్, కుమారి అద్దేపల్లి విజయలక్ష్మి, చతురిక-కుమారి రూబీ, ఇంకనూ శ్రీ కె. వీరభద్రరావు మొదలగు వారెందరో నటించుచున్నారు. నిర్వహణ-శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, దర్శకత్వము ఆచార్య డా॥ బి. ఆర్. శాస్త్రి గారు. వేణీసంహారము తరువాత వీరెక్కువగా ప్రదర్శించిన రెండవ నాటకమిది.

## ప్రతాపరుద్ర పట్టాభిషేకము

1975 ఏప్రిల్ 12 నుండి 18 వఱకు కాకతీయ నగర్ (లాల్‌బహదూర్ స్టేడియం) లో బ్రహ్మాండముగ జరుపబడిన మొట్టమొదటి తెలుగు ప్రపంచ మహాసభలలో రెండవ రోజైన 13 వ తారీకు నాడిది ప్రదర్శింపబడినది. వివరములను దీని తరువాతి ప్రత్యేక వ్యాసములో తెలిసికొనగలరు.

## దుస్తులు-ఆర్కెష్ట్రా

వీరు పాత్రోచితములైన దుస్తులతో వేషధారణ చేయుదురు. రంగ ప్రసాధన మాధునిక పద్ధతులలో నుండును. చతుర్విధాభినయములకు సమ ప్రాధాన్యము

నిత్తురు. శ్లోకపఠనము తెలుఁగు నాటక పద్యపఠన బాణీలలో నుండును. అర్థ భావముల కనుగుణమగు మోతాదులో మాత్రమే సంగీత ముండును. హార్మో నియం, వయొలిన్, క్లారినెట్, తబల మొదలగు సంగీత వాద్యముల నుపయో గింతురు. శ్రీ పెళ్ళూరి కోటేశ్వరరావు గారి సమాజము వారికి సంగీతమును సమకూర్చుచుందురు. శ్రీ కేశవరావు గారు దుస్తులను వేషధారణ సామగ్రిని సమకూర్చుచుందురు.

## రేడియో నాటకములు

ఈ థియేటరు బృందమువారు తమ పేరు మీదుగా ఆకాశవాణి హైదరా బాద్ కేంద్రము నుండి 5 సంస్కృత నాటకములను ప్రసారము చేసి యున్నారు.

1. స్వప్న వాసవదత్తము- 26-6-1972 నాటి రాత్రి 9-45 గం॥లకు ప్రసారమైనది. పాత్రధారుల పేర్లు: ఉదయనుఁడు-డా॥ జి. వి. సుబ్రమణ్యం, యౌగంధ రాయణుఁడు- ఓగేటి అచ్యుతరామశాస్త్రి, విదూషకుఁడు-అంబడిపూడి పూర్ణానందశర్మ, బ్రహ్మచారి-చల్లా ధర్మప్రసాద్, కాంచుకీయులు-ముట్నూరి రాధాకృష్ణమూర్తి, పోతరాజు ఆంజనేయశర్మ, భటుఁడు-చివుకుల రామకృష్ణ శర్మ, వాసవదత్త- శ్రీమతి సుశీల, పద్మావతి-కుమారి అద్దేపల్లి విజయలక్ష్మి, తాపసి-శ్రీమతి ముట్నూరి పావని, ధాత్రి-శ్రీమతి పోతరాజు భవాని, నిర్వ హణ—డా॥ పి. మాధవశర్మ.

2. వేణీసంహారము: 10-6-1973 నాటి ఉదయం 7—30 గం॥ అమర వాణి కార్యక్రమమున "అశ్వత్థామ" పేరుతో ఏకపాత్రాభినయముగ ప్రసా రము చేయబడినది. అభినయించిన వారు ఓగేటి అచ్యుతరామశాస్త్రి.

3. మాలతీ మాధవము: 24-9-1973 నాటి రాత్రి 9-45 గం॥ అమర భారతిలో భవభూతి సంచికా కార్యక్రమములో అంతర్భాగముగా ప్రసారము చేయబడినది. పాత్రగ్రాహులు- మాధవుఁడు- ఓగేటి అచ్యుతరామశాస్త్రి, మక రందుఁడు-ముట్నూరి రాధాకృష్ణమూర్తి, కలహంసకుఁడు-అంబడిపూడి పూర్ణా నందశర్మ, కామందకి-శ్రీమతి ముట్నూరి పావని, మాలతి-శ్రీమతి ఆనందినీ రామనాథన్, లవంగిక-కుమారి అద్దేపల్లి విజయలక్ష్మి, ప్రతీహారి—శ్రీమతిసుశీల, తెలుగు వ్యాఖ్యానము-డా॥ పాటిబండ మాధవశర్మ, నిర్వహణ-శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి.

4. ప్రతాప రుద్ర పట్టాభిషేకము: 26-6-1974 నాటి రాత్రి 9-45 గం॥ అమర భారతిలో విద్యానాథ సంచికా కార్యక్రమము నందొక భాగముగా ప్రసారము చేయబడినది. పాల్గొన్నవారు:- రుద్రదేవ మహారాజు (రాణీరుద్రమదేవి)-శ్రీమతి ముట్నూరి పావని, ప్రతాపరుద్రుడు-చి॥ ఓగేటి కృపాళు, మంత్రి-చల్లా ధర్మప్రసాద్, పురోహితుడు- శ్రీమాన్ నల్లదీపె శ్రీనివాసాచార్యులు, విజయవార్తాహరుడు-ముట్నూరి రాధాకృష్ణమూర్తి, సేనాపతి-పోతరాజు ఆంజనేయశర్మ, తెలుగు వ్యాఖ్యాత-ఓగేటి అచ్యుతరామశాస్త్రి, నిర్వహణ-శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి.

5. రత్నావళి- 31-3-1975 నాటి రాత్రి 9-45 గం॥ శ్రీ హర్షదేవ చక్రవర్తి సంచికా కార్యక్రమ సందర్భమున తదంతర్గతముగ అమర భారతిలో ప్రసారమైనది. పాత్రధారులు :- ఉదయన వత్సరాజు-శ్రీ బి యస్. యన్. శాస్త్రి, విదూషకుడు-శ్రీ అంబటిపూడి పూర్ణానందశర్మ, యౌగంధరాయణుడు-డా॥ వంగీపురం వరదాచారి, ఐంద్రజాలికుడు-ముట్నూరి రాధాకృష్ణమూర్తి, సాగరిక అను నామాంతరము గల రత్నావళి-శ్రీమతి అనందినీ రామనాథన్, వాసవదత్త-శ్రీమతి సతీశుకవాణి, సుసంగత-శ్రీమతి ముట్నూరి పావని, కాంచనమాల-శ్రీమతి శ్రీనివాసమ్మ, రేడియోఅనుసరణ, నిర్వాహణ, తెలుగు వ్యాఖ్యానము-ఓగేటి అచ్యుతరామశాస్త్రి, పర్యవేక్షణ-శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి.

ఇట్లు రంగస్థల నాటకము లందుగాని, రేడియో నాటకము లందుగాని తమ తమ శక్తి సామర్థ్యములను బట్టి లభించిన పాత్రలను తీసుకొని చక్కగా కృషిచేసి పాత్రపోషణము చేయుచున్న సభ్యులీ బృందమునందు సుమారిరువదియైదు మంది గలరు. వీరందరూ కలిసి కట్టుగ పరస్పరము సహకరించుకొనుచూ నిస్వార్థముగ సంస్కృత నాట్య కళామతల్లిని సేవించుచున్నారు. ఇదొక సంస్కృత నాట్య కళాకారుల కుటుంబమన వచ్చును. ఇట్టి యీ సంస్కృత థియేటరు ప్రారంభింపబడిన వేళా విశేష ఫలితముగ అందరి సహాయ సహకారాశీస్సుల బలమును త్రాగుచూ క్రమాభివృద్ధిని చెందుచూవచ్చి చివరికి ప్రభుత్వమువారిచే యాహ్వానింపబడి ప్రపంచ తెలుగు మహాసభలలో ప్రతాప రుద్ర పట్టాభిషేక మను సంస్కృత నాటకమును ప్రయోగింపగలుగుట చరిత్రాత్మక సంఘటన యని చెప్పవచ్చును.

---

# ప్రపంచ తెలుగు మహాసభలలో

## "ప్రతాపరుద్ర పట్టాభిషేకమ్" సంస్కృత నాటకప్రదర్శన

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధ్వర్యమున 1975 ఏప్రిల్ 12 నుండి 18 వరకు కాకతీయనగర్ (లాల్‌బహదూర్ స్టేడియం), హైదరాబాదులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగు సంస్కృతీ చరిత్రలో నూతనాధ్యాయమును సృష్టించినవి. వీటిని దిగ్విజయముగ నిర్వహించిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు (తెలుగు మహాసభల అధ్యక్షులు), విద్యా సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు (మహాసభల కార్యనిర్వాహక అధ్యక్షులు), సాంఘికసంక్షేమ, సాంకేతిక విద్యామంత్రి శ్రీభాట్టం శ్రీరామమూర్తి (మహాసభల సాంస్కృతిక వ్యవహారాల సంఘం అధ్యక్షులు) మొదలగు ప్రజానాయకులను; మహాసభల ప్రధాన కార్యదర్శి డా॥ వి. యస్. ఆర్. అప్పారావు, కార్యదర్శులు శ్రీ యన్. వి. యస్. ప్రసాదరావు, శ్రీ జె. బాపురెడ్డి మొదలగు ప్రభుత్వ ఉన్నతోద్యోగులను, తదితర కార్యకర్తలను మిక్కిలి అభినందించవలసి యున్నది.

ఈ సందర్భమున తెలుగు వారి సర్వతోముఖము, సర్వాంగీణమునైన సంస్కృతిని, చరిత్రను, స్వస్థాన వేష భాషాదికములను సాక్షాత్కరింపజేయు రీతిగ సాంస్కృతిక కార్యక్రమముల నేర్పాటుచేయుటతోబాటు తెలుగు సంస్కృత భాషలకు గల జన్యజనకభావమును, లేక అవినాభావ సంబంధమును గుర్తించి సంస్కృత నాటకము నొక దానిని ప్రదర్శింపజేసి ఆ భాషామతల్లిపై తమకు గల పూజ్యభావమును ప్రకటించిన యీ మహనీయులకు సంస్కృత భాషాభిమానులెల్లరూ ప్రత్యేకించి ధన్యవాదము లర్పించు చున్నారు.

మహాసభల రెండవరోజున, 13-4-1975 ఆదివారం నాటి అర్ధరాత్రి 1-2 గం॥ల మధ్య హైదరాబాద్ "సంస్కృత థియేటరు" బృందం సభ్యులు

"ప్రతాపరుద్ర పట్టాభిషేకమ్" అను సంస్కృత నాటకమును వేలాది తెలుగు మహాజనుల సమక్షమున రసవత్తరముగా ప్రదర్శించిరి.

ఆంధ్రజ్యోతి వంటి ప్రముఖ తెలుగు దినపత్రికలలోనూ, ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రము వారు మహాసభలపై ప్రసారము చేసిన సమీక్షా ప్రసంగములోనూ, నాగార్జున పీఠములో కళల విభాగమునకు సంబంధించి జరిగిన "నాటక ప్రదర్శనలు" అను చర్చాగోష్ఠిలోనూ ఈ సంస్కృత నాటక ప్రయోగమును గూర్చి ప్రశంసింపబడినది. మహాసభలకు విచ్చేసిన ప్రతినిధులు కొందఱు ఈ ప్రదర్శనమును చూసి ముగ్ధులై తమ తమ పట్టణములకు వచ్చి ప్రదర్శింపవలసినదిగా ఈ బృందము వారిని కోరిరన్నచో ఈ నాటకమెంత రక్తిగట్టినదో మఱింత చెప్పనవసరములేదు.

## కవి పరిచయము

ఈ నాటకము యొక్క అసలు పేరు "ప్రతాపరుద్ర కల్యాణము." "సంస్కృత థియేటరు" వారు దీనిని "ప్రతాప రుద్ర పట్టాభిషేకము"గా మార్చుకొని ప్రదర్శించిరి దీనిని "ప్రతాపరుద్రుని యాస్థాన కవి యగు విద్యానాథుఁడు రచించెను. ప్రతాపరుద్రుడు క్రీ॥ శ॥ 13 శతాబ్ది చివరి యందునూ 14 వ శతాబ్ది ప్రారంభము నందునూ ఓరుగల్లు రాజధానిగా కాకతీయ సామ్రాజ్యమును పరిపాలించెను. దీనిని బట్టి విద్యానాథుడీనాటకమును 14 వ శతాబ్ది ప్రారంభమున రచించి యుండవచ్చునని విమర్శకు లూహించుచున్నారు. విద్యానాథుఁడు దీనిని ఒక ప్రత్యేక నాటకముగా వ్రాయలేదు. "ప్రతాపరుద్రయశోభూషణము" అను అలంకారశాస్త్ర గ్రంథమును వ్రాసి అందలి నాటక ప్రకరణమున నాటక లక్షణములను చెప్పి, ఆ లక్షణములను పట్టించుచూ నాటకోదాహరణముగా దీనిని రచించి "ప్రతాపరుద్ర కల్యాణ"మని నామకరణము చేసెను.

## నామ సార్థక్యము

రుద్రమదేవి తరువాత ఆమె దౌహిత్రుడగు ప్రతాపరుద్రుఁడు రాజ్యమునకు వచ్చుట ఈ నాటకమునందలి ప్రధాన కథా వస్తువు. దీని నాలంకారికముగా చెప్పవలెనన్నచో రాజ్యలక్ష్మి ప్రతాపరుద్రుని వరించగా ఆతని కామెతో పాణిగ్రహణము జరుగును. కావున కవి దీనికి "ప్రతాపరుద్ర కల్యాణ"మని నామ

కరణము చేసినాడు. ఈ నాటకమున ప్రతాపరుద్రుఁడు నాయకుడు. రాజ్యలక్ష్మి నాయిక. కాని రంగస్థలముపై నాయకునికి ప్రవేశమున్నది గాని నాయికకు లేదు. ఆలోటును తీర్చుటకు కవి వాచ్యముగా గాని వ్యంగ్యముగా గానీ వీరిరువురి నాయికా నాయక సంబంధమునే గాక వధూవర సంబంధమును గూడ మాటి మాటికీ వ్యక్తము చేసి రాజ్యాభిషేకమును కల్యాణ మహోత్సవముగా చిత్రించుట యిందలి చమత్కారము. ఈ క్రింది శ్లోకమును చూడుడు:

వరః ప్రతాపరుద్రోఽయం వధూరేషా వసుంధరా
తయోర్ఘటయితాదేవః స్వయంభూః సదృశః క్రమః.
(శ్లోకం 19. పంచమాంకము)

(ఈ ప్రతాపరుద్రుడు వరుఁడు. ఈ వసుంధర వధువు. వీరిని కలిపిన వాడు స్వయం భూదేవుఁడు. ఇది తగియున్నది).

ఇప్పుడు ప్రతాపరుద్ర కల్యాణ మనగా ప్రతాపరుద్ర పట్టాభిషేక మనియే తెలుచున్నది. కాగా కల్యాణ శబ్దము వ్యంగ్య వైభవముతో కూడి సహృదయైక వేద్యమగుచున్నది. అట్లుగాక అబాల గోపాలముగ నున్న లక్షలాది ప్రపంచ తెలుఁగు సోదరులకు ఝటితి స్ఫూర్తి కలుగునట్లు పట్టాభిషేక మని పెట్టుట సమంజసమని భావించి "సంస్కృత థియేటరు" బృందము వారట్లు మార్చినారు. ఇట్లు మార్చుటలో వీరి సొంత పైత్య మేమియులేదు. కవియే పంచమాంకము నకు "ప్రతాపరుద్ర రాజ్యాభిషేకోనామ పంచమోంకః" అని పేరు పెట్టినాడు. దానినే "ప్రతాపరుద్ర పట్టాభిషేక" మనినారు వీరు. ఈ పేరు మార్పు శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రిగారికి మిక్కిలి యిష్టమైనది. కాకతీయ సామ్రాజ్య వైభవ స్ఫోరక మగు పట్టాభిషేక శబ్దమే తెలుఁగు హృదయములందు నాటిగా హత్తుకొనగలదని వారి తలంపు, ప్రపంచ తెలుఁగు మహాసభల ప్రసక్తి రాక ముందుకూడ ఈ థియేటరు వారు పట్టాభిషేక మను పేరుతోనే దీనిని ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రము నుండి ప్రసారము చేసియున్నారు.

## అంకముల విభజన - కథాసారాంశము

ఈ నాటకమున ఐదంకములున్నవి. ఒక్కొక్క అంకమునకు ఒక్కొక్క పేరు పెట్టినాడు కవి. ఆ పేరును బట్టి ఆ యంకము నందలి కథాంశము వ్యక్త మగుచున్నది.

## ప్రథమాంకము - కల్యాణ స్వప్నము

కాకతి కులదైవత మగు స్వయంభూ దేవుఁడు రుద్రమదేవికి (ఈమె రుద్రదేవమహారాజుగా వ్యవహరించును) కలలో కన్పించి ప్రతాపరుద్రుని రాజుగా చేయవలసినదిగా ఆదేశించును. ఈ వృత్తాంతమును ఆమె అంతరంగిక సభలో మంత్రి పురోధ సాదులకు చెప్పి ప్రతాపరుద్రుని రాజ్యాభిషేకమునకు ముందు దిగ్విజయ యాత్రా సన్నాహములు చేయించుటకు మంత్రుల నాదేశించును. ఇందు స్వప్న వృత్తాంత క్రమము రమణీయముగ వర్ణింపబడినది.

## ద్వితీయాంకము - విజయ యాత్రా విలాసము

ప్రతాపరుద్రుఁడు రథ గజ తురగ పదాతి సైన్యములను సిద్ధము చేసుకొని దిగ్విజయ యాత్రకు వెడలును. ఇందు చతురంగ బలముల వర్ణన చారు గంభీరముగ చేయబడినది.

## తృతీయాంకము - వీరరుద్ర విజయము

ప్రతాపుఁడు నాల్గు దిక్కులను జయించి రాజులందఱినీ వశీకృతులను చేసికొనును. ఈ వృత్తాంతమును యుద్ధము నుండి వచ్చిన విజయ వార్తాహరుఁడు కొలువుతీర్చి యున్న రుద్రదేవ మహారాజునకు (రాణి రుద్రమదేవికి) వినిపించును.

## చతుర్థాంకము - త్వరిత మహోత్సవము

సుముహూర్త సమయమునకు జరుగవలసిన రాజ్యాభిషేక సన్నాహములకు సంబంధించిన హడావిడి ఇందు చూపింపబడినది. రాజ్యాభిషేక సుముహూర్తమునకు ముందుగా స్వయంభూసమారాధనమును చేయుట కాకతి వంశాచారము. దాని ననుసరించి స్వయంభూ సమారాధనకు పోవుచున్న ప్రతాపరుద్రునితో ఆలస్యము చేయక త్వరగా తిరిగి రమ్మని మంత్రిపురోధ సాదులు హెచ్చరించుట వర్ణితము.

## పంచమాంకము - ప్రతాపరుద్ర రాజ్యాభిషేకము

ఇందు శాస్త్రపద్ధతిని, కాకతి వంశాచార పద్ధతిని అనుసరించి రాజ్యాభిషేకము జరుపబడినది. కనకవేదికారోహణము. భద్రాసన మునధిష్ఠించుట, పట్ట

బంధ ధారణము, ఛత్రచామ రాదుల సమర్పణము, పురోధసుల ఆశీర్వాదములు, ఆంధ్ర పురంధ్రీ మణులు పట్టిన మంగళహారతులు, ప్రజల హర్షధ్వానములు, రాజ్యాభిషేకానంతరము ప్రతాపుఁడు ప్రజల యోగక్షేమములను విచారించుట వందిమాగధుల కైవారములు మొదలగునవి బహురమ్యముగ వర్ణింపబడినవి.

## నాటక విశేషములు

1. శ్రీమత్కాకతి గణపతి దేవచక్రవర్తికి పుత్రసంతానము లేదు. అందువల్ల కూతురు రుద్రమదేవినే తన తరువాత రాజ్యమునకు రాణిగా చేసినాడు. అయితే ఆమె రాణి రుద్రమదేవిగా గాక పురుష వేషములో పురుషోచిత భాషలో రుద్రదేవ మహారాజుగా వ్యవహరించవలెనని నియమము చేసినాడు. ఈ చారిత్రక సత్యమును యధాతథముగా స్వీకరించి విద్యానాథుఁడు రాణీ రుద్రమదేవిని రుద్రదేవ మహారాజుగానే చిత్రీకరించినాడు. ఇందు రుద్రదేవ మహారాజనగా రాణీరుద్రమదేవి యని యర్థము. ఈ చారిత్రక విషయమును మంత్రి పురోధసుల చేత కంఠోక్తిగా చెప్పించినాడు కవి.

2. రుద్రమదేవికి కూడ పుత్రసంతానము లేదు. ఆమె యేకైక పుత్రిక ముమ్మడాంబ. ఈమె కొడుకే ప్రతాపరుద్రుఁడు. రుద్రమదేవి, దౌహిత్రుడైన ప్రతాపరుద్రుని కొడుకుగా స్వీకరించి తన తరువాత అతనిని రాజ్యాభిషిక్తుని చేయును. ఈ నాటకమున ప్రతాపుని తల్లియైన ముమ్మడాంబా ప్రసక్తిగాని, తండ్రియైన మహదేవరాజు ప్రసక్తిగాని బొత్తిగాలేదు. దీనికేమైన చారిత్రక కారణమున్నదేమో కనుగొనవలయును.

3. ఇందు రుద్రదేవ మహారాజునకు (రాణీ రుద్రమదేవికి), ప్రతాపరుద్రునికి తప్ప తక్కిన పాత్రలకు పేర్లు పెట్టలేదు కవి. శివదేవయ్య వంటి మహామంత్రు లుండిరి గదా! కాకతీయ సామ్రాజ్యమున! అట్టితటి మంత్రులకైననూ పేర్లు పెట్టకపోవుటకు కారణము తెలియదు.

4. గణపతిదేవ చక్రవర్తి యేసుముహూర్తమున రాజ్యాభిషిక్తు డయ్యెనో ఆ సుముహూర్తముననే ప్రతాపరుద్రుడు కూడా రాజ్యాభిషిక్తు డగును. ఈ ముహూర్త బలమును ఒకటికి రెండు మాఱులు అయా పాత్రల చేత నొక్కి చెప్పించినాడు కవి.

# ప్రయోగ ప్రయత్నములు

ఈ నాటక ప్రదర్శనకు మహాసభల సాంస్కృతిక కార్యక్రమాల సంఘం అధ్యక్షులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారు కేటాయించిన సమయము 30 నిముషములు. ఇంతటి తక్కువ సమయమున నాటకము ప్రదర్శింపవలసి వచ్చినప్పుడు రెండు పద్ధతులున్నవి. ఒకటి :- నాటకము నందలి ఏదేని ఒక రసవద్ఘట్టమును తీసుకొని ప్రదర్శించుట. అప్పుడిది ఏకదేశిగా నుండును. రెండు :- మొత్తము నాటకమును ఆదిమధ్యావసానములు చెడకుండ, సారమును వడగట్టినట్లు సంగ్రహపఱచి ప్రదర్శించుట. ఇది సమగ్ర నాటకమగును. ఇప్పట్టున వీరీ రెండవ పద్ధతియే మేలరమని భావించిరి. ఈ నాటకమున వంద శ్లోకము లున్నవి. అనేక పాత్రములున్నవి. యథాతథముగా ప్రదర్శించిన రక్తి గట్టదు. కాని ప్రదర్శించినచో రెండు గంటలకు పైగా పట్టును. కొంతకుకొంత కత్తిరించి సుమారుగా ప్రదర్శించినచో నాటకము చాల చక్కగ రక్తి గట్టును. అప్పుడు గంటకు పైగా పట్టును. అట్టియెడ వీరీ నాటకమును సమగ్రముగా అర్థ గంటలో ప్రదర్శించుటకు పూనుకొని జాగ్రత్తగా ఎడిట్‌చేసికొనిరి. ఎడిట్ చేసిన వారు ఈ రచయిత. సరిచూసినవారు శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రి గారు. నరసింహశాస్త్రి గారీ ప్రదర్శనకు పర్యవేక్షకులుగా నుండుట ఈ బృందము వారి యదృష్టము. ఆరోగ్యపరిస్థితి సున్నితముగా నున్నప్పుడు కూడ రెండు మూడు రోజులు అర్ధరాత్రి 12 గం॥ల వఱకు రిహార్సల్సులో కూర్చొని నటులకు చతుర్విధాభి నయములను నేర్పుటకు శ్రద్ధవహించిరన్నచో వారి కార్య ప్రవణత ఎట్టిదో తెలియగలదు. ఈ నాటక ప్రయోగ ప్రయత్నములు ప్రారంభము కాగానే కొన్ని యాటంకములు వచ్చిపడినవి. అట్టితఱి ఈ కార్యమును తమదిగా భావించి నిర్విఘ్న పరిసమాప్తిగ సహకరించిన మిత్రులు శ్రీయుతులు ముట్నూరి రాధాకృష్ణమూర్తి, జి. యస్.యన్. శాస్త్రి గారల కార్యదీక్ష ప్రశంసనీయమైనది.

ఈ నాటక రిహార్సల్సు తొలుత చిక్కడపల్లిలోని ఆంధ్ర విద్యాలయము లోనూ, తరువాత పంజగుట్ట యందున్నజర్నలిష్టు కాలనీలోని కమ్యూనిటీ హాలు నందునూ జరిగినవి. 1 ఏప్రిల్ 1975 నుండి పది రోజులపాటు ఏకధాటిగా జరిగిన రిహార్సల్స్ ఫలితముగ 13-4-1975 నాడు జరిగిన ఈ నాటక ప్రయోగ

మెంతగనో ర క్తిగట్టి సంస్కృతనాటక ప్రయోగరంగ చరిత్రలో క్రొత్త పుట లను సృష్టించినది.

## పాత్ర గ్రాహుల పేర్లు

నాందీ శ్లోకపఠనము — శ్రీమతి ముట్నూరి పావని.
రుద్రదేవ మహారాజు — శ్రీమతి రాధారాణి.
(రాణీ రుద్రమదేవి)
ప్రతాపరుద్రుడు — శ్రీ సత్యనారాయణ.
మహామంత్రి — శ్రీ జి. యస్. యన్. శాస్త్రి
సేనాపతి — శ్రీ ముట్నూరి రాధాకృష్ణమూర్తి.
పురోహితుడు — శ్రీ పొన్నపల్లి లక్ష్మీనారాయణ.
విజయ వార్తాహరుడు — శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి
జ్యోతిర్వేత్త — శ్రీ అంబడిపూడి పూర్ణానందశర్మ.
మఱియు శ్రీయుతులు చల్లా ధర్మప్రసాద్, కె. వి. సుందరా చార్యులు, డా॥ వంగీపురం వరదాచార్య, పోతరాజు ఆంజనేయ శర్మ, ముట్నూరి నాగేశ్వరరావు, పాండు రంగాచార్యులు పాల్గొనిరి.
ఆర్కెష్ట్రా — శ్రీ వి. కోటేశ్వరరావు బృందము.
డ్రెస్ అండ్ మేకప్ — శ్రీ కేశవరావ్ కంపెని.
నిర్వహణ — శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి.
శ్రీ ముట్నూరి రాధాకృష్ణమూర్తి.
పర్యవేక్షణ — శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్, సంస్కృత విభాగము, ఆకాశవాణి, హైదరాబాద్ కేంద్రము.
సమర్పణ — సంస్కృత థియేటరు, హైదరాబాద్.

## మహాసభలలో ఈ నాటక ప్రయోగ ప్రాధాన్యము

తొలిసారి జరిగిన ప్రపంచ తెలుఁగు మహాసభలలో ఈ ప్రతాపరుద్ర పట్టాభిషేక నాటకము కూడ తొలిసారియే ప్రయోగింపబడి యుండవచ్చునని శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి వంటి బుధ జనులభిప్రాయ పడు

చున్నారు. కావచ్చును, సంస్కృత నాట్యరంగము శతాబ్దుల తరబడి మూల బడియున్నది. ఏ పుష్కరమున కొకసారియో ఎవ్వరైననూ సంస్కృత నాటక ములను ప్రయోగింపదలచుకొన్నచో ఎంతసేపటికినీ శాకుంతలము, ఉత్తర రామ చరితము, వేణీసంహారము మొదలగు నాటకముల వెంబడి బడుదురేగాని ఏదో నాటకోదాహరణముగా వ్రాయబడిన ఈ చిన్న చారిత్రక నాటకముపై ఎవరిదృష్టి ప్రసరించును గనుక? కావున పై మహానుభావుల వితర్కము సమంజసమేనని తోచుచున్నది. అట్లైనచో దీనిని తొలిసారి వేయించిన ఘనత తెలుఁగు మహా సభల నిర్వాహకులకు, వేసిన ఘనత "సంస్కృత థియేటరు" వారికి దక్కు చున్నదని చెప్పవచ్చును. ఈ సభలలో ఈ నాటక ప్రయోగ ప్రాధాన్యము పరి పరి విధములుగ నున్నది.

1. తెలుఁగు మహాచక్రవర్తిపై తెలుఁగు దేశపు సంస్కృత మహాకవి చేత వ్రాయబడిన ఏకైక చారిత్రక సంస్కృత నాటకము.

2. శాతవాహన, చాళుక్య, కాకతీయ, విజయనగర సామ్రాజ్యములు నాలుగూ తెలుఁగు సామ్రాజ్యములు. వీనిలో నొకదాని వైభవమును చాటు నాటకము.

3. తెలుఁగు రాణియైన రుద్రమదేవికి ప్రాధాన్యముగల నాటకమిది. పేరుకు నాయకుఁడు ప్రతాపరుద్రుడే గాని కథాచక్రమంతయు రుద్రమదేవి చేతిమీదుగా నడచును. వీరనారీ శిరోమణియు, మహాసామ్రాజ్ఞియునైన స్త్రీ ప్రాధాన్యము గల నాటకము సంస్కృతము నందు మరొకటి లేదు. తెలుఁగు దేశ మున ఎందరో వీరులు, మహారాజులు జన్మించిరి. కాని తెలుఁగు స్త్రీ జాతి శిరో మణి యీామె యొక్కతెయే. ఇది ప్రపంచ మహిళా సంవత్సరము. ఈ తరుణముననె ప్రపంచ తెలుఁగు మహాసభలు నిర్వహింపబడినవి. ఇట్టితఱి మొత్తము స్త్రీ జాతికిని, ప్రపంచ తెలుఁగు సంతతికిని స్ఫూర్తిని ప్రసాదింప గల ఈమె చరిత్రయే ఇక్కడ ప్రదర్శింపబడవలయును.

4. తెలుఁగు దేశాభిమానమును, తెలుఁగు ప్రజల భావసమైక్యతను పెంపొందింపగల ఏకైక నాటకము. తెలుఁగు దేశమును త్రిలింగదేశము, ఆంధ్రక్షమ అనియు, ఓరుగల్లును త్రిలిఙ్గనగరీ, ఆంధ్రపురీ అనియు, ప్రతాప రుద్రుని త్రిలిఙ్గదేశ పరమేశ్వరుఁడు, ఆంధ్రక్షమాభృత్ అనియు వ్యవహరించి నాడు విద్యానాథుఁడు.

ఇంకనూ త్రిలిఙ్గ దేశాధిపతి, త్రిలిఙ్గనగరీ మృగీదృశలు, ఆంధ్రపురీ రమణులు, ఆంధ్ర సైన్యములు, ఆంధ్ర చమూపతులు, ఆంధ్ర చమూభటులు, ఆంధ్ర క్షమాభృద్భటులు, ఏకశిలా నగరీ వల్లభుఁడు, విశ్వంభరా వల్లభుఁడు, ఇత్యాది సమాసములతో తెలుగు గుండెలను పుల్కరింపజేయుచూ భావోద్రేకము నుత్తాలమగునట్లు చేయునేర్పు విద్యానాధున కున్నది. తెలుఁగు ప్రజలను భావసమైక్యతా సూత్రమున బంధింపగల ఈ క్రింది శ్లోకమునే వ్రాసినాడు.

> యైర్దేశస్త్రి భిరేషయాతి మహతీం ఖ్యాతింత్రిలిఙ్గాఖ్యయా
> యేషాం కాకతి రాజ్యకీర్తి విభవైః కైలాస శైలాకృతాః
> తేదేవాః ప్రసరత్ప్రసాద మధురాః శ్రీశైలకాళేశ్వర
> ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు.
>
> (పంచమాంకము, శ్లో. 22)

(ఏమూడు లింగము లుండుట వలన ఇది త్రిలింగ దేశమను మహాఖ్యాతిని పొందినదో, ఏ త్రిలింగములు కాకతిరాజ కీర్తి విభవములచేత కైలాస శైలములుగా చేయబడినవో, శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామ నివాసులగు నా త్రిలింగాధి దేవతలు ప్రసాద మధురములైన దృక్కులతో ఎల్లప్పుడూ నిన్ను కాపాడుగాక)

ఈ శ్లోకమును రాజ్యాభిషేకానంతరము నాటకమున ఎవరో సామాన్యుడు చదువును. సంస్కృత థియేటరు వారు దీనిని నాటకాంతమున రుద్రమదేవి చేతనే చదివించి ప్రతాపరుద్రుని ఆశీర్వదింపజేయుట చాల బాగున్నదని పలువురు ఎంతో మెచ్చుకొనిరి.

5. విద్యానాథుడీ నాటకమున ప్రత్యక్షముగ ఆంధ్రదేశాభిమానము నెంతగా రేకెత్తించెనో తత్సమానాంతరరేఖపై పరోక్షముగ భారత జాతీయ భక్తిని అంతగా పురిగొల్పినాడు. ప్రతాపరుద్రుడు దిగ్విజయ యాత్రలో జయించిన దేశములని చెప్పి కాశ్మీరము నుండి కన్యాకుమారి వఱకును, అటక్ నుండి కటక్ వఱకును గల భూభాగముల నన్నింటిని ఏకఱువు పెట్టుటయే గాక రాజ్యాభిషేక సమయమున ఆయా రాజన్యు లందరూ ఓరుగల్లునకు తరలివచ్చినట్లు చెప్పుట వలన మనచేత భారతదేశ స్వరూప సందర్శనమును చేయించుటయే యీతని ముఖ్యోద్దేశ్యమై యుండునని తోచకమానదు. భారత దేశము యొక్క చరిత్ర భూగోళముల సమన్వయ మిందు కానబడుచున్నది. వాస్తవము

నకు కాకతి సామ్రాజ్యము ఆంధ్ర సామ్రాజ్యమేగాదు, దక్షిణాపథమున హిందూ ధర్మరక్షణకు శ్రీరామరక్షగా నిలిచిన తొలి హిందూ సామ్రాజ్య మనియూ చెప్పవచ్చును గదా!

6. ఆంధ్రదేశాభిమానమును, భారత జాతీయ భక్తిని పురికొల్పుటయే గాక విశ్వమానవ సౌభ్రాతృత్వమును కలిగించుటకూడ విద్యానాథుని సంకల్పమై యున్నది. నాటకాంతమున చెప్పిన భరతవాక్య తాత్పర్యము నరయుఁడు.

భూమి సమస్త సస్యసంపన్న మగుగాక,<br>
బ్రాహ్మణులు పూర్ణమనోరథులగుదురు గాక,<br>
భూపతులు ధర్మ ప్రవణైక చిత్తులగుదురు గాక,<br>
సర్వజనులు నిరామయులగుదురు గాక.

ఇట్లు ఈ మూడు భావములను ప్రబోధించు నీ ప్రతాపరుద్ర పట్టాభిషేక మను సంస్కృత నాటకమును, ఈ మూడు భావములకు పరస్పరము అవిరోధ ముగ నిర్వహింపబడిన ప్రపంచ తెలుఁగు మహాసభలలో ప్రదర్శింపజేసిన మహ నీయులందఱికీ వందనము లర్పించుచూ, సర్వశక్తి మంతుడగు పరమేశ్వరుఁడు వారికి సర్వకల్యాణములను సమకూర్చుగాక యని ప్రార్థించుచూ సెలవు తీసికొను చున్నాను.

# ఆధునిక సంస్కృత నాటకరంగ శతాబ్ది మహోత్సవ సంఘము 1975

హైదరాబాద్ సంస్కృత థియేటరువారి పిలుపు నందుకొని హైదరాబాద్ సికింద్రాబాద్ జంటనగరములలోని సంస్కృత భాషా నాటక కళాభిమానులు కొందఱిటీవల 1 జనవరి, 1975 నాడు పంజగుట్టలోని జర్నలిష్టు కాలనీ యందలి కమ్యూనిటీ హాలులో చరిత్రాత్మకమైన సమావేశమును జరిపిరి, సదరు సమావేశమునకు విజయనగరమునకు చెందిన వారును, ప్రస్తుతము హైదరాబాదులో విద్యుత్సౌధ యందు ఉద్యోగము చేయుచున్నవారునూ నైన శ్రీ బి. యస్. కె. సోమయాజులు గారధ్యక్షత వహించిరి. సమావేశమున ఇట్లు నిర్ణయింపబడినది.

విజయనగర సంస్థానాధీశ్వరులైన శ్రీ విజయరామ గజపతీంద్రులునూ, వారి కుమారులు శ్రీ మదానంద గజపతి మహారాజా వారునూ 1874 లో "జగన్నాథ విలాసినీ సభ" అను సంస్కృత నాటక సమాజమును స్థాపించి, సంస్కృతము మృత భాషయని దాదాపు నిర్ధారణగా పరిగణింపబడిన యా రోజులలో సంస్కృత భాషా నాటక ప్రయోగ పునరుద్ధరణకు పూనుకొనిరి. ఇది జరిగి 1974 నాటికి వంద సంవత్సరములు పూర్తియైనవి. వారు తలపెట్టిన యీ ప్రయత్నముల ప్రభావము వలననే యని చెప్పవచ్చును, ఈ వందసంవత్సరములలో సంస్కృత నాట్య రంగము కొంతమెఱుగు పడినది. ఈ సందర్భమున 1975 సంవత్సరాంతమునకు తెలుఁగు నాడంతట ఆధునిక సంస్కృత నాటక రంగ శతాబ్ది మహోత్సవములను నిర్వహింపవలయును. దానికై యొక సంఘము నేర్పరచవలయును ఇత్యాది. ఈ నిర్ణయాను సారము "ఆధునిక సంస్కృత నాటకరంగ శతాబ్ది మహోత్సవ సంఘము" అను సంస్థ ఏర్పాటుచేయబడినది. విజయనగరమునకు చెందిన వారెవరైననూ అధ్యక్షులుగనుండుట ఉచితముగా నుండునని సమావేశమున సభ్యులు భావించినందు వలన విజయనగర ప్రాంతము వారేయైన శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారిని ఈ సంఘమున కధ్యక్షులుగా నుంధ

వలసినదిగా అభ్యర్థన చేయగా వారానందముతో నంగీకరించిరి. ఈ క్రిందివారితో కార్యవర్గ మేర్పాటైనది.

అధ్యక్షులు- గౌ॥ శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారు
(సాంఘిక సంక్షేమం, సాంకేతిక విద్యామంత్రి)

ఉపాధ్యక్షులు- శ్రీ జి. పుల్లారెడ్డి గారు
(సుప్రసిద్ధ నేతిమిఠాయి వ్యాపార యజమానులు)

ప్రధాన కార్యదర్శి- శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రి
(అధ్యక్షులు, సంస్కృత థియేటరు, హైదరాబాదు)

సహాయ కార్యదర్శి- శ్రీమాన్ కె. వి. సుందరాచార్యులు

కోశాధికారి- శ్రీ ఆర్. కృష్ణమూర్తి

కార్యాలయ కార్యదర్శి- శ్రీ బి. యస్. కె. సోమయాజులు

వీరుగాక ఆంధ్రప్రదేశమునందలి వివిధ ప్రాంతములవారికి ప్రాతినిధ్యముండునట్లు విస్తృత ప్రాతిపదికపై కార్యవర్గము నేర్పాటు చేయుటకును, సుప్రతిష్ఠితులైన వారితో సలహాసంఘ మొకదానిని ఏర్పరచుటకును కూడ నిర్ణయింపబడినది.

వివిధ పట్టణములలో సంస్కృత నాటక గోష్ఠులను, సంస్కృత నాటక ప్రయోగములను జరిపించుట, సంస్కృత నాటక ప్రయోగములపై కొన్ని గ్రంథములను ప్రచురించుట, సంస్కృత నాటకములలో ఏకపాత్రాభినయ పోటీలను నిర్వహించుట, పండిత సన్మానములు- ఇత్యాదిగా నొక కార్యక్రమ ప్రణాళిక రూపొందింపబడి విడుదల చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈ ప్రయత్నములలో సహకరింపవలసినదిగా కోరుచూ తెలుఁగు సంస్కృతీ సంవత్సరమున ప్రపంచ తెలుఁగు సంతతికి, సంస్కృత భాషా కళాభిమానులకు, ప్రభుత్వమునకు, శుభాకాంక్షలను తెలియజేయుచూ సెలవు గైకొనుచున్నాను.